

ని రీ క్ష ణ

చిత్రకారుడు—కె. రాజయ్య (సిద్దిపేట)

## కథకాని కథ

కథకాని కథల పోటీకి రచనలు పంపేవారు కొంతమంది తమ రచనలు కేవలం చిన్న చీటీముక్కలమీద వ్రాసి పంక్తిలో పంక్తిని ఇరికిస్తున్నారు. ఇలాంటివి పరిశీలించటం కష్టం కాబట్టి, రచనలు పంపేవారు రచనకుతగ్గసైజు కాగితంమీద పంక్తికీ పంక్తికీ మధ్య బాగా ఖాళీవదలుతూ వ్రాయాలని కోరుతున్నాము. కాగితాలకు ఒకవైపునే వ్రాయడం కూడా అవసరం.

—సంపాదకుడు




ఆంధ్రసచిత్ర వారపత్రిక


## ఉత్తరాలు

### తెలుగు వెలుగులు

25-1-1961 తెలుగువెలుగులు శీర్షికలో సంగీతవిద్వాన్ శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గురించి చాలాబాగా వ్రాశారు. తెలుగుచిత్ర పరిశ్రమ నిజంగా శ్రీ ఘంటసాలకు ఎంతో ఋణపడివుంది. "మధుర విషాద రసభరితమైన ఘంటసాలకంఠం తెలుగు తల్లికి దివ్యకంఠాభరణం" అన్న మాట యథార్థం, రచయితకూ, సంపాదకునకూ నా ధన్యవాదాలు.

కె. బి. వి. సీతారామరాజు (వాల్తేరు).

* * *

శ్రీ సీతారామశాస్త్రిల వారివద్ద విద్యాభ్యాసమే ఈనాడు ఘంటసాల ఉన్నత స్థితికి కారణమంటే అతిశయోక్తి కాదు. కేవలం యమున కల్యాణిరాగమే కాకుండా, హిందోళ, భీంపలాస్, భాగేశ్వరి, మోహన రాగాలలో గీతాల్ని శృంగారంగా సింగారించి, ప్రేక్షకలోకానికి అందజేసిన గ్రహనక్షత్రం శ్రీ వెంకటేశ్వరరావు హిందోళ అతని గాత్రకంఠంలో ఉయ్యాలలూగుతుంది. ముఖ్యంగా భాగేశ్వరీరాగం అతని "శివలీల భాగేశ్వరి" అంటే అతిశయోక్తి కాదేమో ! 'చేయెత్తి జైకొట్టు తెలుగోడా' అని చేయెత్తి, దేవదాసును ఒకమాపుమాసి, 'రాజశేఖరా... మోజుతీరలేదురా' అని అక్బరును పల్కరించి, తుదకు "శేషశైలావాసా... శయనించవయ్యా" అని 'రీతిగౌళ'లో శ్రావ్యంగాపాడి శ్రీ వెంకటేశ్వరుణ్ణి పవ్వళింపజేసిన మహానుభావుడు వెంకటేశ్వరరావు.

శ్రీ వాణి (విజయనగరం).

* * *

ఈ వారం సచిత్రవారపత్రిక (25-1-61) తెలుగువెలుగులులో మధుర గాయకుడు ఘంటసాలగురించి వ్రాసిన వాక్యాలు చాలా బాగున్నాయి. 'మధురవిషాదరస భరితమైన ఘంటసాలకంఠం తెలుగుతల్లికి దివ్యకంఠాభరణం' అన్న చివరిమాటలు ఘంటసాల సంగీతంలాగే మధురాతి మధురంగా వున్నాయి. ఘంటసాలవారి గానమే గాని, గాయకుని మాబోటివారికి వారి జీవితపుటలు తిరుగవేసి అందించిన రచయితకు మా ధన్యవాదాలు.

వక్కలంక విజయభాస్కరరామారావు (అయినవిల్లి)

## గయోపాఖ్యానం

"ఐదేళ్ళ రాష్ట్ర రాజకీయ పరిణామాల సమీక్ష" ద్వారా శ్రీ వి. వి. నరసింహారావు మనమంత్రులలో గుట్టులను గొప్పగా బయట పెట్టారు. ఇలాంటివి ఇంకో 2, 3 వ్యాసాలు చదివితే, పదవీవ్యామోహ పరులైన మన మంత్రుల నిజస్వరూపాలు ఆంధ్ర ప్రజానీకానికి స్పష్టంగా తెలుస్తాయి. చూస్తుంటే నిజంగానే పరిపాలనలో ప్రజలచేయి ఏమాత్రం లేనట్లు తెలుస్తుంది.

అందే గోపాలకృష్ణ (రాజమండ్రి.)

*  *  *

25-1-61 తేది సంచికలో వెలువడిన "ఐదేళ్ళ రాష్ట్ర రాజకీయ పరిణామాల సమీక్ష", అని వి. వి. నరసింహారావుగారు వ్రాసినదిసరియైనదికాదు. కేవలము శ్రీ సంజీవరెడ్డిని ఎత్తిచూపించడమే పనిగా వున్నది. ఇంత రభస కావడానికి శ్రీ అల్లూరి సత్యనారాయణగారిదే తప్పు. శ్రీ వి. వి. నరసింహారావుగారికి అల్లూరిగారి నైజము సరిగా తెలిసినట్లులేదు. పక్షపాతముతోకూడిన ఇలాంటి వ్యాసములు ప్రచురించటం తమ పత్రికకు తగదు.

డి. వి. బాబూరావు (పమిడి)

*  *  *

## కార్టూనులు

మీ ఆంధ్రపత్రికలో కార్టూనులు చాలా బాగున్నాయి. అందులోనూ ఊమెన్‌గారి కార్టూనులు మరీ బాగుంటున్నాయి. 25-1-61 పత్రికలో "అబ్బి రఘురామరెడ్డి" గారి కార్టూను మమ్ములను తెగనవ్వించేసింది. రెడ్డిగారికి, ప్రచురించినందులకు మీకూ నా ధన్యవాదాలు.

పెండ్యాల రాధాకృష్ణ (కాకినాడ)

*  *  *

25-1-61 పత్రికలో కలువకొలను సదానందంగారు వేసిన అయ్యో! మేష్టారూ నన్ను నష్టేట్లో ముంచిపోతున్నారా? అన్న, కార్టూను చాలా బాగున్నది. ఆ కార్టూన్‌కి బహుమానం ఎందుకియ్యలేదో? బాగాలేని కర్టూన్లకి బహుమానాలిస్తున్నారు. బాగున్న వాటికివ్వడం లేదు.

వి. శేష (హైదరాబాదు)

*  *  *

## కథకానికథ

25-1-61 సంచికలో ప్రథమ బహుమతి పొందిన కథ చాలా బాగుంది. కథలో ఉన్న వ్యంగ్యం అటుంచి రాష్ట్రేతరాంధ్రులకు ఒక్కసారిగా సంక్రాంతి పండుగను సాక్షాత్కరింపజేసినది.

చేవెండ్ర రామకృష్ణారావు (నాగపూర్)

మీ సచిత్ర వారపత్రికలో చాలకాలం నుండి 'కథకానికథ' శీర్షికను ప్రవేశపెట్టి మమ్ములను ఆనందపరుస్తున్నందుకు నా ధన్యవాదాలు. ఇంతవరకు వివిధములైన హాస్యరస భంగిమలలో శీర్షిక పాఠకులను కవ్వించి నవ్వించింది. కాని ఇటీవల వచ్చిన విమర్శలను పురస్కరించుకొని చిన్న సూచన చేస్తున్నాను. 'కథకానికథ' అంటేహాస్యప్రధానమైనదిగానే భావిస్తున్నారు. దైనందిన జీవితంలో, విషాద సంఘటనలు, నీతిదాయక సందర్భాలు ఎన్నో జరక్కపోవు గదా. సందర్భాలను సంక్షిప్తంగా పాఠకులనుంచి రాబట్టి ఎన్నుకొని ఆయారసాలపోషణకు ప్రోత్సాహమిచ్చి శీర్షికను మరింత శోభాయమానంగా వెలుగొందింపజేస్తారని ఆశిస్తున్నాను.

యం. జయభారతరావు (వాల్తేరు)

*  *  *

## ఢిల్లీలేఖ

శ్రీ కృపాగారు 25-1-61 వార పత్రిక న్యూఢిల్లీ లేఖలో "ఈనాడు భారతదేశంలో ముస్లింల స్థితి ఏలా ఉందో, శిఖ్ఖిస్తాన్ ఏర్పడిన తరువాత పంజాబీ సుబా వెలుపల ఉండే శిఖ్ఖుల స్థితికూడ అల్లాగేఉంటుంది, అని వ్రాసిన వాక్యం సమంజసముగా లేదు. ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా పాకిస్తాన్‌లోనున్న ముస్లిముల స్థితిగతులకంటె భారతదేశములో ఉన్న ముస్లిముల పరిస్థితి ఎంతో బాగుంది. శ్రీ కృష్ణగారు ఇకముందైన ఇటువంటి విషయములలో తమ కలమునకు కళ్లెము వేయుదురని ఆసిస్తున్నాను.

ఆర్. ఎ. షరీఫ్ (అనంతపురం.)

*  *  *

## బ్రిటిష్ పరిపాలనలో....

25-1-1961 ఆంధ్ర సచిత్రవారపత్రికలో 'బ్రిటిష్ పాలనలో భారతజాతి పునరుజ్జీవనం' అన్న వ్యాసంలో "డల్‌హౌసీ కాలంలో నూతన విద్యావిధానం ఆరంభమై బెంటింగ్ కాలములో స్థిరపడింది." అని ఉంది. పై వాక్యమునుబట్టి డల్‌హౌసీ తరువాత బెంటింగ్ గవర్నరు జనరల్‌గా వ్యవహరించినట్లు, ఆంగ్ల విద్యను భారతదేశములో డల్‌హౌసీ ప్రవేశపెట్టినట్లు, దాని అభివృద్ధికి బెంటింగ్ కృషి సల్పినట్లు అర్థమవుతోంది. కాని అవి చారిత్రక సత్యములు కావు.

బెంటింగ్ 1828 వ సంవత్సరము నుండి 1835 వ సంవత్సరము వరకు గవర్నరు జనరల్‌గాను, డల్‌హౌసీ 1848 వ సంవత్సరము నుండి 1856 వ సంవత్సరమువరకు గవర్నరు జనరల్‌గాను వ్యవహరించారు. ఇండియాలో ఆంగ్లవిద్యను మెకాలే సహాయముతో బెంటింగ్ 1835 వ సంవత్సరములో ప్రవేశపెట్టాడు.

# ఉత్తరాలు

మీ పత్రికలో పొరపాటు దొర్లినదని భావిస్తూ, సంపాదకులను వివరణ కోరుచున్నాను.

పాలకుర్తి రంగనాయకులు (నిడుబ్రోలు.)

* బెంటింగ్‌కు బదులుగా డల్‌హౌసీ, డల్‌హౌసీకి బదులుగా బెంటింగ్ అచ్చు పొరపాటు.

## యూనియన్ జాక్

25-1-61 తేదీ ఆంధ్ర సచిత్రవారపత్రిక ముఖచిత్రంలో భారత, బ్రిటిష్ జాతీయ పతాకలను ఒకదానివెంట ఒకటి వేయించటం బాగానే ఉన్నది. కాని మీ చిత్రకారుడు యూనియన్ జాక్‌ను (బ్రిటిష్ జాతీయ పతాక) సరిగా చిత్రించలేకపోయారు. ఐమూలగా ఉన్న క్రాస్‌కుగల తెల్లని అంచుల పొడవు సమంగా ఉండరాదు. ఈ జెండాలో మూడు క్రాసులు ఉంటాయి (1) తెలుపు బాక్‌గ్రౌండ్ మీద ఎర్రటి క్రాసు (2) తెలుపు బాక్‌గ్రౌండ్ మీద ఐమూలగా ఉండే ఎర్రటి క్రాసు (3) నీలం బాక్‌గ్రౌండ్ మీద ఐమూలగా ఉండే తెల్లటి క్రాసు.

మీ చిత్రకారుడు వేసిన యూనియన్ జాక్‌లో ఈ మూడవ క్రాసు లోపించింది. ఏ దేశం జాతీయ పతాకనైనా సక్రంగా చిత్రించకపోవటం ఆ దేశాన్ని గౌరవించినట్లు కాదు కాబట్టి, పై సంచిక ముఖచిత్రం విలువ దెబ్బతిన్నదని చెప్పవలసివస్తుంది.

మీ చిత్రకారుడు చిత్రం వేసే ముందు ఏదో ఒక ఎన్‌సైక్లోపీడియాను చూచి ఉండవలసింది. లేకపోతే స్థానిక బి. ఐ. ఎస్. కార్యాలయంలో ఏ బోయ్ స్కౌట్‌నైనా అడుగవలసింది. అప్పుడీ పొరపాటు జరిగేదికాదు.

ఎం. ఎస్. సీతారామయ్య, (న్యూఢిల్లీ)

మా చిత్రకారుడు వేసిన యూనియన్ జాక్‌ను ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాలో ఉన్న చిత్రంతో దయచేసి ఒకసారి పోల్చి చూడండి.

## కాలెండర్ సంస్కరణ

4-1-60 తేదీగల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన "కాలెండర్ సంస్కరణ" అనే వ్యాసము అసంపూర్తిగా ఉన్నది. సంవత్సరమునకు సుమారు 365¼ రోజులు కాగా, దానిలో 364 రోజులకు మాత్రమే లెక్క చెప్పినారు. మిగిలిన 1¼ రోజులమాట ఏమిటి?

సంవత్సరమునకు 365 రోజుల 5 గంటల 48 నిముషాల 46 సెకండ్లు అనుదానికి 365¼ రోజులకంటె 365 97/400 రోజులు దగ్గరనుదింపు. ప్రస్తుతం ప్రపంచమంతటా అనుసరిస్తున్నది ఈ గణనే. అందుకే 4 సంవత్సరములకొకసారి లీపు సంవత్సరములో ఫిబ్రవరి నెలకు ఒక రోజు కలుపుతాము. 400 సంవత్సరములకు 97 రోజులే కలపవలసి ఉండగా మనము 100 రోజులు కలుపుతున్నాము. అంటే కావలసిన దానికంటె 3 రోజులు ఎక్కువ కలుపుతున్నాం. ఇది సర్దుబాటు చేసేందుకు, శతాబ్ది సంవత్సరములు, అనగా 100, 200, 300 మొదలయినవి మళ్ళా లీపు సంవత్సరములు కావన్నారు. అంచేత 400 సంవత్సరములలో 4 రోజులు తగ్గుతాయి కనుక, తిరిగి ఒక రోజు తక్కువవుతుంది. దీనిని సరిపెట్టుటకు 400, 800, 1200 మొదలైనవి కూడా లీపు సంవత్సరములుగా పరిగణిస్తారు. లీపు సంవత్సరములకు సంబంధించిన సూత్రమును ఇట్లు వివరింపవచ్చును : సాధారణ సంవత్సరము సంఖ్యలో 4, శతాబ్ది సంవత్సరము సంఖ్యలో 400 లు పోతే అది లీపు సంవత్సరము; పోకపోతే కాదు.

సంస్కరించిన కాలెండర్‌లో దీని నివిధముగా ఇమిడ్చినారు. ప్రతి సంవత్సరము మధ్య అంటే జూన్ 30కి జూలై 1కి మధ్య రోజుకు తారీఖూ, వారమూ ఉండవు. దీనిని "ప్రపంచ సెలవు దినము" అంటారు దీనివల్ల సంవత్సరమునకు 365 రోజులు అవుతాయి. లీపు సంవత్సరములో దీని తరువాత ఇటువంటిదే మరొక రోజు ఉంటుంది. దానిని "లీపు సంవత్సరపు సెలవు దినము" అంటారు. మామూలుగానే జూన్ 30 శనివారము, జూలై 1 ఆదివారము అవుతాయి. లీపు సంవత్సరము అయినదీ కానిదీ ఇప్పుడున్న సూత్రము ప్రకారమే నిర్ణయిస్తారు.

ఆంధ్రదేశములో మనము అనుసరించేది చాంద్రమానము కనుక, మన పండుగలను నిర్దేశించడానికి (ఒక్క సంక్రాంతికి తప్ప) ఈ సంస్కరణ మనకేమి సహాయకారి కాదు.

1961 సంవత్సరము జనవరి 1వ తేదీ ఎలాగో ఆదివారమే కనుక ఈ క్రొత్త కాలెండరు ప్రవేశపెట్టుటకు ఇదెంతో మంచి అదను. తిరిగి 1967 వరకు ఇటువంటి అవకాశము రాదు.

సి. బి. జగన్నాథరావు, (కాకినాడ)

[ఈ శీర్షికపైన చాలా ఉత్తరాలు వచ్చాయి. 4-1-'61 సంచికలో పడిన కాలెండర్ అసంపూర్తిగానే ఉన్నట్లు కనుపిస్తుంది. సి. బి. జగన్నాథరావుగారు చెప్పినట్లేకాక, ప్రతిసంవత్సరం డిసెంబర్‌కు 31 రోజులు ఇచ్చి, 31వ రోజును "అంతర్జాతీయ దినం"గా పరిగణించవచ్చు. "లీప్" సంవత్సరం రోజు నాలుగు సంవత్సరాలకొకసారి ముందే చెప్పినట్లు జూన్ 31వ రోజున వస్తుంది.



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 22

8-2-61

బుధవారం

శార్వరి మాఘ బహుళ సప్తమి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

## అక్కినేని నాగేశ్వరావు.






### ముఖచిత్రం, వ్యాసం

ఈ సంచిక ముఖచిత్రం శీర్షికకు సంబంధించిన వ్యాసాన్ని 8వ పేజీలో చూడండి. ఇదివరకే ప్రకటించినట్లుగా, ఇకమీదట కొన్ని సంచికలు ఇలాంటి ముఖ చిత్రాలతో వెలువడుతాయి. ఈ కొత్త శీర్షికను మళ్ళీ మార్చి 1వ తేదీ సంచికలో చూస్తారు.

## వచ్చే వారం......

సైలెన్స్!— వనితాలోకం
సాంబయ్యగుర్రం—బాలసాహితి
మిథ్యాసుందరి, అంతేనా?—కథలు


మాబాబులు కదూ! ఏడవకండి. నేను ఇప్పుడు ఎక్కడికీ వెళ్ళటంలేదు
దారిలో మీకుక్కుండంటే నేను ఎలా వచ్చేది చెప్పండి?
హిందూ నాయకులకు స్వాగతం
తారాసింగ్
సామ్యవాదం
తృతీయ ప్రణాళిక
ఎలిజబెత్ రాణి వెన్నెలలో తాజమహల్ దర్శించారు
వార్త



## 70

ఏ పాత్ర అయినా రక్తంలో జీర్ణించుకొని వ్యక్తిత్వంతో వైశిష్ట్యం ఆపాదించి ఆ పాత్రనే ప్రేక్షకుల మనః ఫలకాలమీద శాశ్వతంగా ముద్రింపజేసే నటనా చాతురి; కాకలుతీరిన విషాదం కరడుగట్టిన కంఠం; రసజ్ఞులచే ఔననిపించుకొనే ఔచిత్యం; నాటకరంగంలోను చలనచిత్ర రంగంలోనుకూడా సమానమైన ప్రతిభ; చలనచిత్ర రంగంలో అడుగుపెట్టి మూడు దశాబ్దాలు కావస్తున్నా నాటికి నేటికి ఒకేవిధంగా ముక్కుమాటలతో ముక్కోటి ఆంధ్రులను మురిపింప జేస్తున్న మూడక్షరాలు 'సి. ఎస్. ఆర్.' వెనుక దాగిఉన్న మహానటుడుగా రూపొందినవి.

ఇటు నాటకాలలో, అటు సినీమాలలో, ఇటు నాయకుడుగా, అటు వృద్ధుడుగా, ఇటు 'విలను' గా, అటుహాస్యగాడుగా రాణించ గలిగినవారు దేశంలో, అరుదు. వారిలో పాటా, మాటా ధారాళంగా, ధాటీగా సాగించిన వారు బహుకొద్దిమంది. నాడు నాటకాలలో కృష్ణుడుగా ఎందరినో ఆడించిన శ్రీ చిలకలపూడి సీతారామాంజనేయులును చూచినా, నేడు వెండితెరపై నకిలీకామినీ పూర్ణతిలకం ("మామకుతగ్గ అల్లుడు") ఎత్తులకుఉక్కిరి బిక్కిరి అయ్యే సి. ఎస్. ఆర్‌ను చూచినా సమర్థుడైన నటునికి నాటకం, సినిమా అనే వ్యత్యాసం గడ్డిపోచతో సమానమనిపిస్తుంది.

నాటకరంగంలో భక్తిరస ప్రదర్శనలో తనకు తానే సాటి అని నిరూపించుకొన్నారు ఆయన. చలన ఛాయారంగంలో శృంగార, హాస్య, కరుణ, శాంతరస పాత్రలకు శ్రీ ఆంజనేయులు 'అందెవేసిన చెయ్యి' అయినారు.

"తుకారాం" తుకారాం, "మాడామణి" చలాకీమనిషి, "గృహప్రవేశం" మెడియర్ తులసమ్మకొడుకు, "మాయాబజార్" శకుని, "నిత్యకళ్యాణం పచ్చతోరణం" ఛాందసుడు, "వచ్చినకోడలు నచ్చింది" త్రాగుబోతు, "దేవదాసు" శాంతిమూర్తి, "మామకు తగ్గ అల్లుడు" వృద్ధ ప్రేమికుడు వంటి పాత్రలు చిరస్మరణీయమైనవంటే చిలకలపూడి వ్యుత్పన్నతే ప్రధానకారణం.

సినీరంగంలో ఒక తరహా పాత్రకు సరిపోయే కొత్తనటుడు వచ్చాడు అంటే పాత నటునిపై మోజుతగ్గి రాలిన పూలలా పడిపోవడంకద్దు. శతాధిక చిత్రనటుడు సి. ఎస్. ఆర్. 64 వ ఏట కూడా రెండుమూడు తరహాల పాత్రలకు తప్పనిసరిగా ఎన్నిక అవుతున్నారంటే నటనలో ఆయన వైశిష్ట్యానికి వేరే నిదర్శన మక్కరలేదు.

వాచకానికి వాడిచూపూ, శిరచ్ఛాలనమూ, హస్తవిన్యాసమూ జోడించి పాత్ర ధారణప్రతిభతో ప్రేక్షకులను ముగ్ధులను చెయ్యడంలో శ్రీ ఆంజనేయులు మాంత్రికుడు. ఉచ్చారణలో చిలకలపూడి చాతురి ఒక ప్రత్యేకత సంపాదించుకొంది. అందుచేతనే ఆయన ధరించిన పాత్రలలో కనీసం ఒక్కటైనా ఆయనకు తగినదికాదని చెప్పే ధైర్యం ఎంతటి సునిశిత విమర్శకునికైనా లేకపోతున్నది.

సి. ఎస్. ఆర్. కు పొన్నూరు స్వగ్రామమైనా నాటక అభినయంలో పరిణతి పొందడానికి అవకాశమిచ్చినది ఒంగోలు. షేక్స్పియర్ నాటకం "మర్చెంట్ ఆఫ్ వెనిస్"లో ఏ ముహూర్తాన షైలాక్ పాత్ర ధరించారో కాని, సినీరంగంలో ఎక్కువగా "నెత్తురుపిండే" భూమికలే ఆయననువరించి వచ్చినవి. 1922 కు నాటకరంగంలో ఒకస్థానమేర్పరచుకొన్నారు.

"రామదాసు"లో రామభక్తుడుగా నటించినప్పుడు బళ్లారి రాఘవ అంతటివారే 'శభాష్' అన్నారు. స్వంత నాటక కంపెనీ స్థాపించి "పతితపావన", "తుకారాం" నాటకాలు ప్రదర్శించారు. 1936 లో శ్రీ హెచ్. ఎమ్. రెడ్డి "ద్రౌపదీ వస్త్రాపహరణం" సి. ఎస్. ఆర్. చే సెల్యులాయిడ్ వస్త్రధారణ చేయించింది.

అన్నిరంగాలలోను అజేయుడైన శ్రీ ఆంజనేయులు దర్శకుడుగా వేలుపెట్టి వెంటనే వెనుకకు తీసుకొన్నారు. పరిమితి తెలుసుకొని, ఉన్న పరిధిలో ఉజ్జ్వలంగా ప్రకాశించ యత్నిస్తున్న విజ్ఞుడు ఆయన.

తానై తనఘనత చెప్పుకొనని మనీషి. ముచ్చటైన మూడక్షరాల పేరుతో తెలుగువారి హృదయాలలో తనకొక విశిష్టమైన స్థానం ఏర్పరచుకొని, వినోదం చేకూర్చి, తన తరంవారికి ముందుతరాలవారికి కూడా నటనలో గీటురాయి అనిపించుకొన్న మేటి శ్రీ సి. ఎస్. ఆర్. నటలోకానికి ఒక ధ్రువతార.



తెలుగులో నామవాచకాలకు నిఘంటువంటూ ఒకటి ఎవరైనా తయారుచేస్తే "నాగేశ్వరరావు—అక్కినేని" అనే పేరుక్రింద, "లక్ష్యశుద్ధి...మొండి పట్టుదల....ధీమా పొగరు.....మొండిపట్టు...పేరాశ ఓర్పు....నేర్పు.....మొండిపట్టు....పెద్ద ఆశయాలు అదృష్టం.....మొండిపట్టు ..... లక్ష్యసిద్ధి" అని టూకీగా రాసుకోవచ్చు.

ఇది నిత్య సంగ్రామశీలుడు నాగేశ్వరరావు కథ. అతని కథలో "జరిగిన—కథ" .... జరుగుతున్నకథ... జరుగనున్న కథ.

పుష్కలంగా డబ్బూ, పెద్ద స్టారన్న పేరూ, పొడుగుపాటి కారూ, ఎత్తైయిన మేడా సంపాదించడంతో లక్ష్యం సిద్ధించినట్టే అనుకునేపక్షంలో ఎవరికైనాసరే కథ అంతా కలిపి ఇంతే. స్టార్ అన్న పేరే కాక మంచినటుడు అన్న పేరు గడించుకోవాలనీ, అది పది కాలాలు నిలబడేటట్టుగొప్ప ఫలితాలు సాధించాలనీ, సత్కార్యాలు సాధ్యమైనన్నిచేసి, నిండైన జీవితం సాగించిన వ్యక్తి కావాలనీ ఆ కాంక్షించే నాగేశ్వరరావు కథలో మాత్రం పై వాక్యాలు ఇంటర్వెల్‌వరకే వస్తాయి.

స్టారు కావడానికి పూర్వపు జీవితానికీ, తరువాతి జీవితానికీ హోదాలో, అంతుస్తులో, పేరులో, ప్రతిభలో తేడా వుంది తప్ప, నాగేశ్వరరావు తరహాలో, తీరులో, సమస్యలపట్ల వైఖరిలో, మొండి పట్టుదలలో, కష్టపడడంలో భయపడడంలో భేదంలేదు. పద్దతుల మోస్తరు నాడూ, నేడు కూడా ఒకటే. పాతికేళ్ళక్రితం వెంకటరాఘవపురంనుంచి క్రోసెడు దూరాన కుదరవల్లిలో డ్రామా కంపెనీ స్టేజిమీద "తార" వేషం కట్టడానికి ఎంత అగ్గగ్గలాడుతూ పరుగెత్తేవాడో, ఇప్పుడు పెద్ద స్టారు అయిన రోజునా అడయారులో ఇంటినుండి కోడంబాకంలోని స్టుడియోలో సెట్‌మీదికి అంత అగ్గగ్గలాడుతూనే వేళ తప్పక వెళ్తున్నాడు. ఎటొచ్చి ఇప్పుడు పరుగెత్తే బదులు కారెక్కుతాడు అంతే. ఆనాడంతటి ఉత్సాహం తోనూ, శ్రద్ధా సక్తులతోనూ ఈనాడూ తాను నటించే పాత్రలగురించి ఆలోచిస్తున్నాడు. మథన పడుతున్నాడు. భయపడుతున్నాడు. బెంగపెట్టుకుంటున్నాడు. ఆశపడుతున్నాడు దురాశపడుతున్నాడు.

## 'కారు' బురద

పుష్కరంక్రితం—తను స్టారువాల్యూలేని కొత్త నటుడుగా ఉన్నకాలంలో ఒక రోజున ఒక ఫిలిం కంపెనీతో వేషంగురించి ఇంటర్వ్యూకోసం వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు తేనాంపేటలోని ఒక చిన్న యింట్లో ఉండేవాడు. ఆంధ్రాడీనుంచి లాల్చీపై జమా తెచ్చుకు వేసుకు ముస్తాబై సైకిలు తీసుకుబయల్దేరాడు. బయట వర్షం కురుస్తోంది. రోడ్లు బురదగా ఉన్నాయి. జల్లు తగ్గగానే సైకిలు ఎక్కబోయాడు. అంతలో ఒక పెద్ద కారు రివ్వున దూసుకుపోయింది. దాని జోరుకి రోడ్డుమీది బురద లేచి ఇతని బట్టల్ని పాడుచేసింది. ప్రాణం ఉసూరుమంది. మనసు చివుక్కుమంది. ఈరోజున తన కారులో వెళ్తున్నప్పుడు అది గుర్తు చేసుకుని—ముఖ్యంగా వాన రోజున—డ్రైవరును హెచ్చరిస్తు ఉంటాడు. బహు నెమ్మదిగా ఎవరిమీదా బురద చిందకుండా నడపమని....నాగేశ్వరరావులో తేడా లేదు.

ఉన్నతేడా ఒక్కటే. అపుడు చదువు సంధ్యలూ తిండీ తిప్పలూ, నిద్ర వగైరాలకు 24 గంటలలోనూ 22 గంటలు ఖర్చు పెట్టగా, రెండు గంటలు తను ఆరాధించే కళకు మిగిలేవి. ఇప్పుడు 16 గంటలు స్టుడియోలో నటిస్తూనో, కథలు వింటూనో, చర్చిస్తూనో గడపగా, 6 గంటల నిద్రపోతే, జీవితం



'పెళ్ళికానుక'లో బి. సరోజతో



'మహాకవి కాళిదాసు'లో

అన్నదానికి రెండు గంటలు మిగుల్చుకోగలుగుతున్నాడు.

* * *

నాగేశ్వరరావు జన్మస్థలం గుడివాడ తాలూకా వెంకటరాఘవపురం అనీ, తేదీ సెప్టెంబరు 20 అనీ అంటారుగానీ అవి సరికాదు. అతని జన్మస్థలం కువరవల్లిలో చిన్న నాటక స్థలం. పెరిగి తిరిగిన చోటూ అదే. అందులో కనకతార నాటకంలో అతను తార వేషం కట్టి రెండుసార్లు వన్స్‌మోర్ అనిపించుకొన్న ప్రదర్శనం జరిగినదే అతని పుట్టిన రోజు. ఆకాలంలో చాలా మంచి కంపెనీ అని పేరొందిన ఎక్సెల్సియర్స్ డ్రామా క్లబ్‌లోచేరి, 'ఆశాజ్యోతి' నాటకంలో ఆడవేషం వేసినరోజే అతను ఒక వృత్తి విద్యాపరీక్షలో ఉత్తీర్ణుడై నటనోద్యోగంలో చేరిన రోజు. 1942 లో పి. పుల్లయ్యగారి 'ధర్మపత్ని' చిత్రంలో వేషంవేసి పిట్టకొంచెం కూతఘనం అనిపించుకున్న రోజే అతను ఒక పరీక్ష తప్పి, తద్వారా పెద్ద పరీక్షలలో నెగ్గడానికి కావలసిన మొండి పట్టుదల, కసి సంపాదించుకున్న రోజు. 1944 లో ఘంటసాల బలరామయ్యగారి సీతా కల్యాణంలో రాముడుగా కెమేరాముందు నిలబడి మొట్టమొదటి టేకులోనే ఓ. కె. అనిపించుకున్న క్షణమే అతని సినీ నట జీవితానికి ప్రారంభోత్సవం జరిగిన ముహూర్తం.

## రెండు సమస్యలు

చేరిన ముహూర్తంనుంచి అతనికి రెండు గడ్డు సమస్యలు ఎదురయ్యాయి. ఒకటి నాటకాలలో తిరిగి పెరిగి రంగస్థలనటన బాగా వంటబట్టిపోవడం. ఇది సినిమాలో నటనకు ఎంత గొప్ప పునాదో ఈ శిల్పానికి అంత పెద్ద విరుగుడు కూడా—ముఖ్యంగా ఆకాలపు రంగస్థల నటనా శిల్పం.

రెండవది నాటక రంగంమీద వేసినవన్నీ ఆడవేషాలే కావడం. అందువల్ల ఆపోకడలు, వయ్యారం, తిప్పుకోవడం కూడా బాగా అలవాటయిపోయాయి. సినిమాలో నటుడు కావడానికీ, హీరోగా పైకి రావడానికీ ఈ రెండూ రెండు ప్రతిబంధకాలయ్యాయి. ఆ రోజులలో తన ఈ పద్ధతులను కొత్త పద్ధతులలో మార్చుకుంటూ, తనదనతగ్గ శైలి రూపొందించుకుంటూ, నిలదొక్కుకోవడానికి నాగేశ్వరావు పడిన శ్రమ, చేసిన నిరంతర సాధన అతనికి గురుతుల్యులయిన పెద్దలను కూడా ముగ్ధులను చేసింది. అతనంటే గిట్టని వాళ్లలో కూడా గౌరవ భావం కలిగించింది.

ఏ నటుడికైనా ఇది చాలా గడ్డు పరీక్ష. ఒకవంక పాతది వదుల్చుకోవడం, కొత్తది నేర్చుకోవడం, అందులో పనివాడితనం సంపాదించడం. మరొకవంక చేస్తున్న కృషిపట్ల విమర్శలు; హేళనలు; వెనకబడిపోతామన్న భయం. అంతా అయిపోయిన తరవాత సింహావలోకనం చేసుకుందికి ఎంత బాగుంటుందో, జరుగుతున్నప్పుడు అంత బాధాకరంగా ఉంటుంది ఇది. ఈ రకమైన బాధలోంచి సంఘర్షణలోంచి పైకి చొచ్చుకొని వచ్చాడు నాగేశ్వరరావు.

అలా కొంతదూరం పోగాపోగా, కొన్ని రీళ్ళు తిరగ్గా తిరగ్గా "ఫోక్ లోర్ హీరో కెద్దూ" అన్న పేరొచ్చింది. అతను వేసిన చిత్రాలలో నూటికి 75 వంతులు జానపద చిత్రాలే. అప్పుడు తయారైనవీ ఎక్కువగా డబ్బొచ్చినవీ అవే. ఫోక్‌లోర్ హీరో అనిపించుకోవడం అవమానం ఏమీ కాదు. మిగతా వేషాలకు అది ఎందునా తీసిపోదు. సమర్థుడికి అన్నీ ఒకటే. అయినా అలాటి ముద్రపడడం సహించలేకపోయాడు నాగేశ్వరరావు. మిగతా పాత్రలు ధరించలేనన్న

విమర్శ అందులో వినబడిందతనికి. నటుడైనవాడు అన్ని తరహాల భూమికలూ నిర్వహించాలి. అన్ని రసాలూ పోషించడం నేర్చుకోవాలి, అన్న భావం కలిగింది. మిత్రులు శ్రేయోభిలాషులూ వారించారు. ఇది చాలా చిక్కుల ఉచ్చులతో కూడిన పరిశ్రమ. తొందరపడి అడుగులువేస్తే దెబ్బ తింటావు అని.

## వైవిధ్యం

ఒకరోజున "షోక్ హీరో" అని పేరుపడ్డ నాగేశ్వరరావుకి, ఇన్ని రకాలగొప్పచిత్రాలు వచ్చినతరువాత ఈరోజున ఆ పేరు పెట్టి చూస్తే ఎబ్బెట్టుగా వుంటుంది. ఇతనేమిటి షోక్ హీరో అనిపిస్తుంది. (అతను నటించలేదనికాదు) ఈరోజున అతను, తెలుగు సినిమాలో వచ్చిన పాత్రలలో అన్నిరకాలూ వేసి సాధించాడు. దాదాపు అన్నిటా ఔననిపించుకొన్నాడు. కొన్నిట జోహారులందుకొన్నాడు. అతని చిత్రాలలో గొప్ప

## నాగేశ్వరరావు

గా చెప్పుకోతగ్గవి-కన్నతల్లి, దేవదాసు, విప్రనారాయణ, దొంగరాముడు, తెనాలి రామకృష్ణ, కృష్ణమాయ, జయభేరి, కాళిదాసు...చిత్రాలలో పాత్రలు. వీటిలో అతను ఆమోదించనివి ఒకటి రెండు ఉండవచ్చు. అతను ఎన్నికచేసి చెప్పేవి మరొకటి ఉంది—పెళ్ళినాటి ప్రమాణాలు చిత్రంలో కథానాయకుడు. కాని ఈ వాక్యకారుడు, ఇతడిలాగే మరెందరో చలనచిత్రాభిమానులూ దీనిని హర్షించలేకపోయారు. కథావస్తువులో పస ఉండవచ్చు; కాని చిత్రణలో, నటనలో అద్భుతమైన అంశ ఏమీ కనబడలేదని వీరి అభిప్రాయం. అందులో నాగేశ్వరరావు నటన పూర్తిగా...రాణించలేదు. మితి తప్పింది.

అసలు ఇక్కడ ఒక ముఖ్యవిమర్శ రాక తప్పదు. లలితమైన, సున్నితమైన హాస్యం ప్రదర్శించడంలో నాగేశ్వరరావు నటన — ఇతర రసాలను పోషించడంలో ఉన్న స్థాయిని అందుకొనటంలేదనిపిస్తుంది. నాగేశ్వరరావుకుగల ప్రతిభను అర్థంచేసుకుని, అంచనాకట్టగలిగినవారికి, చలాకీతనాన్ని సమర్థంగా చూపించగా చూసినవారికి ఈ ఒక్క అంశంలో కొంత అసంతృప్తి కలుగుతుంది. ఆంగ్ల,అమెరికన్‌చిత్రాలలో అలెక్ గిన్నిస్‌వంటి మహానటులు ప్రదర్శించే లలితమైన సొగసైన నటనను ఈ దేశంలో సాధించగలవారు ఎందుకు ఉండరాదు అన్న ప్రశ్న చర్చకు వచ్చినపుడల్లా తెలుగువాడికి నాగేశ్వరరావు పేరుజ్ఞాపకంవస్తుంది. పెళ్ళిసందడి, నాటిప్రమాణాలు, కృష్ణమాయ వగైరా చిత్రాలు చూస్తూన్నంతసేపూ "ఇపుడుకొంతసేపు హాస్యం చేదాం" అన్న వార్నింగు ఇచ్చి హాస్యాన్ని ఉద్ధరిస్తున్న ధోరణిలో అ



అంజలీ వారి "ఋణానుబంధం" లో గిరిజతో



'వెలుగు నీడలు'లో సావిత్రితో

పని చేయకపోతే నేం అని మనసు చివుక్కు మంటుంది.

## దేవదాసు

విషాద ప్రధానపాత్రల నిర్వహణలో నాగేశ్వరరావుగురించి రెండు అభిప్రాయాలు లేవు. అతని దేవదాసు, సలీం మంచి పేరు గడించాయి. "దేవదాసు" దేశాన్ని ఊపి వేసింది. ఈతరంవారిలో ఇంత బాగా నటించినవారు లేరనిపింపజేసుకుంది. చలనచిత్ర సీమలో అతనికి ఒకగొప్పస్థానాన్ని కల్పించి, మరింత గొప్పవిజయాలు సాధించడానికి అవకాశాలూ, మార్గాలూ చూపించింది.

ఇక్కడే మరో విమర్శ. ఈసారి విమర్శకుడు నాగేశ్వరరావే.

"దేవదాసుపాత్రకి అంతటి ప్రజాదరణ రావడానికి కారణం నా నటనకన్నా ఆ పాత్రలో సహజంగావున్న గొప్పతనం. అందరి కరుణనూ, సానుభూతినీ దోచుకోగల దాని వ్యక్తిత్వం...నా నటన బాగులేదనను. నేను కష్టపడలేదనను. ఎన్నడూ లేనంతగా దానికై శ్రమపడ్డాను. అయినా ఇది అంతటి ప్రశంసలకు తగదేమోనని...ఇలా అనడంలో నా ఉద్దేశ్యం, నా అభిమానుల అభిరుచిని కొట్టిపారేసి తక్కువ చేయడం ఎంత మాత్రం కాదు. నా మనసుకు తోచిన అభిప్రాయాన్ని—నేను నమ్మినదాన్ని కూడా, చెప్పకపోవడమే" అంటాడు నాగేశ్వరరావు.

"ఒకొక్కసారి కళాకారుడికి ప్రియమైనది రసికులకు నచ్చదు. రసికులు ఆకాశానికెత్తి మెచ్చినది కళాకారుడికి తృప్తి కలిగించదు. అది అంతే. తప్పొప్పుల చర్చ కాదు ముఖ్యం. ఏది సత్యం అన్నదే" అంటాడతను.

అందువల్ల ప్రేక్షకులంతా ఒక పాత్రను మెచ్చుకుంటే సంతోషించవచ్చునుగాని, కళాకారుడు గాదానివిలువలునిర్ణయించుకునే వేళ అందులో అవకాశం ఎంత, ఉపయోగించుకున్నదెంత, సాధించబోయినదెంత, సాధించినదెంత, ఇతర అంశాల తోడ్పాటు ఎంత అనేవి చూచుకుంటాడు. అంతేతప్ప ఒక చిత్రం రజతోత్సవాలు జరుపుకొంది గదా అని, అందులో తన భూమిక నిస్సారమైనదైనా—తాను పరాకాష్ఠనందుకొన్నానుకోవడం పొరబాటు.

"మనపై మరొకరు విచారణ జరిపినపుడు మంచివాళ్లనిపించుకుందికి ప్రయత్నించవచ్చునేమోగాని, మనమే న్యాయనిర్ణేతగా కూర్చున్నపుడు అలా చెయ్యడం ఆత్మవంచనే అవుతుంది" అని నాగేశ్వరరావు నమ్మకం.

## విమర్శలు

నాగేశ్వరరావులో విమర్శను సహించగల శక్తేగాదు; ఆహ్వానించగలశక్తీ, ఆసక్తీ ఉన్నాయి. విమర్శే అతడి ప్రగతికి దోహదం చేసినశక్తి; అతని జైత్రరథాన్ని లాగిన పంచకల్యాణి. సినిమా నటులలో అతను ఎదుర్కొన్నన్ని విమర్శలు మరెవరూ ఎదుర్కొని వుండరు. అన్నిరకాల విమర్శలు, అంత తీవ్రమైనవి, అంత జుగుప్సాకరమైనవి, అన్యాయమైనవి, మరెవరికీ తగిలి ఉండవు; అంత న్యాయమైనవి, ప్రేమపూర్వకమైనవి, గౌరవంతో నిండినవీ కూడా మరొకరికి లభించి ఉండవు. ఒక ఘట్టంలో విమర్శలు అతన్ని క్రూరంగా హింసించాయి. క్షోభ పెట్టాయి. గ్లిసరిన్ లేకుండా కంట తడి పెట్టినది ఆ ఒక్క సందర్భంలోనే. అది అపనింద పడిన సందర్భం, అది లేత వయసు. అది లేత మనసు.

"మంచిగా ఉండడం, సద్భీలాన్ని నమ్ముకోవడం అపరాధమా?" అన్న భయంకరమైన సందేహం కలిగించాయి ఆనాటి ఆ విమర్శలు అంత క్రూరంగా గాయపరిచాయి. "మంచికి ఫలితం ఆలస్యంగా వస్తుంది—పాలలో పంచదార కరిగినట్లు; చెడ్డకి దుష్ఫలితం క్షణంలో కనిపిస్తుంది పాలలో విషబిందువులా" అని తోచింది నెమ్మదిమీద.

మొత్తానికి తరవాత నాగేశ్వరరావుకు, విమర్శలకు ధైర్యంగా తట్టుకు నిలబడగల

సత్తాను, సత్యమైనదాన్ని అంగీకరించగల క్రమశిక్షణను అదే ప్రసాదించింది. విమర్శలను వాటి గుణదోషాలనుబట్టి వేరుపరచే వివేకాన్నిచ్చింది.

"విమర్శ న్యాయంగా ఉండి, సహృదయంతో బాధ్యతాయుతంగా ఉన్నదైతే సంతోషిస్తాను, కృతజ్ఞతతో స్వీకరిస్తాను–"

"విమర్శకుడు దూకుడుగా, పూర్వాపరాలు చూచుకోకుండా, బాధ్యతా రహితంగా వస్తే నవ్వుకుని, జాలిపడి ఊరుకుంటాను—

"విమర్శ దురుద్దేశంతో కూడి, అన్యాయంగా, క్రూరంగా ఉంటే అసహ్యించుకుంటాను" అంటాడు నాగేశ్వరరావు.

విమర్శ ప్రశంసకి రూపాంతరమని చాలా మందికి తెలుసుగాని తమదాకా ఆ కెరటం వస్తే కాళ్ళు వెనక్కి లాక్కుంటారు చాలామంది.

నాగేశ్వరరావు కొత్తచిత్రంలో బాగా

# నాగేశ్వరరావు

నటిస్తే టీ-పార్టీలు ఇచ్చుకునే అభిమానులున్నారు; పొరబాటు చేస్తే కంటనీరు పెట్టి ఏడ్చేసే విద్యార్థినులున్నారు.

"వీరందరి అభిమానానికీ, ప్రేమకూ ప్రతినిత్యం పాత్రత గడిస్తూ అర్హత నిరూపించుకోవడం నా పవిత్రబాధ్యతగా ఎంచుతూ ఉంటాను" అంటాడు నాగేశ్వరరావు.

* * *

రోజుకి 24 గంటలు. అందులో నాగేశ్వరరావు స్టుడియోలో పనిచేసేది దాదాపు 16 గంటలు. నిద్ర 6 గంటలు. మిగిలేది రెండుగంటలు.

ఈ రెండుగంటలలోనే అతను నవ్వడం, సుఖపడడం, సుఖపడుతున్నానన్న విషయం జ్ఞాపకం చేసుకుని దానివల్ల కలిగే ఆనందం పొందడం, వ్యక్తిగతసమస్యలగురించి బెంగపెట్టుకోవడం, బాధపడడం, పిల్లలతో ఆడడం, పత్రికలవారితో, మిత్రులతో, ఇతర రంగాలకు చెందిన పెద్దలతో చర్చలు జరపడం అన్నీ జరగాలి. ఇదే జీవితం. మిగతాదంతా నటజీవితం. అదంతా ఇంకో పాత్ర తాలూకు సుఖదుఃఖాల అనుభూతిని పొంది, ఇంకొకళ్ల జీవితాన్ని జీవించడం. నటించడం.

ఇందువల్ల ఈ కొన్నేపే నా నటన మానేసి నిజంగా, ఉధృతంగా, ఉత్సాహంగా జీవించాలని నా ఆశ...అందికే నా మనసుకు తోచిన నిజం ఆడుతూ ఉంటాను. ఒక్కొక్కసారి అది నిష్ఠురం అవుతుంది" అంటాడు నాగేశ్వరరావు.

ఈ రెండుగంటలలోనే అతను కొత్త విషయాలు తెలుసుకుంటాడు. కొత్త కథలు ఎన్నిక చేసుకుంటాడు. ఆశలు పెంపొందించుకుంటాడు. నేర్చుకోవలసింది, సాధించవలసింది అంతా ముందు ఉంది అని తెలియజెప్పుకుంటాడు. అసాధ్యాలుగా కనిపించే లక్ష్యాలు పెట్టుకుంటాడు. స్పష్టంగా తేల్చుకుంటాడు. వాటికోసం సాధన అరంభిస్తాడు.

"లక్ష్యశుద్ధి... మొండిపట్టు... దురాశ... ధీమా... పొగరు... మొండిపట్టు ఓర్పు, నేర్పు ... పెదఆశయాలు ... మొండపట్టు ... (అదృష్టం ప్రశ్న లేదు నాగేశ్వరరావుకు సంబంధించినంతవరకు) సంకల్పబలం, సాధన ...లక్ష్యసిద్ధి...

ఇదీ—నిత్యసంగ్రామశీలుడు నాగేశ్వరరావు కథ; అతని కథలో "జరిగిన-కథ" జరుగుతున్న కథ...జరుగనున్న కథ. ★



'కన్నకూతురు'లో అంజలితో

జిల్లావిద్యాశాఖాధికారి పాఠశాల తనిఖీ చేస్తున్నాడు. ఆఖరిని నాలుగవఫారంకు వెళ్ళి ఇంగ్లీషు ఉపాధ్యాయుని విద్యార్థులను ప్రశ్నలు అడగమన్నాడు.

ఆఉపాధ్యాయుడు ఒకవిద్యార్థిని "వ్రాటీజ్ మెంట్ బైలిస్టెన్" అని అడిగాడు.

"ఎవ్రీంటు క్లోస్" అన్నాడు ఆవిద్యార్థి.

"యూఆర్ ఆల్ వ్రాంగ్" అన్నాడు ఆవిద్యాశాఖాధికారి.

—బాపనపల్లె అర్జునయ్య (తిరుపతి)



సంగనేర్ (జయపూర్) విమానాశ్రయంలో రెండవ ఎలిజబెత్ రాణికి, ఆమె భర్త డ్యూక్ ఆఫ్ ఎడింబరోకు రాజస్థాన్ గవర్నరు, ముఖ్యమంత్రి ప్రభృతులు (జనవరి 22 న) స్వాగతమిచ్చిన దృశ్యం.

న్యూ ఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణ

# ఎలిజబెత్ రాణి అభిజాత్యం: రక్షణశాఖలో "హామనాలయుగాని"కి నాంది

ఢిల్లీలో ఈ వారం సంబరంతో గడిచిపోయింది. బ్రిటిష్ చక్రవర్తి కుమార్తె రెండవ ఎలిజబెత్ రాణి మొదటి సారిగా భారతదేశం దర్శించడానికి శనివారం (జనవరి 21 వ తేదీ) నాడు ఇక్కడకు రావడంతో ఈ వారం ప్రారంభమైంది. పరిస్థితులకు ఒదిగి ఉండటంలో ఎంతో ప్రావీణ్యం చూపిన బ్రిటిష్ వారికి ఆమె చిహ్నం.

తూర్పు ఇండియా కంపెనీని, భారతదేశంలో వాణిజ్యం సాగించుకునేందుకు అనుమతిస్తూ ఒకటవ ఎలిజబెత్ రాణి 1600 సంవత్సరం డిసెంబరు 31 వ తేదీన అధికార పత్రం ఇచ్చారు. ఈ వాణిజ్య సంబంధం క్రమేణా పెరిగి, తుదకు మహా సామ్రాజ్యంగా అభివృద్ధి చెందింది. దీనినే (ఈ సామ్రాజ్యాన్నే) కర్జన్ ప్రభువు బ్రిటిష్ చక్రవర్తి కిరీటంలో ప్రకాశవంతమైన ఆభరణమని అభివర్ణించాడు. ఈనాటి స్వయంపరిపాలనా వ్యవస్థలను గూర్చి ఆనాడు వారు సమగ్రంగా ఊహించక పోయినా, 1857 కు పూర్వమే బ్రిటిష్ వారు భారతదేశంలో సంపూర్ణ స్వయంపరిపాలనా వ్యవస్థను అభివృద్ధిపరచ దలచినట్లు సూచించారు.

హేస్టింగ్సు ప్రభువు 1818 లో ఇలా వ్రాశారు: "బ్రిటన్ యాదృచ్ఛికంగా ఈ దేశంమీద సంపాదించిన అధికారాన్ని ఉదాత్తమైన సిద్ధాంతాల ప్రభావానికి లోనై త్యజించే కాలం ఎంతో దూరంలో లేదు. అయితే ప్రస్తుతంలో మాత్రం ఆ పని చేసే వీలు లేదు. తాత్కాలికంగా తమ పరిపాలన క్రిందకు వచ్చిన ప్రజలవాగరిక వికాసానికి, ధర్మ మార్గంలో స్వయంగా వయనించ గలిగే శక్తిని వారికి సమకూర్చడానికి, తమ సార్వభౌమాధికారం వినియోగించామని సగర్వంగా చెప్పుకునే అవకాశం బ్రిటన్‌కు అప్పుడు లభిస్తుంది."

రాణీగారు ఎంతో సరసురాలు. ఆమె గొప్పలు చెప్పుకోలేదు. "భారత దేశంలో రెండు శతాబ్దాల బ్రిటిష్ పరిపాలన" గూర్చి రాష్ట్రపతి ముచ్చటించినా నిజానికి ఆమె ప్రసంగంలో ఆ ప్రస్తావనే లేదు.

స్వయంగా చూస్తే, ఏ విషయాన్ని అయినా నమ్మకపోవటం అంటూ జరుగదు. రాణిని చూచిన తరువాత గాని, బ్రిటిష్‌వారికి ఆమె కనిపిస్తే సరి ఎందుకంత ఆనందం, ఉత్సాహం కలుగుతాయో అర్థంకాదు. విండ్సర్ భవనం చరిత్రలో బహుశః మొదటి సారిగా ఆమె పత్రికా ప్రతినిధులతో యథేచ్ఛగా ప్రసంగించారు. ఆమె అభిజాత్యం, మాట తీరు, నిరాడంబరత, కాకలు తీరిన రిపబ్లికన్లను సైతం జయించ గలిగాయి. గులాబి రంగు దుస్తులు, వజ్రాలు పొదిగిన బ్రూచి, దానితో సరిపోయే హాటు ధరించి ఆమె, వాతావరణం మొదలుకొని, క్రికెట్ వరకు గల సర్వ విషయాలను గూర్చి చర్చించారు. ఇతరులు చెప్పే విషయాలను ఎంతో శ్రద్ధగా విన్నారు. హాస్యంలో ఆమెకు గల అభినివేశం స్పష్టంగా వెల్లడి అయింది.

# న్యూఢిల్లీ లేఖ

ఈ వారం విశేషాలను గూర్చి ఆలోచిస్తే బ్రహ్మాండమైన చిత్రం ఒకటి మన కళ్ళకు కనిపిస్తుంది. అది మన ప్రధాన మంత్రి చిత్రం. ఆయన మూలంగానే రాణిగారు ఈనాడు మన దేశంలో ఉన్నారు. ప్రపంచ రాజ్యాలలో భారత దేశానికి ఒక స్థానం కల్పించింది కూడా ఆయనే. కాని ఆయన చుట్టూ ఉన్నవారు సూక్ష్మాతిసూక్ష్మంగా ఆయనను పోలినవారో, లేక తెలివిహీనులో, లేక పొగడటమే లక్ష్యంగా పెట్టుకున్న వారో అయి ఉండటం, వారిని తప్పించుకొని ఆయన బయటపడలేకపోవటం నిజంగా ఆయన దురదృష్టం.

*　　*　　*

పదాతిబలం ప్రధానాధికారి జనరల్ తిమ్మయ్య చివరిసారిగా ఈ ఏడు రిపబ్లిక్ దినోత్సవ సైనిక విన్యాసాలకు అధ్వర్యం వహించారు. భారతదేశంలో జన్మించిన గొప్ప సైనికాధికారులలో జనరల్ తిమ్మయ్య ఒకరు. సాండ్‌హర్స్ట్‌లో శిక్షణ పొందిన కొద్ది మందిలో ఆయన ఒకరు. ఆయన నిష్క్రమణంతో, దేశంలో నామమాత్రంగా ఉండే పదాతి బలాధిపతుల యుగం ప్రారంభమవుతుంది.

తిమ్మయ్య కూర్గు రాష్ట్రానికి చెందినవారు. "కూర్గు రాష్ట్రంవారు నిజానికి ఎన్నడూ ఇతరుల పరిపాలన క్రింద లేరు. అదే వారి విశిష్టతకు కారణమైంది. అక్కడ ఒక విధమైన ప్రజాస్వామిక సామ్యవాదం అమలులో ఉండేది. బ్రిటిష్‌వారి హయాంలో చీఫ్ కమీషనర్ ఆధ్వర్యం క్రింద కేంద్రపాలిత ప్రాంతంగా ఉండేది. కూర్గు దేశస్థులు తమ భూములను, ఆచారాలను కాపాడుకుంటూ వచ్చారు." జీవితాన్ని గూర్చి జనరల్ తిమ్మయ్య వైఖరిని, రక్షణ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్‌తో ఆయనకు కలిగిన సంఘర్షణను పై వాక్యాలు వ్యాఖ్యానిస్తాయి.

బహుశః ఇప్పుడు పదాతిబలానికి తగిన అధిపతే నియమింపబడవచ్చు. హేమా హేమీలు నిష్క్రమిస్తుంటే, వారి స్థానాలలో వామనులు వస్తున్నారు. జనరల్ తిమ్మయ్య రంగం నుంచి తప్పుకుంటున్న ఈ సమయంలో సరిహద్దులో చైనా నీడపెద్దదై, కారు చీకట్లు క్రమ్ముకుంటున్నాయి, రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్ కూడా తమ వైఖరిని ఇప్పుడు మార్చుకున్నారు. పాకిస్తాన్‌ను హెచ్చరించినట్లుగా దురాక్రమణను ఉపసంహరించుకోమని చైనాకు ఖండితంగా చెప్పకపోయినా, నమ్మించి ద్రోహం చేసిందని ఆ దేశంపై ఆరోపణ చేశారు. ఈలోగా భారతీయ కమ్యూనిస్టులు తాము చైనాతో మంతనాలు జరుపుతున్నామని ఆశాజనకమైన సందేశం యిచ్చారు. వేరొక వంక కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక, మళ్ళీ కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వస్తే, భారత భూభాగం నుంచి చైనీయులను తరిమి వేస్తుందని స్పష్టంగా ప్రకటించింది.

చైనీయుల విప్లవం, "వివిధ దేశాలలో సాగుతున్న స్వాతంత్ర్యోద్యమాలకు దోహదం కలిగించటమే కాక, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా రాజ్యాల ప్రజలమీద గొప్ప ప్రభావం చూపింది" అని 1960 లో మాస్కో నుంచి వెలువడిన ప్రకటన తెల్పుతోంది.

తాము ఏర్పాటు చేసుకున్న వ్యవస్థ ఘనతను వివరించి, దానిని అనుసరించవలసిందిగా ఇతరులకు ఉద్బోధించటంలో చైనా ఎన్నడూ నిర్లిప్తత చూపలేదు. 1951 నవంబరు 5 వ తేదీన నవ చైనా వార్తాసంస్థ "పీపుల్స్ చైనా" పత్రికలో ప్రచురితమైన ఒక సంపాదకీయాన్ని అందజేసింది. "అక్టోబరు విప్లవం తీర్చి దిద్దిన బాట ఆసియా ప్రజలకు కంటి కెదురుగా కనిపించింది. చైనీయుల విప్లవం సాధించిన విజయం వారి దృక్పథంలో ఉజ్జ్వలంగా ప్రకాశించింది."

అప్పటి నుంచి నిర్విరామంగా వారు ఈవిధమైన ప్రచారం సాగిస్తూనే ఉన్నారు. లిబరేషన్ ఆర్మీ పత్రిక 1960 మే 1 వ తేది సంచిక సంపాదకీయంలో యిలా ఉన్నది : "చైనాలోనే కాక, ప్రపంచమంతటా కమ్యూనిజం అమలులోకి తేవడం మా ఆశయం. కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడు మావో ఈ ఆశయ సాధన కోసం మనలను ప్రోత్సహిస్తున్నాడు."

అంతకు ఒక నెల రోజుల క్రితం న్యూ అబర్సర్వర్ పత్రికలో జోషుయీ ఇలా వ్రాశారు : "కామ్రేడ్ మావ్—సె—టుంగ్ తమ రచనలలో మార్క్సిజమ్ స్వరూపాన్ని చైనీయులకు అనుగుణంగా మార్చారు. కమ్యూనిస్టు సిద్ధాంతాలను ఆయన చైనీయుల భాషలో చెప్పారు. దీనివల్ల మార్క్సిజమ్—లెనినిజం విశ్వ జనీనమైన సత్యమని ఋజువవుతూంది. యూరప్‌లోనే కాక, ప్రాచ్య దేశాలలో కూడా ఈ సిద్ధాంతంతాన్ని అమలు చేయవచ్చునని స్పష్టమైంది."

ప్రస్తుతానికి చైనా ప్రభావం ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలపైనే ఎక్కువగా కనిపిస్తోంది.

*　　*　　*

రష్యా, చైనా దేశాలలో నిర్ణయించుకున్న మేరకు వ్యవసాయోత్పత్తిని సాధించలేక పోయారు. ఆశించిన ఫలితాలు సమకూరక పోయినప్పుడు రష్యా వ్యవహరించే పద్ధతి యిట్లా ఉంటుంది : శ్రీ కృష్చేవ్ యిటీవల ప్రసంగిస్తూ, ఆత్మగౌరవం గల ఉద్యోగి తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహించటంలో విఫలుడైనప్పుడు తన ఉద్యోగానికి రాజీనామా యివ్వాలి, అని ప్రకటించారు. "అప్పుడతని ఆత్మ గౌరవం ఏమైనట్లు ? నీవు ఒకానొక బాధ్యతను స్వీకరించి దానిని నిర్వహించలేకపోతే, 'అయ్యా నేను విఫలుడనయ్యాను. నన్ను యీ పదవి నుంచి తప్పించి, సమర్థుడైన వేరొకరిని నియమించండి అని తెలియజేయాలి" అని ఆయన అన్నారు. మన దేశంలో వ్యవసాయోత్పత్తికి, బొగ్గు, ఉక్కు ఉత్పత్తికి, రవాణా సదుపాయాలకు నిర్ణయింపబడిన లక్ష్యాలను సాధిస్తామని శపథం చేసిన మంత్రి పుంగవులు కూడా శ్రీ కృశ్చేవ్ సలహాను పాటించి తమ రాజీనామా పత్రాలను పంపుతారా ? శ్రీ నెహ్రూ తమ మంత్రివర్గంలోని "సి 3" వ్యక్తులను ఇప్పటికైనా వదిలించుకోవటం అవసరం.






"ఒరేయ్, ఆ అస్థిపంజరం మా నాన్నగారి మొదటి పేషెంటుదిరా!"

చిత్రకారుడు—పి. వినయకుమార్ (విశాఖపట్టణం)







## ఆ కం ద కే...

## (మొదటి బహుమతి రు. 10 లు)

ఒకరోజున నేను మా స్నేహితుణ్ణి భోజనానికి పిలిచాను. మా స్నేహితుడు చాలా పొట్టివాడు. అతడు భోజనానికి వచ్చినందువలన, ఒక పెద్ద అరిటాకు వేశాను నేనూ, అతడు భోజనానికి కూర్చున్నాము మా అమ్మగారు భోజనం వడ్డిస్తున్నారు. ఆవేళ కందకూర వండారు. మా స్నేహితుడికి కందకూర చాలా యిష్టం. కాని మా అమ్మగారు కందకూర మాత్రం ఆకు చివర వేశారు. మా స్నేహితుడు వేసిన కూరలన్నీ మానివేసి కందకూర మీదే దృష్టి ఉంచాడు. కాని, పొట్టి మనిషి కావున అతనికి కందకూర మాత్రం అందటంలేదు. చాలా తడబడిపోతున్నాడు. ఇంతలో మా అమ్మగారు వచ్చారు. అమ్మగారు మా స్నేహితునితో ఇలా అన్నారు· ఆ కందకే (ఆకు అందక) ఇలా బాధపడుతున్నావా ? మా స్నేహితుడు: ఆ కందకే (ఆ కంద కూరకే) ఇలా బాధపడుతున్నాను అన్నాడు.

ఎం. ఎస్ ఎస్. మూర్తి (దుద్దుకూరు.)

* * "

## అంతర్నాటకం

## (రెండవ బహుమతి రు. 5 లు)

మా తమ్ముడు చిన్నప్పుడు బహు అల్లరిగా ఉండేవాడు. ఒకసారి (సుమారు వాడికి 5 ఏళ్ళుంటాయనుకుంటాను) అజీర్తి చేసింది. డాక్టరుగారు మాత్ర లిచ్చారే గాని, అవి వేసుకోమంటే వేసికొనే రకం కాదని మా అమ్మకు తెలుసు. అందుకని ఆమె ఒక ఉపాయం ఆలోచించింది. బజారునుండి అరటి పళ్ళు తెప్పించి, ప్రతిసారి మాత్ర ఇవ్వవలసినప్పుడు దానిని జాగ్రత్తగా అరటిపండులోకి గుచ్చి తినమని ఇస్తూ వచ్చింది. రెండు మూడు రోజులకు వాడికి పూర్తిగా నయమయిపోయింది. డాక్టరుగా రిచ్చిన మాత్రలను పొగుడుతూ, తన ఉపాయం పారినందుకు ఆనందిస్తూ, మా అమ్మ మా తమ్ముడికి అసలు విషయం అంతా చెప్పింది. దానికి వాడు "అవి మాత్రలా ! గింజలేమోనని వూసేసేవాడినే మరి !" అని అన్నాడు.

ముద్దుకృష్ణ (గుంటూరు.)

* * *

## ద్వంద్వాభిప్రాయం

## (రెండవ బహుమతి రు. 5 లు)

నిరుడు వేసంగికి నేను కలకత్తా మామయ్యగారింటికి వెళ్లేను. ఒకరోజు నన్ను, మా అత్తని, మా మామయ్య శాంబజార్ తీసుకెళ్ళటానికి బయలుదేరాడు. ఆఫీస్ టైం కావటంచేత బస్సులు చాలా రష్‌గా ఉన్నాయి. బస్సు ఆగగానే ఒకతను బస్సులోకి ఎక్కబోయాడు. మొదట్లో కండక్టర్ జాగాలేదు వద్దన్నా, తనకి ఆరోజు సర్‌విస్ కమిషన్ టెస్టు ఉందని, అందువల్ల అది తప్పితే తాను పరీక్ష టైమ్‌కి అందలేనని మొండి పట్టు పట్టడంతో, అంతకన్నా ఎక్కువ రష్‌కి అలవాటుపడ్డ కండక్టర్ మరేమీ అనలేకపోయాడు. వచ్చేది షిల్డా స్టేషన్ అనగా మామయ్య అతన్ని ఉద్దేశించి 'అయ్యా ఇప్పటి వరకూ ఒకరి కాళ్లమీద నిలబడిఉన్న మీకు, మీ కాళ్లమీద నిలబడే సమయం వచ్చింది. ముందుకి దారితీయండి' అన్నాడు. అతను వెంటనే చూసుకుని ఇంతవరకూ తాను మా మామయ్య కాళ్లమీద నిలబడినందుకు క్షమాపణ వేడుకోబోయాడు. కాని తన ఉద్దేశ్యం వేరని, సర్‌విస్ కమిషన్ ఆఫీసుకు దిగవలసిన జాగా వచ్చే హాల్టు కనుక తనలా అన్నాననీ, మా మామయ్య చెప్పగానే, ద్వంద్వాభిప్రాయంతో మా మామయ్య అన్న మాటలకి నవ్వుతూ, "మీరన్నట్లు ఇప్పటివరకూ ఒకరి కాళ్లమీద నిలబడ్డ నాకు ఇప్పటికైనా నా కాళ్లమీద నేను నిలబడే అవకాశం కలుగుతే భగవంతుడికి, మీకు నే నెంతో కృతజ్ఞుడను" అంటూ బస్సు ఆగగానే దిగిపోయాడు.

దేవరకొండ లక్ష్మీనరసమ్మ (జంషెడ్‌పూర్.)

* * *

## బాలయ్యకు బదులు

## (రెండవ బహుమతి రు. 5 లు)

ఈ సన్నివేశము నా చిన్ననాటిది. నేను అప్పుడు నాలుగవ తరగతి చదువుతూ ఉండేవాణ్ణి. మా ప్రధానోపాధ్యాయుడు పాఠశాల బాల బాలికల సంఖ్య పెంచవలెనని మా గ్రామమునకు ఒక అర ఫర్లాంగు దూరములో ఉన్న ఇద్దరు ఏనాది బాలురను కూడా ఎంతో నచ్చజెప్పి చేర్చుకున్నాడు. వారిలో ఒకని పేరు బాలయ్య, రెండవవాని పేరు పోలయ్య. పాపము వ్వా రిరువురకు చదువుకొనవలెననే ఉద్దేశ్యము లేకపోయినా, మా మాస్టరుగారి భయం చేతనో, భక్తి చేతనో ప్రతిదినము స్కూలుకు వస్తూ ఉండేవారు. కొన్ని దినముల తర్వాత ఒకనాడు బాలయ్య, పోలయ్య స్కూలుకు రాలేదు. ఆ దినము మరో ఇద్దరు పలకలతో హాజరైనారు. మా మాస్టరుగారు చాల సంతోషపడి "వీరిలో చైతన్యం కలిగినది. ఇలా ఇంకా పది మంది వస్తే మూడవ మాస్టరును వేయించుకో వచ్చును మేనేజిమెంటు. గ్రాంటు కూడా పెరుగుతుంది" అనుకొన్నాడు. తర్వాత ఆ యిద్దరిని పిలిచి, "ఏరా మీరు కూడా ప్రతిదినం వస్తారుగదా! మీ పేర్లు వ్రాసుకుంటాను" అన్నాడు. వెంటనే వారు కంగారుగా, "కాదయ్యా మేము బాలయ్యకు, పోలయ్యకు బదులు వచ్చాము. వాళ్ళు ఆడుకోవాలని మమ్మల్ని వాళ్ల పలక లిచ్చి పంపారు," అన్నారు. ఆ మాటలు విని మాస్టర్లు మేము గొల్లున నవ్వాము:

ఎ. వెంకయ్య (సంగం.)

* * *

## "నెయ్యండి; నెయ్యండి"

## (రెండవ బహుమతి రు. 5 లు)

మొన్న వేసంగిలో మా పెద్దనాన్నగారి అబ్బాయి పెళ్లి అయింది. మేమంతా కలిసి ఆడపెళ్లివారి వూరు వెళ్లాము. పెళ్లి బాగానే జరిగింది. మరునాడు వూరందరికి సంతర్పణ చేసేరు. వడ్డన కూడ బాగానే జరిగింది. ఒడ్డనలో తమాషా ఏమిటంటే ఒకాయన నేతి చెంబును పుచ్చుకొని "నెయ్యండి, నెయ్యండి" అంటూ తిరుగుతున్నాడు. భోజనం చేస్తున్న ఒకాయన "ఏమిటండి ! "నెయ్యండి, నెయ్యండి" అంటారు. నెయ్యడానికి ఇక్కడ మంచాలు నవ్వారు లేదండి" అన్నాడు. దాంతో మేమంతా నవ్వలేక చచ్చాం.

కొంపెల్ల సూర్య కృష్ణప్రసాద్ (కాకినాడ.)

# అర్ధరాత్రి - ఆత్మహత్య?

యర్రంశెట్టి శాయి

"నా గుండెల్లో ఎక్కడ మేకు కొట్టినాసరే ... మీ బొమ్మే కనపడుతుంది."

"నా ఫోటో లేవన్నా మింగావా ఏమిటి?"

...... 

"మీ ఊరు వైజాగేనా?"

"అరె మీకెలా తెలుసు?"

"పిచ్చాసుపత్రి పక్కన కదూ మీ ఇల్లు?"

"నాకు తెలియకుండా మా ఇంటికి వచ్చారా ఏమిటి?"

...... 

ఇదీ భారతీ ప్రేమ జాడ్యంతో బాధపడుతున్న శేషగిరి వరస ...



"రాఘవా !"

"..........."

"ఒరేయ్ రాఘవా !"

"............."

"నీ స్నేహితు డిలా కృష్ణానది పొలవుతుంటే చచ్చేట్టు నిదరోతున్నావా ?"

".........."

"నువ్వన్నా లేవరా మురళీ !"

".........."

"ఆ భారతికే అనుకొన్నాను. మీకూ నేను బ్రతకడం ఇష్టం లేదుట్రా ?"

".........."

శేషగిరి బొటబొటా కన్నీళ్ళు కార్చేశాడు. ఆ నీళ్ళు గదిలోని అన్నితూముల్లోంచి బయటకు ప్రవాహంగాపోయి, గదంతా తడిసిపోయినట్టయింది. తన కన్నీళ్ళను చూసుకొని మరీ ఘొల్లున ఏడిచేశాడు గిరి. రాఘవరావు కోపంగా నిదురలేచాడు.

"ఒరేయ్ శేషిగా ! ఏమిట్రా ఇది ? ఈ గదికి తూములుండబట్టి సరిపోయిందిగాని, లేకపోతే నీ కన్నీళ్ళతో గది నిండిపోయి వెంటిలేటర్సులోంచి మరి బయటకు పడేవి. ఊరికే, వెధవ గొడవచెయ్యక! మళ్ళీ లేపావంటే ముక్కు విరగ్గొడతా !" అంటూ అటు తిరిగి పడుకొని మళ్ళీ నిదురపోసాగాడు. కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచినయి. శేషగిరి అలారం టైంపీస్ వంక చూశాడు. పదకొండయింది.

"ఒరేయ్ రాఘవా !"

"ఊఁ !" నిదరలోనే మూలిగాడు రాఘవ.

"నేను కృష్ణానదిలో దూకి ఆత్మహత్య చేసుకుంటున్నారా !"

"ఎప్పుడు ?" నిదరలోనే మాట్లాడుతున్నాడు రాఘవ.

"ఇప్పుడే !"

"తెల్లారి చద్దువుగానిలే పడుకో !"

"లాభం లేదురా !"

"సరే పోనీలే పో ! తలుపు దగ్గరికేసెళ్ళు !"

"వెళ్ళిరామ్రా ?" లేచినుంచొని చొక్కాతో కన్నీళ్ళు తుడుచుకొంటూ అన్నాడు గిరి.

"ఇదిగో చూడు గిరీ ! వచ్చేప్పుడు పాండు కొట్లో సిగరెట్లు అరువు పట్టుకురా !"

"నేనింకెలా వస్తానురా ?"

"పోనీ ఎవరితోనన్నా పంపించు !" గురక కొట్టసాగాడు రాఘవ.

మళ్ళీ కొద్దికాలం నిశ్శబ్దం తాండవించింది. శేషగిరికి ఎక్కిళ్ళు వచ్చినయి. మురళీ దగ్గరికెళ్ళి తట్టి లేపసాగాడు.

"మురళీ !"

"ఏవిట్రా అర్ధరాత్రి గోల !" విసుగ్గా అని మళ్ళీ పడుకొన్నాడు మురళి.

"మురళీ !" జాలిగా పిలిచాడు గిరి.

"వూ !"



"ఒకసారి లేరా !"

లేచి కూర్చునే నిదురపోతున్నాడు మురళి.

"నేను వెళ్తున్నానురా !"

"ప్లాస్కు తీసుకెళుతున్నావా ?"

"నే వెళ్ళేది టీ కి కాదురా ?"

"మరెక్కడికి ?"

"కృష్ణానదికి !"

"కృష్ణాగాడి దగ్గరికా ?"

"కాదురా !"

"కాకపోయినా సరే ! వాడి దగ్గరకెళ్ళి ఒక అయిదు రూపాయలు నేనిమ్మన్నానని చెప్పి అప్పు పట్రా ! మనియార్డరొచ్చాక యిచ్చేదాంలే !"

"నే నక్కడికి వెళ్ళటం లేదురా !"

"ఆ అయిదులో నీకూ రెండిస్తాలే !"

"నేను వెళ్లేది కృష్ణానదిలో పడి ఆత్మహత్య చేసుకోవటానికి !"

"ఆ !" అదిరిపడ్డాడు మురళి. అతని నిదరంతా వదిలిపోయింది.

'ఆత్మహత్యా !" ఆశ్చర్యంగా నోరు తెరచాడు.

"అవునురా !"

"ఎందుకూ ?"

"అది చాలా పెద్ద స్టోరీరా !"

"పోనీ, చిన్నదిగా వినిపించురా !"

"చెప్పబుద్ధి రావటం లేదురా ! గుండె పగిలి పోతూంది !"

మురళి కాసేపు ఆలోచించాడు.

"పోనీ......అజా ఆలజీ నోట్ బుక్‌లో రాసియ్యి"

"అమ్మ బాబోయ్ ! ఆ లెక్చరరు చెవి నలిపి వేస్తాడు !"

"మరి ఏం తగలడ్తానంటావ్ ?" విసుగుతో గట్టిగా అరిచాడు మురళీ.

ఆ అరుపుకు రాఘవలేచి కూర్చున్నాడు. ఇదంతా శేషగిరి తాలూకు గొడవేనని గ్రహించాడు. ఒళ్ళు మండిపోయింది.

"ఒరేయ్ ! నువ్వు పడుకొంటావా ? నాలుగు బాదమన్నావా !" కోపంతో శేషగిరివంక చూస్తూ అన్నాడు రాఘవరావు.

శేషగిరి అరగాలను కన్నీళ్ళు కార్చేశాడు.

మురళీ శేషగిరిని చూసి పావుగంట సేపు జాలిపడి పోయాడు.

"అసలెందుకురా ? అలా ఏడుస్తావు కారణం చెప్పకుండాను ! ఏ అమ్మాయన్నా ఏవన్నా అన్నదా?"

"ఎవ్వరూ ఏవీ అనలేదురా."

"అబ్బే ! వీడికిలా లాభం లేదురా" చొక్కా చేతులు పైకి మడుస్తూ అన్నాడు రాఘవరావు.

"ఒరేయ్ నువ్వుండరా, అసలు సంగతేవిటో కనుక్కోనీ" రాఘవ చేతులు పట్టుకొని ఆపుతూ అన్నాడు మురళి. శేషగిరిరావు భుజంమీద చెయ్యి వేసి బుజ్జగిస్తూ అన్నాడు.

"ఒరేయ్ శేషూ ! ఆత్మహత్య చేసుకోవటం తప్పదంటావా ?"

"తప్పదురా !" దుప్పటితో కన్నీళ్ళు తుడుచుకొంటూ అన్నాడు శేషు.

"దానిక్కారణం చెప్పితగలడరా ?" విసుగుతో అరిచాడు మురళి.

"ఇప్పుడు చెప్పలేనురా ! నా బుర్ర వేడెక్కి పాడయిపోయింది."

మురళీ ఆలోచనలో పడ్డాడు.

"ఒరేయ్! పోనీ ఒక పని చెయ్యి. రెండింటికి అలారం పెడతాను. అప్పుడు లేచి చెప్పు, నిబ్బర కూడా ఫ్రెష్‌గా ఉంటుంది. ఏమంటావు?"

"బాగానే ఉందనుకో! మరి ఆత్మహత్యో?"

"మాకు చెప్పేసి వెంటనే రిక్షా కట్టించుకెళ్ళు."

"సరే!" అంటూ పడుకొన్నాడు శేషు.

మురళీ అలారం కీ పెట్టి తను కూడ పడుకొన్నాడు.

అలారం రెండింటికి కొట్టగానే శేషగిరిరావు ఎవరో లేపినట్టు లేచి కూర్చున్నాడు. పోలీసుటాణా లోంచి రెండు కొట్టారు. మురళీని తట్టిలేపాడు. బద్ధకంగా లేచికూర్చున్నాడు మురళీ.

"ఒరేయ్ మురళీ చెప్పున్నా వినరా! మళ్ళీ టైమయి పోతుంది" హడావిడిగా అన్నాడు శేషు.

"ఉండుండు! వాణ్ణి కూడా లేపనీ" అంటూ రాఘవను కూడ లేపాడు మురళీ.

"ఏవిట్రా! వీడింకా పడుకోలేదా?" కళ్ళెర్ర జేస్తూ అన్నాడు రాఘవ.

"హబ్బే! ఇది ఇందాకటి ఘట్టం కాదులేరా. ద్వితీయాంకము" రాఘవను వూరుకోబెడ్తూ అన్నాడు.

"ఊఁ! ఏడవమను" విసుగుతో అన్నాడు రాఘవ.

"మరిరా, సరిగ్గా రెణ్నెల్లక్రితం......" ప్రక్కనున్న కూజాలోని నీళ్ళు త్రాగి మళ్ళీ మొదలెట్టాడు శేషగిరి.

"సరిగ్గా రెణ్నెల్లక్రితం నేను భారతిని ప్రేమించారా!"

"పాపం! ప్రేమట్రాజెడీ అన్నమాట" సానుభూతి చూపాడు మురళీ.

"ఆ, నా ప్రేమ ఒక నెలా పది రోజులపాటు ఇంకొకరి ప్రమేయం లేకుండా దిన దినాభివృద్ధి అయింది."

"ఆ అమ్మాయికి తెలుసా నువ్వింత హంగామా చేస్తున్నట్టు?" మురళీ తన సందేహం వెలుబుచ్చాడు.

"తెలియకేంరా? నేను తన వంక చూడనప్పుడు, తను నావంకే చూస్తుండేది."

"నీకెలా తెలుసు?"

"అదంతా సైకాలజీలేరా. రోజూ సాయంత్రం అద్దె సైకిలు వేసుకొని ఆ అమ్మాయి ఇంటి ఎదురుగాఉన్న కిళ్ళీబడ్డీ దగ్గరకు వెళ్లేవాణ్ణి" కాసేపాగి మళ్ళీ అన్నాడు. "మొన్న ఫస్టుకు, ఇరవై మూడు రూపాయలు చిల్లర అయిందిరా అద్దె బిల్లు" ఉసూరుమన్నాడు శేషు.

"పాపం!" బిల్లు మాట వినగానే రాఘవకు కూడా కొద్దిగా జాలి వేసింది.

"తిరగ్గా, తిరగ్గా చివరకు మొన్న పన్నెండో తారీఖున ఒంటరిగా బారేజిమీదకు షికారు వెళ్తున్నట్టు తెలిసింది. వెంటనే రెండ్రోజులుముందే అద్దె సైకిలు తీసుకొని బారేజిమీద కాశాను. ఆ రెండు రోజులు సిగరెట్టు కాలవలేదంటే నమ్ము."

"నమ్మానురా" అన్నాడు మురళీ.

"సాయంత్రం అయిదింటికల్లా రిక్షామీద బారేజి కొచ్చింది. మెల్లగా నడుస్తూ ఒకచోట ఆగింది. వెనుకనే వెళ్ళి "నమస్కారమండీ" అన్నాను. నా వంక చూడకుండానే "నమస్తే" అన్నది. సైకిలు

# అర్ధరాత్రి - ఆత్మహత్యా

స్టాండువేసి ప్రక్కన పెట్టాను. ఆమె ప్రక్కకెళ్ళి నుంచున్నాను. "ఏమండీ" అన్నాను నసుగుతూ.

"ఏవిటి?" అంది కోపంగా. "షికారు కొచ్చినట్టున్నారు...హి...హి...హి" అంటూ నవ్వాను.

"కనపట్టంలా" మెల్లగా నడుస్తూ అందామె.

"నేను...మీక్కు తెలుసుగా" వేళ్ళు లెక్క పెట్టుకొంటూ అన్నాను. "తెలుసు...నా జూనియర్" అంది.

"అది చదువులో సంగతండీ! కాని...ప్రేమలో హి...హి...మీకన్న చాలా సీనియర్‌నండీ" అన్నాను వెకిలిగా నవ్వుతూ.

"ఇంతకీ హేవంటావు" అంది ఇంగ్లీషులో.

అనుకోకుండా వచ్చిన ఆ అవాంతరానికి హడలిపొయ్యాను.

> తల్లి: ఎందుకురా అలాగోడ ఆనుకొని వంగున్నావు?
>
> కొడుకు: మరి రేపు బడిలో నోటిలెక్కలు సరిగా చెప్పక పోతే గోడకుర్చీ వేయిస్తామన్నారు మా మాస్టారు. అందుకని ఎలావేయాలో నేర్చుకుంటున్నాను.
>
> బాపనపల్లె అర్జునయ్య (తిరుపతి)

"మీరంతా ఇంగ్లీషులో కోప్పడితే నేనేవయిపోను" అని ధైర్యం చేసి అన్నాను.

"మీ యింటిపే రేమిటండీ" అని నసుగుతూ అన్నాను.

"ఎందుకూ?" అంటూ నావంక విచిత్రంగా చూసింది.

"హి....ఏమీలేదు....మనిద్దరి పేర్లూ జ్యోతిష్కులకు చూపించి మన గ్రహబలాలు సరిపోతవేమో చూస్తాను" సిగ్గు పడుతూ అన్నాను.

"గ్రహాలు సరిపోయేటట్లే నా పేరు పెట్టారు కాబట్టి నేను చూపించుకోనక్కరలేదు. కాని మీరు తప్పక చూపించుకోవాలి. మీ గ్రహబలం ఏమాత్రం బాగో లేదు" అందామె కోపంగా.

"అబ్బే! హలా అంటే కాదండీ, నాదో చిన్న మనవి...." తలవంచుకొంటూ అన్నాను.

"ఏవిటి?" అందామె.

కొద్దిగా కవిత్వం చెప్పాలనిపించింది. తలఎత్తి చూశాను. కృష్ణానదికి అటొక కొండా, ఇటొక కొండా కనపడినయి. కృష్ణానది నిండుగా ప్రవహిస్తోంది.

వెంటనే నాలో "కవిత్వావేశం" వచ్చింది. భావగీతం ఒకటి అలాపించాలనిపించింది. ఎలుగెత్తి పాడాను.

ఓ కృష్ణానదీ! పవిత్రదయానిధీ!
ఇటుప్రక్కొకటీ, అటుప్రక్కొకటీ,
పెద్దపెద్ద డబ్బాల్లాగా,
నిలబడె నా నల్లకొండలు,

తన్మయత్వంలో కళ్ళు మూసుకొని పాడసాగాను.

"మీరు నన్ను ప్రేమించకపోతే నాకొచ్చే
మీహృదయంలో పెద్దలాకు. [షాకు,
నన్నిడి చినువ్వెక్కడికీ పోకు,
అది నాహృదయంలో బాకు,
నన్నెప్పుడూ చూడకు పరాకు,
అదినాకెంతో పెద్దచిరాకు."

ఇలా అని ప్రక్కకు చూడగానే పావు ఫర్లాంగు దూరములో ఆమె వెళ్ళిపోతూ కనిపించింది. పరుగెత్తుకెళ్ళి కలుసుకొన్నాను. మా ఇద్దరిమధ్యా సంభాషణ ఇలా నడిచింది.

"ఏమండీ! వెళ్ళిపోతున్నారే" అన్నాను ఒగరుస్తూ.

"ఇదిగో! కానిస్టేబిల్స్‌ను పిలవమంటావా?"

"అమ్మ బాబోయ్! ఆ పనిమాత్రం చెయ్యొద్దు.....మీకు పుణ్యముంటుంది."

"అట్లాయితే తొందరగా వెళ్ళిపో ఇక్కడినుంచి!"

'రెండు మినిట్స్‌లో నా మనవి మనవి చేసుకొని వెళ్ళిపోతా......'

'సరే....రెండు ముక్కల్లో చెప్పెళ్ళు!"

"వినండి! ఈ అనాథ ప్రేమపక్షి గాథ. విని అగ్రహించినాసరే, అనుగ్రహించినా సరే......!"

"మిస్టర్! ఇంట్రడక్షన్ తీసేసెయ్యి."

"చిత్తం! నేను మిమ్మల్ని రెండు నెలల లోపునుంచి ప్రేమిస్తున్నాను. నా గుండెల్లో ఎక్కడ మేకు కొట్టినాసరే. మీ రక్కడినుంచి చూస్తే లోపల మీ బొమ్మే కనపడుతుంది."

"నా ఫొటో తేవన్నా మింగావా? ఏమిటి?"

"నా హృదయం అనే డ్రాయింగ్ పేపర్‌మీద మీ చిత్రం అలా చిత్రించుకుపోయింది."

"చూడు బ్రదర్! నాకు టైమయిపోతుంది. ఒకమా టడుగుతున్నాను. మీ ఊరు నైజాగేనా?"

"అరె మీకెలా తెలుసు?"

"పిచ్చాసుపత్రి పక్కనకదూ మీ ఇల్లు?"

"నాకు తెలియకుండా మా ఇంటికి వచ్చారా ఏమిటి?"

"ఓహో! అదన్నమాట సంగతి...." అంటూ రిక్షా ఎక్కింది.

"వినండోయ్! ఈ ప్రేమ పక్షి ప్రేమ గాథ వినకుండానే వెళ్ళిపోతున్నారా?"

"విన్నాగా?"

"మీరు నా ప్రేమను అనుగ్రహించకపోతే ఈ కృష్ణానదిలో దూకి ఆత్మహత్య చేసుకొంటాను."

"నేను తిరస్కరించిన తక్షణమే చేసుకొంటారా?"

"నిండు ప్రాణాన్ని చూస్తూ, చూస్తూ తక్షణమే ఎలా వదిలేయనండీ? ఒక పదిహేను రోజులు టైము తీసుకొంటాను."

"అట్లాయితే నాకు బాధ లేదు. నిరభ్యంతరంగా ఆత్మహత్య చేసుకోవచ్చు" అంటూ వెళ్ళిపోయింది.

"సరిగ్గా ఇవాళ పది హేనో రోజు....నే వెళుతున్నానురా" అంటూ లేచి నుంచున్నాడు శేషు.

"ఓరీ శేషిగా ! నీ కంతకంటె మంచి అమ్మాయిని తెచ్చి పెళ్ళి చేస్తాంగాని పడుకో" మళ్ళీ పడుకొంటూ అన్నాడు రాఘవ.

"లాభం లేదురా ! నాలాంటి సత్యశీలుడు ఒక్కసారి ప్రేమిస్తాడు. వాడికిహ ప్రేమ ఉండదు.

"ఆ ఒక్కసారి ఫెయిల్యూర్ అయితే, వాడి జీవితం కూడా అంతే !"

"పోనీ పెళ్ళి లేకుండా మామూలుగా వుండిపోరా !" మురళీ విచారంతో అన్నాడు.

"ఉండలేనురా ! భారతి తన భర్తతో షికార్లు కొడుతుంటే జీవితాంతం ఆ సీన్‌లు చూస్తూ ఊరుకోనా ? అంతకంటె ఉరి పెట్టుకు చావడం బెటరు!"

"పోనీ ఎవరితోనన్నా రికమెండ్ చేయించి సన్యాసుల్లో చేర్పిస్తాం గాని, మరీ బొత్తిగా ఛస్తానంటావేమిరా ?" విసుగుతో అన్నాడు రాఘవ.

"ఎందుకొచ్చిన సన్యాసంరా ? పోలీసాళ్ళతో బాధ. లాటీలతో మక్కెలిరగ్గొడతారు !"

"మరెలాగురా ?" కోపంతో అరచాడు రాఘవ.

"నన్నాపకండిరా ! మీకు పుణ్యముంటుంది." కన్నీళ్ళు కార్చబోయి రాఘవానిచూసి తగ్గాడు శేషు.

మురళీ తీవ్రంగా ఆలోచించసాగాడు. అయిదు నిమిషాలు గడిచిపోయినయ్.

"ఒరేయ్ శేషూ ! ఒక ఐడియా వచ్చింది. పోనీ ఇంకో అమ్మాయిని ప్రేమించరాదూ ?"

శేషగిరి ఉనూరుమన్నాడు. "లాభం లేదురా, నా హృదయాన్ని భారతి చేతికిచ్చేశాను" అంటూ లేచినుంచున్నాడు.

"వెళ్తున్నారా !" అంటూ గదంతా కలియచూశాడు.

"సరే ! వెళ్ళిరారా !" అంటూ మురళీ కూడా ముసుగుపెట్టుకొన్నాడు.

తలుపు దగ్గరకేసిన చప్పుడయింది. మరుక్షణంలోనే తలుపు దభాలున తెరుచుకొంది.

"ఒరేయ్ ! మురళీ, రోడ్‌మీ దెవ్వరూలేరు. భయంగా ఉంది. బారేజ్ దాకా తోడు రారా."

"ఒరేయ్ ! నీ ఆత్మహత్య సంగతి అలా ఉంచి ముందు మా ఆత్మలు హత్య చేస్తున్నావురా."

"మళ్ళీ మళ్ళీ మీతో మాట్లాడతానట్రా.... ఇవాళొక్క రాత్రే గదుట్రా ?"

"సరే ఏం చేస్తాం.....పద ?" అంటూ మురళీ లేచి చొక్కా వేసుకొన్నాడు.

శేషు బయటకు వచ్చాడు. వెనుకనే మురళీ కూడ రాఘవ చెవిలో ఏదో చెప్పి తనూ వచ్చాడు. ఇద్దరూ మౌనంగా నడువ సాగారు. దారిలో హోటల్ దగ్గర కొచ్చారు.

"ఒరేయ్ ఆఖరిసారి టీ త్రాగరా" అన్నాడు మురళీ.

కాసేపు ఆలోచించి "సరే పద !" అంటూ లోపలికి దారి తీశాడు శేషు. టీ తాగారు. మళ్ళీ నడక సినిమా హాల్ ప్రక్కన్నుంచి వెళుతున్నారు.

శేషూ ! ఈ ఇంగ్లీషు పిక్చరు చూశావా" అన్నాడు మురళీ.

"లేదు."

"ఈ పిక్చరు చూడనివాడు బ్రతకటం అనవసరంరా."

"ఎలాగు చస్తున్నాగదరా."

"అదే నేననేది, రేపు మాట్నీ చూసి చస్తే ఏం అని ?"

శేషగిరి కొద్దిసేపు ఆలోచించాడు. ఒక నిశ్చయానికొచ్చినట్లు మళ్ళీ ముందుకు నడువసాగాడు. "వద్దులే పద !" అని మురళీ చెయ్యి పట్టుకొన్నాడు.

బారేజుమీద నడవటం మొదలు పెట్టారు.

"మళ్ళీ ఎప్పుడు కలవటం ?" ప్రశ్నించాడు మురళీ.

"నెక్స్ట్ బర్త్‌లో" ఆకాశంవంక చూస్తూ జవా బిచ్చాడు శేషు.

బారేజు మధ్య కొచ్చేశారు.

శేషు సడన్‌గాఆగి అన్నాడు "ఒరేయ్ లాంచ్రీలో నా బట్టలున్నాయిగాని తీసుకొచ్చి రూమ్‌లో పెట్టు!"

"సరేలేరా తెచ్చి జ్ఞాపకా౦ నేను తొడుక్కుం టాను."

"మరే ! ఇంకోటి ! టైలరు క్రిష్ణాగాడిదగ్గర భారతికో ఒక జాకెట్టు కుట్టించాను. అది తీసు కొని నీ నా ప్రెజంటేషన్‌గా ఇచ్చెయ్యి!"

"పెళ్ళి అవ లేదుగారా ?" బిక్కమొగం వేశాడ మురళీ.

"అయినప్పుడు సంగతే !" అంటూ నదిలోకి తొంగి చూశాడు.

"ఒరేయ్ ! మరీ అంత దూకుడుగా ప్రవహి స్తోందేరా ?"

"అలాగే ఉంటుందిలేరా ! తొందరగాకానీ ! నేను బోలెడుదూరం పోవాలి !"

శేషు కళ్ళుమూసుకొని ఒక కాలు బారేజు గోడమీద వేశాడు. మళ్ళీ వెనక్కు తగ్గాడు.

"ఒరేయ్ చాలా ఎత్తుగా ఉన్నట్టుంది. నేను పడే చోట పెద్ద రాయిగిన్నా ఉండి కాళ్ళు ... చేతులు విరుగుతే?"

"చచ్చేవాడి కివన్నీ ఎందుకురా ?"

శేషు బారేజు గోడమీద మళ్ళీ కాలేశాడు. ఇంతలో వెనుక సైకిలాగిన చప్పుడయింది. ఇద్దరూ వెను దిరిగారు.

కాకీనిక్కరూ, కాకీచొక్కా, చేతిలో లాఠీ, కళ్ళజోడూ తలకు మఫ్లర్ చుట్టుకొని మఫ్టీలో కానిస్టేబుల్ కనబడ్డాడు.

"ఏయ్ ! ఏం చేస్తున్నా రిక్కడ ?"

శేషగిరి ఒణికిగిపోయాడు. ఒళ్ళంతా చెమట్లు పట్టేసినయ్.

"అబ్బే ఏంలేదండీ ! నది....ని చూస్తున్నాము" జవాబిచ్చాడు మురళీ.

'రెండున్నర" టైము చూసుకొని అని "తెల్లారు జామున రెండున్నరకు నదిని చూడటానికి వచ్చారా... ఏయ్ ? నిజం చెప్పండి. ఆత్మహత్య చేసుకోవటాని కొచ్చారు. అవునా ?" లాఠీ తిప్పుతూ గద్దించా డతను.

"నేను కాదండీ !....వీడే ఆత్మహత్య చేసుకొంటా నంటున్నాడు" శేషును చూబిస్తూ అన్నాడు మురళీ.

"ఏమోయ్ ! పద.....స్టేషన్‌కి నడు."

"అ.. బ్బె...బ్బె...ఊరికే వీడితో అన్నానండీ !" కంగారుతో అన్నాడు శేషు.

"ఒరేయ్ ! వూరికే అంటా వేమిట్రా. ఇందాక చెప్పలేదూ ?"

"చెప్పలేదు" ఒణికిపోతూ అన్నాడు శేషు.

"ఇంత అబద్ధవంట్రా ! ఏవండీ కానిస్టేబుల్ గారూ, మరేమో వీడి ఫస్ట్‌లవ్ ఫెయిల్యూర్ అయిం దండీ. అందుకని...

"ఏమోయ్ ?" శేషు వంక కోపంతో చూస్తూ అన్నాడు కానిస్టేబుల్.

"అబ్బే....అంతా వట్టిదేనండీ....ప్రేమ ఫెయి లయితే మాత్రం మళ్ళీ ప్రేమించగూడదేమిటి? దానికోసం ఆత్మహత్య ఎందుకు ?"

"ఒరేయ్ ?... ఎంతమారి పొయ్యావురా...పెళ్ళి చేసుకోమన్నా వద్దన్నాడండీ ?"

"ఆ ! ..!పెళ్ళి చేసుకోకుండా ఎవడుంటాడోయ్.. అందులో ఈ కాలంలో... సరదాకి అన్నానండీ ఎస్. ఐ. గారూ !"

"వోరి పిడుగా ! నీ హృదయం భారతి చేతి కిచ్చేశానన్నావు. అది కూడ అబద్ధమేనా ?"

"హృదయ మనేది చేతి కొస్తుందా ఏమిట్రా భారతి చేతి కివ్వడానికి ?"

"అయ్యా కాన్‌స్టేబుల్ గారూ ...విన్నారుగా.... ఇహతవరిదయ" అక్కడే కూలబడ్డాడు మురళీ.

కాన్‌స్టేబుల్ కాసేపు ఆలోచించి "సరే ! ఇంటికి పొండి" అన్నాడు.

"ఏయ్ రిక్షా ?" శేషగిరిరావు పిలిచి ఎక్కి కూర్చున్నాడు. మురళి కూడా శేషు ప్రక్కనే కూల బడ్డాడు.

కాన్‌స్టేబుల్ సైకిలెక్కి రిక్షా వెనుక బయ ల్దేరాడు.

కాసేపాగాక మురళీ అన్నాడు. "అదేవిట్రా శేషూ ! నువ్వు నిజంగా చావదల్చుకోలేదా ?"

"నిజంగా చద్దామనుకొన్నాననుకో...కాని ఈ కాన్‌స్టేబుల్ పీనుగ ఒకడు తగలడ్డాడు. ఏం చెయ్యనురా ?....అట్నే మాట్లాడితే జైల్లో వేస్తాడు....ఎందుకొచ్చిందిలే.. పనులన్నీ చూసుకొని తీరిగ్గా ఇంకో నెల రోజుల్లోవళ చస్తాను."

రూమ్ దగ్గర కొచ్చింది రిక్షా.

ఇద్దరూ రూమ్‌లోకి వెళ్ళారు. వెనుకనే వచ్చిన కాన్‌స్టేబిల్‌ని చూసి శేషు మళ్ళీ వణికిపోయాడు అతను కళ్ళ జోడు తీసి టేబుల్‌మీద పెట్టి మఫ్లర్ విప్పాడు శేషు ఆశ్చర్యబోయాడు. "ఓరి రాఘవా ? నువ్వట్రా..."అరిచేశాడు.

"ఏడిశావ్‌లేగాని పడుకో."

* * *

రెండు నెలల్లో తన పెళ్ళి శుభలేఖలు తనే స్వయంగా అందరికీ పంచిపెడుతూ కనబడ్డాడు శేషు.



# మనమూ మన దేహస్థితి

## పుప్పిపన్ను: దంత సంరక్షణ

**డా॥ గాలి బాలసుందరరావు**

గత వ్యాసంలో పిప్పిపన్నునుగురించి సమగ్రంగా తెలుసుకున్నాము. పిప్పి పన్ను రాకుండా చేసుకోడం చాలావరకు మనచేతులలోనే ఉన్నవని.

ఏ వ్యాధి నిరోధమైనా ఆ వ్యాధి కారణములు తెలుసుకున్నప్పుడే సాధ్యమవుతుంది. కారణములు తెలియనప్పుడే నిరోధము దుస్సాధ్యమవుతుంది. పిప్పి పన్నుకు కారణము నోటిలో లేక్టిక్ ఏసిడ్ అనే ద్రావకము ఏర్పడడమనీ, పంచదారవంటి పదార్థములపీద కొన్ని క్రిముల ప్రభావంవల్ల ఈ ద్రావకం ఏర్పడుతుందనీ, ఇదివరకే తెలుసుకున్నాము. పుప్పిపన్ను కలిగించే కారణములే దంత దార్ఢ్యమును తగ్గించేవి కూడా. ఒకమాటు దంత దార్ఢ్యము తగ్గగానే దంతభాగములు క్రిమిదోషానికి తేలికగా గురిఅవుతవి. అందువల్ల పుప్పిపన్ను నివారణ, అనేక ఇతరదంతముల వ్యాధి నివారణకు కూడా కారణమవుతుంది. కొంచెం వివరంగా ఆ విషయం తెలుసుకుందాము.

దంతదార్ఢ్యము తగ్గకుండా ఉండడానికి ఈ క్రింద వివరించిన జాగరూకతలు అత్యవసరము.

(1) సాధ్యమయినప్పుడల్లా బిడ్డకు స్తన్యపానమే ఏర్పరచడము.

(2) బాగా నమిలి మ్రింగవలసిన స్వభావం కలదీ, నమిలిమ్రింగిన తరువాత, పళ్లకు అంటుకుని ఉండనిదీ, కేల్షియమునూ, ఆ కేల్షియము ఆహరణకు అవసరమైన విటమిన్ 'డి' అధికంగా ఉన్నదీ అయిన ఆహారం తీసుకోడం.

(3) కార్బో హైడ్రోటులు (వరి, గోధుమ వంటి ధాన్యములు, పంచదార) ప్రధానాహారముగా కలవారు వాటిని ఎంత ముడి స్థితిలో ఉపయోగించడానికి వీలయితే అంత ముడి స్థితిలో ఉపయోగించడం, బంకగా, జిగురుగాఉండే స్థితిలో ఆ వస్తువులను తీసుకోకపోవడం, చాకోలెట్లు, హల్వాలు, పేస్ట్రీలు ఇటువంటివి ఉపయోగించకపోవడం.

(4) నోటితోనే వూపిరి పీల్చడం. అందుకు ఆటంకం కలిగించే వ్యాధులను నివారించడం.

(5) పళ్లు పరిశుభ్రంగా ఉంచుకోడం. ఆహార పదార్థములలో తగినంత పీచుపదార్థం ఉండి అది బాగా నమిలి మ్రింగినప్పుడు దంతములు వాటి అంతట అవే శుభ్రపడతవి. మనదేశంలో పళ్లు తోముకొనడానికి వేప మొదలైన కొమ్మలను నమిలి కుంచెలాగాచేసి ఉపయోగించే ఆచారం ఉన్నది. దంతారోగ్యం రీత్యా యిది చాలా ఉత్తమమైన పద్ధతి. ఈ వేప కొమ్మను నమిలినప్పుడు, చీల్చినప్పుడు దంతాలకు తగిన పరిశ్రమ లభిస్తుంది. వేపవంటి చేదుగాఉండే వస్తువులు నోటికి తగలగానే కడుపులో జాతరరసము (Gastricjuice) విరివిగా ఉత్పత్తి అవుతుంది. అయితే మనం ఉపయోగించే పుల్ల పచ్చిదై, నమలడానికి వీలైనదిగా ఉండాలి. నమిలిన తరువాత దాని చివర కుంచెలాగా మృదువుగా ఉండాలి. అందులోనుంచి పుల్లలు పీచు, జారి పళ్లలో ఇరుక్కునేటంత పెళుసుగా ఉండగూడదు. అందులో చేదుతోపాటు వగరు గుణం కూడా ఉంటే ఇంకా మంచిది. పచ్చిదీ, లేతదీ అయిన వేపకొమ్మ చాలా మంచిదే. కాని అది మృదువుగా కుంచెలాగా అయ్యేటంతవరకు ఎవరూ నమలరు. ఆహారం నమలవలసినంత సేపూ నమలడానికీ, పళ్లు తోముకునే పుల్ల నమలవలసినంతసేపు నమలడానికీ, చాలామందిలో అలవాటు తప్పిపోతున్నది. చాలా దంతవ్యాధులకు ఇదే కారణమని దంతవైద్యులు భావిస్తున్నారు. పుల్లలో పీచు తరుచు వూడిపోయి, పళ్లలో ఇరుక్కున్నా, చిగుళ్లలో గుచ్చుకుని గాయం చేసినా ఈ ఫలితం రాకపోగా, దంతములు గాయపడడానికి కారణమేమవుతుంది. కచ్చిక ఇటు కరాయిపొడుం, మరీ గరుకుగా ఉండేపళ్ల పొడులు ఇటువంటివి పళ్లు తోముకొనటానికి ఉపయోగించకూడదు.

నాగరకత వచ్చిన తరువాత పళ్లు తోముకొనటానికి ప్రత్యేకమైన బ్రష్షులు, పేస్టులు, క్రీములు వచ్చినవి. వాటిని గురించిన ప్రచారం వార్తాపత్రికలలో తరుచు కనుపిస్తూ వుంటుంది. ఎటువంటి బ్రష్షు మంచిది, 'ఏ టూత్ పేస్టు మంచిది' అని చాలామంది అడుగుతూ ఉంటారు. ఏ బ్రష్షులోనయినా ఈకలు చాలా కటినంగా ఉక్కు తీగలలాగా ఉండకూడదు. చాలా మృదువుగానూ ఉండకూడదు. కుంచెలో పొడుగునా ఈకలు అమరిఉంటే పళ్ల వరసలవంపులలో తిరిగి శుభ్రం చేయడానికి వీలుండదు. అందుకని కుంచెం పిడిచివర కొద్దిగా ఈకలున్న కుంచెలు ప్రశస్తములైనవి. పళ్ల మధ్యవున్న గాళ్లలో ఇరుక్కునిఉన్న ఆహారాది పదార్థముల తునకలను పైకి తీసుకునివచ్చేటట్లుగా బ్రష్షులు తయారు చేయాలి.

ఇక ఎటువంటి క్రీములు, పేష్టులు ఉపయోగించాలి అన్నది రెండవ ప్రశ్న. క్షార గుణం (Alcalimity) ఉన్న పదార్థములు సీమసున్నంపొడి (Chalk) నురుగు తెప్పించే'సోపు' వంటి పదార్థములు. క్రిమి సంహారక ద్రవ్యములు, సువాసన ద్రవ్యములువేసి యీ పేస్టులు తయారవుతవి. క్షారగుణము, సీమ సున్నము, దంతం మధ్య భాగములలోఉన్న క్రిముల వల్ల ఉద్భవించిన ఏసిడ్లను మార్చివేసి, దంతములు ఆ ఏసిడ్లతో నాశనం కాకుండా కాపాడతవి. సబ్బు సీమ సున్నమూ కలిపి పళ్లు రుద్దుకున్నా ఈ ఫలితమే లభిస్తుంది. అయితే ఇందులో క్రిమి సంహారక వస్తువులులేవు. ఎక్కువగా నురుగువచ్చే గుణము లేదు. నోటిలో సెలైవాతో కలిసినప్పుడు ఎంతలాగా నురుగువస్తే ఆ నురుగు వచ్చినప్పుడు, ఆక్సిజను కణములు ఎంత విరివిగా బయటికివస్తే అంత బాగా పళ్లమధ్య ఇరుక్కున్న ఆహార ఖండములు, చీము, పాచి కరిగి కాలిపోయి దంతములు అంత శుభ్రపడి క్రిమిరహితము లౌతవి. కొన్ని టూత్ పేస్టులు నోటికి తగలగానే చుర్రుమని పుళ్లుపడేంత ఘాటుగా ఉంటవి. క్రిమి సంహారక ద్రవ్యములు క్రిములను సంహరించాలిగాని నోటిలోఉండే మృదువైన మ్యూకస్‌మెంబ్రేనును గాయపరచేవిగా ఉండగూడదు. అందుకని మనం నురుగు బాగా వచ్చేది నోటిని గాయపరచని క్రిమిసంహారక ద్రవ్యములున్నదీ, ఆక్సిజనును సరఫరా చేసేదీ, సువాసన కలదీ అయిన టూత్ పేష్టును ఏరుకుని ఉపయోగించుకోవాలి. ఈ జాగ్రత్తలు తీసుకోడం పుప్పిపన్ను ఉన్నప్పుడేకాదు, ఎప్పుడూ మంచిదే.

పుప్పిపన్ను ఉన్నప్పుడు ఎనామెల్ పొరనెరలు విచ్చిఉంటవి. అప్పుడు ఆ నెరలు అడ్డంగా ఏర్పడతవి. చిగుళ్లకూ, దంత శిఖరముకూ మధ్య పెద్దగా గాడి ఏర్పడి దంతములోని మెత్తభాగములు బయటపడి ఉంటవి. అందుకని టూత్ బ్రష్షుగానీ, పళ్లు తోముకునే పుల్లకానీ దంతములకు అడ్డంగా రుద్దగూడదు. పైకీ:కిందకీ ఉపయోగించాలి. అపడ్పు బ్రష్షులో ఈకలుదంత మధ్యములకుపోయి, అక్కడ ఇరుక్కునిఉన్న ఇతర పదార్థములను బయటికి లాగుతవి. అప్పుడే పేస్టు పొంగు లోపలికిపోయి ఆ పదార్థములను కాల్చి క్రిమి నాశనం చేయడం సాధ్యమవుతుంది.

పుప్పిపన్నుఉన్నవారు రాత్రి భోజనం అయిన తరువాత మెగ్నీషియం కార్బొనేటు ఉన్న నీళ్ళతో బాగా పుక్కిలించి ఉమ్మేసి పడుకోవాలి. ఆ తరువాత ఏ ఆహారం తీసుకోకూడదు. చాకొలెట్లు, క్రీములు, హల్వాలు తిన్నవారు ఈ జాగరూకత ముఖ్యంగా తీసుకోవాలి.

కృత్రిమదంతములు ఉపయోగించేవారు నోటివి, కృత్రిమ దంతములను కూడా నిత్యము పరిశుభ్రం చేయాలి. లేకపోతే తక్కిన దంతములు వ్యాధిగ్రస్తములవుతవి. ★



జూల్స్ వెర్న్ నవల

# 80 రోజులలో భూప్రదక్షిణం

(గతసంచిక తరువాయి)

మావటీడు రైలు దారిని వదలి, ఉత్తరాభిముఖంగా కదలి అడ్డదారిన సాగాడు. వింధ్య పర్వత శ్రేణి ఇష్టాయిష్టాలనుబట్టి డొంక తిరుగుడుగా పోతోంది ఆయోమార్గం. ఇలా అడవుల కడ్డబడి పోతే ఇరవై మైళ్ళు కలిసి వస్తుందనీ, ఈదారి ఇందులో సులువులూ తనకు తెలుసుననీ చెప్పాడు పార్సీ. ఫిలియస్ ఫాగ్‌కి కావలసిందీ అదే.

గజ గమనం దూరంనుంచి చూడడానికి బావుంటుందేమోగాని—ముఖ్యంగా అది తురుగ్గా సాగుతున్నప్పుడు హౌదాలలో కూర్చున్నవారికి 'కడుపులో చల్ల' కదలకుండా ఉండడం సాధ్యంకాదు. నిజానికి ఈ ఏనుగుమీద హౌదాలలో ఉన్న ఫాగ్, క్రోమార్టీ లిద్దరూ కుదుపులతో, నానా అవస్థా పడుతున్నారు. అయినా అవస్థలను మాటా పలుకు లేకుండా సహించడం బ్రిటిష్ జాతీయులకు సహజమైన విద్య. పీకె దాకా మునిగిన ఆ యిద్దరూ అలాగే అణిగి కూర్చున్నారు. మాటా పలుకూ లే ఒకరినొకరు చూసుకోకుండా ఏనుగు వీపుమీద 'కూర్చున్న' పాస్పర్టూ మాత్రం కుదురుగా ఉండడంలేదు. ఉండడానికి వీలులేదు. ఏనుగు పరుగుకి ఎగిరెగిరి పడుతున్నాడు. ఒకోసారి తూలి ఏనుగు మెడమీద పడతాడు. కోలుకుని పట్టు చూసుకునేలోగా ఎగిరి వీపు చివర పడుతున్నాడు. కుదపా యిస్ప్రింగుపెట్టెలో బంతిలా ఉంది అతని వరస. కాలు మోపగానే పైకెగరదన్నే స్ప్రింగు బోర్డుమీద గెంతులువేసే సర్కస్ బఫూనులా ఉన్నాడు. నాలికపళ్ళమధ్యకి రాని వృద్ధని యజమాని ఫాగ్ చెప్పినమాట మటుకు మన్నించి 'శిరసా'వహించుతాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే ఆ వూపులో నాలి క్కాస్తా కటుక్కున తెగి వూరుకునేదే. సహజంగా అల్లరిఘటం కాబట్టి, బఫూనులా ఎలాగా ఎగురుతున్నాంగదా అన్నట్టు నవ్వుతూ కేరింతలు, కబుర్లు జోరుగా సాగిస్తున్నాడు. ఎగిరివెళ్ళి ఏనుగు కుంభస్థలం దగ్గిర పడ్డపుడల్లా తన చేతిసంచిలోంచి కలకండ (పటికబెల్లం) కాస్తా తీసి దానికి అందిస్తూన్నాడు. తుంచి చేసుకుంది కన్నట్టు. ఏనుగూ అడుగు మందగించకుండానే తొండం వెనక్కితిప్పి అలవోకగా ఆ ముక్క అందుకుని నోట్లో వడేసుకుంటోంది.

రెండు గంటలు పాటూ పాటేన ప్రయాణం సాగాక, మావటి ఒక చోట ఏనుగును ఆపాడు. అది ఒక గంట విశ్రాంతి తీసుకుంటుందని చెప్పాడు. ఏనుగు ముందుగా చేరువనేవున్న చెరువులో కడుపారా నీరు త్రాగింది. తరవాత కొమ్మలూ, రెమ్మలూ విరుచుకుని నెమ్మదిగా ఆరగించసాగింది. ఏనుగకి విశ్రాంతేమిటని సర్ ఫ్రాన్సిస్ వాదించలేదు. ఆయన చాలా అలిసిపోయాడు. ఫిలియస్ ఫాగ్ మాత్రం అప్పుడే నిద్రలేచి మంచందిగి వచ్చినవానిలా స్వచ్ఛంగా కనిపించాడు.

"ఇతగాడు మనిషికాడు. ఇనప ఘటం" అన్నాడు సర్ ఫ్రాన్సిస్, చెక్కుచెదరకుండా నిలబడ్డ ఫాగ్‌ను చూచి విస్తుపోయి.

"సాదా ఇనుముకాదు—పోత పోసిన ఇనుము" అన్నాడు— చకచక అల్పాహారం సిద్ధపరుస్తున్న పాస్పర్టూ.

పన్నెండు గంటలకి పార్సీ ఏనుగును సిద్ధపరచాడు. బృందం బయల్దేరింది. దారి పోను దుర్గమం అయింది. క్రమంగా అరణ్యం స్వరూపం మారింది. చింతచెట్లూ తాడితోపులూ దట్టంగా ఉన్న ప్రాంతంగుండా కొంత సేపు యాత్ర సాగింది. తరవాత నీడచెట్లూ, నీటిపట్లూ కాని పర్రభూములు. ఎండ తీవ్రంగా కాస్తోంది. అంతా పొదలూ, డొంకలూ, సైనేట్ రాతి కొండలూను. బుందేల్ ఖండ్‌లోని ఈ ఉత్తరాది ప్రాంతానికి ప్రయాణికులు విహారయాత్రలకిరారు. పని ఉన్నా కూడా తప్పనిసరి అయితేనే వస్తారు. ఇక్కడ హిందూ మతంలో అత్యాచారాలను మూఢంగా అనుసరించే జనం నివసిస్తు ఉంటారు. వింధ్య పర్వతశ్రేణుల మాటున, బలవత్తరులైన రాజుల నీడన ఉన్న ఈ దుర్గమ ప్రాంతంలోకి బ్రిటిష్ హయాం చొచ్చుకుపోలేకపోయింది—పోయినా స్థిరమైన, క్రమమైన ప్రభుత్వం నిలిపి నడపడం దుస్సాధ్యం.

క్రమంగా వింధ్య ప్రాంతం సరిహద్దు సమీపించేవరకు, కియానీ (ఏనుగు) నడక తిరిగి చురుకుగా సాగింది. మధ్యాహ్నానికి గంగకు ఉపనది అయిన కానీ నది తీరాన కాలెంగర్ గ్రామం పక్కగాసాగి గంగా పీఠభూమి ప్రవేశించింది. మావటీడు సాధ్యమైనంతవరకూ ఏ నరుడి కంటబడకుండా, పల్లెలు జోరబడకుండా ముందుకు సాగిపోవాలనే తీర్మానించుకున్నాడు. ఈ ప్రాంతంలో అదే క్షేమం అని అతని నమ్మకం. ఈశాన్యాభిముఖంగాపోతే, ఇంకో పన్నెండు మైళ్లలో తగులుతూ అలహాబాద్ చేరుకో



"బంగారు జరీ వేసిన పల్చని మేలిముసుగు లోంచి ఆమె రూపు రేఖలు లీలగా కనిపిస్తున్నాయి."

వచ్చు. నదీ ప్రాంతంలోకి వచ్చాక పచ్చని చెట్లు కనబడ్డాయి. ఒక అరటితోట దగ్గిర కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు. అరటిపళ్ళు రొట్టెలలా పుష్టిని తుష్టినీ ఇచ్చాయి. పీగడలా మధురంగా ఉన్నాయి. అతిథులు కడుపారా ఆరగించి తృప్తులయ్యారు.

రెండు గంటలకి ఆ బృందం తిరిగి చిక్కటి కోనలో ప్రవేశించింది. ఇలా చెట్లమాటున పోవడమే క్షేమకరం—కొంచెం చుట్టు అయినా ఇంతవరకూ ఉపద్రవాలు ఏవీ వచ్చిపడలేదు. అటువంటివేవీ లేకుండా ఈ యాత్ర పూర్తి అవుతుందని అనుకుంటూ ఉండగానే, కియానీ కొంచెం కలవరం, కంగారు పడుతున్నట్టనిపించింది. అంతలోనే అది హఠాత్తుగా ఆగి నిలబడిపోయింది.

సాయంకాలం నాలుగు గంట అయింది.

"ఏమిటి, ఏ మొచ్చింది" అన్నాడు సర్ ఫ్రాన్సిస్ క్రొమార్టీ హౌదాలోంచి మెడ రిక్కించి పైకి చూసి.

"తెలీలేదండి" అన్నాడు పార్సీ. గుబురుగాఉన్న చెట్ల అవతలనించి సన్నన్నగా వినబడుతున్న రొద మీద ఉంది అతని ధ్యాస. అదేమిటో తేల్చుకుందామని ప్రయత్నిస్తున్నాడు.

కొద్ది క్షణాలలో రొద కొంచెం ప్రస్ఫుటంగా వినబడసాగింది. సంబరం తాలూకు సంరంభంలా ఉంది. బాకాలూ, మనుషుల కేకలూ కలగలుపై వినిపిస్తున్నాయి.

పాస్పార్టు ఒళ్ళంతా కళ్ళూ, చెవులూ చేసుకుని ప్రాణాలుగ్గబట్టి చూస్తున్నాడు. ఫిలియాస్ ఫాగ్ మాటా పలుకూ లేకుండా రివాజుప్రకారం స్థిమితంగా కూర్చున్నాడు.

పార్సీ కిందికి దూకాడు. ఏనుగును ఒక చెట్టుకు కట్టి, డొంకలలో దూరబడి ముందుకు వెళ్లాడు. కొద్ది నిమిషాలలో తిరిగి వచ్చేశాడు.

"బ్రాహ్మణుల పూరేగింపు. ఇటే వస్తోంది. వీలైతే వాళ్ళ కంట బడకుండా ఉందాం. మీ రెవ్వరూ దిగ నక్కరలేదు. అలాగే కూర్చోండి" అంటూ ఏనుగు కట్టువిప్పి, మెల్లిగా దీనిని ఒక పెద్ద చిక్కటి పొద మాటుకు తీసుకువెళ్లి నిలిపాడు. వాళ్ళు ఇటు చూడడం, ఆపైన తాము పలాయనం సాగించడం అవసరం కావచ్చు. అందుకు సన్నద్ధుడై పక్కనే నిలబడ్డాడు పార్సీ. కాని అలాటి ప్రమాదం లేదు. భక్తుల పూరేగింపులో ఎవరికీ వీళ్ళు కనబడరు. అక్కడి మొక్కలూ, పొదలు అంత దట్టంగా ఏపుగా పెరిగి ఉన్నాయి.

పూరేగింపు దగ్గిరపడుతూంది. బాకాలు, కేకలూ, తప్పెటలూ, తాళాలూ గంద్రగోళంగా వినబడుతున్నాయి. మధ్యలో ఉచ్చ స్వరాలలో మంత్రాలు వినిపిస్తున్నాయి. అంతలోనే దాదాపు 50 అడుగుల దూరాన పూరేగింపు కనబడింది. ఏదో మత సంబంధమైన తంతులా ఉంది. చెట్లమాటున పొంచిఉన్న ఫాగ్ ప్రభృతులకు పూరేగింపులో జనం అంతా స్పష్టంగా కనిపిస్తున్నారు.

ముందు వరసలో మతాధిపతులున్నారు. పెద్ద శిరోవేష్టనాలు, వెండి బంగారు జరీలు పోసిన పీతాంబరాలూ ధరించారు. వారి చుట్టూ స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ నడుస్తున్నారు. వారంతా విలాప సూచకమైన పాట పాడుతున్నారు. వారి వెనక పెద్ద శకటం, భారీ చక్రాలకున్న ఆకుల మామూలు బళ్లకి ఉండేవికావు మెలి వేసుకొన్న సర్పాల ఆకారంలో మలచి ఉన్నాయి. రథంలా ఉన్న ఆ బండికి రెండు జతల ఆబోతులను పూన్చారు. కంటికి నదరుగా కొట్టొచ్చినట్టు కనబడేలా అలు. కరించిన దుప్పట్లతో వాటిని ముస్తాబు చేశారం ఆ రథం మీద గంభీరమైన పెద్ద విగ్రహం ఒకటి ఉంది. అది రక్తవర్ణంలో ఉంది. నాలుగు చేతులు ఉన్నాయి. కళ్ళు భయంకరంగా ఉన్నాయి. జుట్టు విరబోసుకున్నట్టుంది. నాలుక బయటికి చాచి ఉంది. పెదిమలకు లత్తుకరంగు పూసి ఉంది. మెడలో పుర్రెల దండ వ్రేలాడుతూంది. నడుముక్కు మానవ హస్తాలమాల. నేలకూలినట్టున్న ఒక రాక్షసుడిమీద నిలచినట్టుగా నిర్మించారు ఆ విగ్రహాన్ని. రాక్షసుడికి తల తెగిపోయింది.

ఈ విగ్రహం ఏమిటో సర్ ఫ్రాన్సిస్ క్రోమర్టీ గుర్తుపట్టాడు.

"కాళీ విగ్రహం. ప్రేమకు అధి దేవత" అన్నాడు మెల్లిగా.

"ప్రేమా! ఎన్నటికీకాదు. మృత్యువుకి దేవత అంటే ఒప్పుకుంటాను. ఇంత వికారంగాఉన్న ముసలమ్మ బొమ్మని పట్టుకుని ప్రేమ అంటారేమిటి" అన్నాడు పాస్పార్టు.

నోరు మూసుకోవలసిందని సైగ జేశాడు పార్సీ.

కాళీ విగ్రహం చుట్టూ కొందరు ఫకీర్లు శివాలెత్తి ఆడుతున్నారు. ఒళ్ళంతా బూడిద పూసుకొన్నారు. ఒంటినిండా గంట్లున్నాయి. వాటిలోంచి నెత్తురు చుక్కలుగా పడుతోంది. ఇలా మూఢ విశ్వాసాలున్నవారు చాలమంది ఈ దేశంలో ఇంకా ఎన్నో ఓఘాయిత్యాలు చేస్తారు. జగన్నాథుడి రథ చక్రాల క్రింద కావాలని పడి, ప్రాణాలర్పించుకొంటారు.

వీళ్ల వెనుక మరో బ్రాహ్మణ బృందం వస్తోంది. పట్టుబట్టలు కట్టుకుని వాళ్లంతా బాగా అలంకరించుకుని మెరసిపోతున్నారు. వాళ్ల మధ్య ఒక స్త్రీ తూలుతూ, నిలవలేక నడుస్తూ ఎక్కడికక్కడ కుప్పకూలిపోయేలా వస్తోంది. బ్రాహ్మణులు ఆమెను పట్టుకుని బలవంతాన ఈడ్చుకు వస్తున్నారు.

ఆమె పడుచు పిల్లే. దాదాపుగా యూరప్ స్త్రీలంత తెల్లగా ఉంది. ఆమె తల, చెవులు, ముఖం, కంఠం, భుజాలు, చేతులు, వ్రేళ్ళు, కాళ్ళు, పాదాలు అన్నీ ఆభరణాలతో నిండివున్నాయి. బంగారు జరీ వేసిన ఒక పల్చని మేలి ముసుగులోంచి ఆమె రూపురేఖలు లీలగా కనిపిస్తున్నాయి.

ఆ వెనకది కన్ను చెదరే దృశ్యాంతరం. సైనికులు బారుతీరి వస్తున్నారు. మొలలో అందరికీ కత్తులు వేలాడుతున్నాయి. ఒరలు లేనందువల్ల అవి ధగధగ మెరుస్తున్నాయి. వాళ్ళ చేతులలో వెండి బంగారు తాపడంచేసి రాళ్ళు పొదిగిన పెద్ద పెద్ద పిస్తోళ్ళున్నాయి. ఆ వెనక కొందరు పల్లకీలో ఒక శవాన్ని మోసుకువస్తున్నారు.

మృతుడు వృద్ధుడు. రాజోచితమైన దుస్తులు వేసి, రత్నాభరణాలుపెట్టి అలంకరించారు.

ఆ వెనుక గాయకుల బృందం ఉంది. ఆవేశపరుల కేకలతో, పాటలతో, వాద్యాలతో అంతా గంద్రగోళంగా చెవులు హోరుమనేలా ఉంది.

సర్ ఫ్రాన్సిస్ క్రొమర్టీ ఈ సంరంభాన్ని చూసి బాధ పడ్డాడు. బాధగా, పార్సీకేసి చూసి "సతి" అన్నాడు—కదూ ? అన్నట్టుగా.

పార్సీ అవునన్నట్లు తల తాటించి, మాట్లాడవద్దని సైగ చేశాడు. పూరేగింపు మెల్లిగా వారిని దాటివెళ్లి దూరాన చెట్ల గుబురులో కలసిపోయింది. కొద్ది నిమిషాల తరువాత కేకలు, వాద్యాల ధ్వనులు మంత్ర పఠనం రొద కూడా మెల్లిగా కరిగి అణిగిపోయాయి. గంభీరమైన నిశ్శబ్దం ఆవరించింది.

అంతక్రితం సర్ ఫ్రాన్సిస్ అన్న మాటను విన్న ఫాగ్‌కు, అదేమిటో తెలియలేదు. ఇపుడు వీలుకాగానే అడిగాడు.

"సతి అంటే ఏమిటి ?"

"సతి అంటే నరబలి అన్నమాట. ఎటొచ్చీ బలి అయ్యేవాళ్ళు ఇష్టపడి స్వచ్ఛందంగా అందుకు సిద్ధపడతారు. మీరిందాక చూసిన ఆ స్త్రీని రేపు తెల్లవారు జామున కాల్చివేస్తారు."

"దుర్మార్గులు !" అన్నాడు పాస్పార్టు ఉద్రేకం అణుచుకోలేక.

## జరిగిన కథ

లండన్ రిఫారం క్లబ్ సభ్యుడు ఫిలియాస్ ఫాగ్ 80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమేనని 20 వేల పౌండ్లు పందెం కాసి, ఆ రోజు రాత్రే తన సేవకుడు పాస్పార్టూను వెంట తీసుకొని భూప్రదక్షిణానికి బయలు దేరుతాడు. ప్రయాణం ప్రారంభమైన ఏడవరోజున సూయజ్ నుంచి డిటెక్టివ్ ఫిక్స్ బ్యాంకు దొంగ ఫాగ్ దొరికాడనీ, అతనిని అరెస్టు చేయడానికి వెంటనే బొంబాయికి ఒక వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రాం ఇస్తాడు ఫాగ్ బొంబాయి చేరుకుంటాడు. వెంటవచ్చిన డిటెక్టివ్ ఫిక్స్ పోలీసు కమీషనర్ కార్యాలయానికి వెళ్ళి ఫాగ్‌ను అరెస్టుచేయడానికి వారెంటు వచ్చిందేమో విచారిస్తాడు. రాలేదని అక్కడివారు చెప్పేసరికి తెల్లబోతాడు. ఆరాత్రే ఫాగ్ బొంబాయి నుంచి కలకత్తాకు రైలులో ప్రయాణమవుతాడు.

రైలు రోథాల్ సమీపంలోని ఒక అడవి చివర ఆగిపోతుంది. అక్కడ నుంచి అలహాబాదు వరకు అప్పటికి పట్టాలు వెయ్యలేదు. గత్యంతరం లేక ఫాగ్ రెండు వేల పౌనులకు ఒక ఏనుగు కొని అలహాబాదుకు బయలుదేరుతాడు.

"మరి ఆ శవం ?" అన్నాడు ఫాగ్.

"అది రాజుగారి శవం. ఆమె భర్త అన్న మాట. ఆయన బుందేల్‌ఖండ్ రాజా. స్వతంత్రుడు" అన్నాడు పార్సీ.

"ఇంకా ఈ దేశంలో ఇంతటి ఘోరమైన ఆచారాలు ఎలా సాగుతున్నట్టు ? బ్రిటిష్‌వాళ్ళు ఆపలేకపోయారా ?" అన్నాడు ఫాగ్ నిర్వికారస్వరంతో.

"దేశం చాలా భాగం బాగు పడింది. అంతటా ఇలాటివి జరగవు. ఇదుగో ఇలాటి దుర్భేద్యమైన ప్రాంతాలు కొన్ని ఉన్నాయి. ముఖ్యంగా ఈ బుందేల్ ఖండ్ లాటివి. ఇక్కడ మాకెం పలుకుబడి అధికారం లేవు. వింధ్య పర్వతాలకు ఉత్తరంగాఉన్న ఈవాలు వాలంతా ఇంతే. ఎప్పుడూ హత్యలూ, దోపిడీలూ జరుగుతూ ఉంటాయి" అన్నాడు బ్రిగేడియర్ జనరల్ సర్ ఫ్రాన్సిస్.

"పాపం ! ఆవిణ్ణి బతికుండగా నిలువునా కాల్చేస్తారన్నమాట" అన్నాడు.

సర్ ఫ్రాన్సిస్ నిట్టూర్చాడు.

"అవును. కాల్చేస్తారు. అయితే — అలా జరక్కపోతే, ఆవిడ స్థితి మరీ నికృష్టం అయిపోతుంది. చుట్టుపక్కలంతా హీనంగా చూస్తారు. ఆమె జుట్టు తీయించి వేస్తారు. కడుపునిండా అన్నం తిన నివ్వరు. ఎదుటపడితే చీదరించుకుంటారు. చాలా అపవిత్రురాలైన వ్యక్తిగా చూస్తారు. ఎవరి ఆదరం, ప్రేమా లేక చివరికి అలా కృశించి దిక్కుమాలిన కుక్కలా చనిపోతుంది. ఇదంతా తలుచుకుని, ఈ బాధలకన్న చావే నయమని చితి ఎక్కుతారు చాలమంది. భర్తమీద ప్రేమ, మతంపట్ల గౌరవ ప్రపత్తులు — వీటికన్న ఈ బాధలవల్ల భయానికే తలవొగ్గి ప్రాణాలు విడవడానికి సిద్ధపడతారు. ఏవో కొన్ని సందర్భాలలో మటుకు స్వచ్ఛందంగా ప్రాణత్యాగం చేస్తారు. మొత్తంమీద ప్రభుత్వం ఇందులో గట్టిగా కలగజేసుకుని ఈ దురాచారం నిర్మూలించడం అవసరం. ఆమధ్య ఒకసారి—నేను బొంబాయిలో ఉండగా, ఒక రోజున ఒక వితంతువు—పడుచుపిల్లే—గవర్నరు దగ్గరకువచ్చి తాను సహగమనం చేయదలచుకుందని, అందువల్ల భర్త శవంతో తననూ దహనం చేయడానికి అనుమతి ఇవ్వాల్సిందనీ అడిగింది. గవర్నరు ఒప్పుకోలేదనుకోండి. తరవాత ఆవిడ బొంబాయి వదలి, స్వతంత్రంగాఉన్న రాజ్యంలోకివెళ్లి ఆశ్రయం సంపాదించి అక్కడ సహకారంతో అనుకున్నంత పని చేసి ప్రాణాలు విడిచింది" అన్నాడు.

సర్ ఫ్రాన్సిస్ కథనం జరిగినంత సేపూ పార్సీ ఆమోద సూచకంగా తల తాటిస్తూ విన్నాడు. ఆయన చెప్పేది పూర్తికాగానే, "రేపు జరిగే సహగమనం మాత్రం ఇష్టపడి చేస్తున్నది కాదు" అన్నాడు.

"నీకెలా తెలుసు ?"

"నాకేమిటి. బుందేల్‌ఖండ్‌లో అందరికీ తెలుసు. ఈ కథ."

"కాని ఆవిడ వాలకం అలా కనబడలేదే. ఇష్టం కాకపోతే వెనక్కి లాగేదిగదా. ప్రతిఘటిస్తున్నట్టు కనబడలేదే" అన్నాడు సర్ ఫ్రాన్సిస్.

"దానికేముంది. గంజాయి దీపంతో, నల్లమందు ఆమెకు మత్తెక్కించి స్పృహ తప్పించేశారు."

"అయితే ఆమెని ఎక్కడికి లాక్కుపోతున్నట్టు ?"

"పిలాజీ ఆలయం అని— ఇక్కడికి రెండు మైళ్ల దూరంలో ఉంది. రాత్రిఅంతా అక్కడ గడుపుతారు."

"ఈ దహన కాండ అంతా—"

"—తెల్లవారు ఝామునే జరుగుతుంది" అంటూ పార్సీ అక్కడనించి కదిలి ఏనుగును మెల్లిగా పొదల మాటునుంచి ఇవతలికి తీసుకువచ్చి పైకెగిరి కూర్చున్నాడు. ఏనుగుని నడపడానికి వేసే ఒక విచిత్రమైన ఈల వేసి, ప్రయాణం ఆరంభించబోతూఉండగా ఫిలియస్‌ఫాగ్ అతన్ని ఆగమన్నాడు.

"ఈవిడని మనం రక్షించగలిస్తే బాగుండును" అన్నాడు సర్ ఫ్రాన్సిస్‌కేసి తిరిగి .

"ఈవిడనా ! రక్షించడమా ? మిస్టర్ ఫాగ్ ! ఏమిటి మీరనేది !" అన్నాడు సర్ ఫ్రాన్సిస్ ఆశ్చర్యంతో.

"నాకు ఆదా అయిన దాంట్లో ఇంకా పన్నెండు గంటలకాలం మిగిలిఉందిగదా. దానిని ఇందుకు వినియోగించవచ్చు."

"మీరు....మీరు హృదయంఉన్న మనుషులు ! సహృదయులు" అన్నాడు సర్ ఫ్రాన్సిస్ ఆశ్చర్యానందాలతో.

"మరే అప్పుడప్పుడు....నాకు తీరిక ఉన్నప్పుడు" అన్నాడు ఫాగ్ ముక్తసరిగా.

(ఇంకాఉంది)

# సంక్రాంతి సెలవులు

ఎస్. జయరామరెడ్డి



గోపి బుల్లిలా అని పద్దుకాని పొట్టలు దగ్గర చేరాడు. బస్సు స్టాండుకు వచ్చాడు. గవర్న మెంటువాళ్ళ బస్సులు వచ్చాక గోపీ ప్రయాణం చెయ్యటం ఇదే మొదటి స్టాండింగు అంటా వరుసగా నిలబడి ఉన్న ఎర్రరంగు మూతిలేని కారుతో వాళ్ళ స్కూళ్ళో ఎ. సి. సి. పెరేడ్ లాగా చక్కగా ఉంది కండక్టరు కాకీ చొక్కా, పాంటు తొడుక్కొని టోపీ పెట్టుకొని చక్కగా ఉన్నాడు. కాళ్ళకు బూట్సు కూడా ఉన్నాయి. సైగ చేస్తూ ఉన్నాడు. గోపీకి చూస్తే, పొట్టి ఉన్న కండక్టర్లంటే అసహ్యం. లేవలేకా, లేచినా ఆ మహా ... మధ్యన వచ్చాకా, తను సీటులో కూర్చుని "టికెట్లు లేనివాళ్ళు వచ్చి తీసుకోవాలి, రైట్" అని అంటారు. సీట్ల మధ్యలో అందరి కాళ్ళూ తొక్కుకుంటూ వెళ్ళి టికెట్లు తెచ్చుకోవాలంటే గోపీకి ఓపిక లేదు.

ప్రస్తుతం బస్సులో చక్కగా ముందుగానే టికెట్టు ఇచ్చి ఆ తరువాత లోపలికి పోని స్తున్నారు. గోపీ మెత్తటి సీటులో దివరగా ... కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు ... దాటిపోయింది. పచ్చటి పొలాలు, ఆకు తోటలు, చెరుకు తోటలు కనులపండువుగా ఉన్నాయి. గోపీకి ఇంటిదగ్గర వాళ్ళమ్మా, సీతా, కరువు కాలువా గుర్తుకొచ్చాయి. ఇంటికి వెళ్ళి అప్పటికప్పుడే మగాడు నెల్లూ కావస్తూంది. ఎప్పుడు ఊరు చేరుతామా అని గోపీకి ఆత్రుతగా ఉంది.

బస్సు నాలుగు గంటలకు పల్లూరు చేరింది. నాన్న పంపిన పాలేరు వెంకడు తలగుడ్డ చుట్టు కొంటూ, బస్సు దిగేవాళ్ళతో తనకోసం చూస్తు న్నాడు. గోపీని చూడగానే "ఏం చిన్నబ్బాయిగారో, బస్సీ పీక్షకి బలిసిపోయావే" అన్నాడు. పై కెక్కి పెట్టి దింపాడు. మైలుదూరం నడిచి ఇంటికి చేరేప్పటికి అమ్మ దీపాలు పెడుతోంది. చిన్న పాలేరు అప్పుడే గేదెలపాలు పితుక్కొని వచ్చాడు. అమ్మ తోడిన వేడినీళ్ల స్నానంచేసి, పాలు పోసు కొని అన్నం తిన్నాడు. "పరీక్షలు బాగా రాశావా?" అన్నాడు గోపీ నాన్న. గోపీ తల ఊపాడు. కాస్సేపు సీతని ఆడించేసరికి నిద్రవచ్చేసింది.

తెల్లవారి గోపీ నిద్రలేచేప్పటికి ఎనిమిదున్నర దాటింది. సంక్రాంతినెల కావటంవల్ల పొగ మంచు బాగా పట్టి ఎదుటివాళ్ళుకూడా సరిగా కనపడటంలేదు. ఎదురింటి కోమట్ల పిల్లలు వరి చెత్తతో చలిమంట వేసుకొంటున్నారు. గోపీ కాసేపు చలిమంటదగ్గర కూర్చున్నాడు. అప్ప టికి బాగా వెల్తురు వచ్చి మంచు కరిగిపోయింది. ముఖం కడుక్కుని, వాళ్ళమ్మ ఇత్తడి గ్లాసు నిండా యిచ్చిన పాలు తాగి, గోపీ కాలువవైపు బయలు దేరాడు.

కరువుకాలువ నిండుగా నిశ్చలంగా పారుతోంది. అసలు పారుతున్నట్లే లేదు. గోపీ బల్లకట్టు కోసం నిలబడ్డాడు. బల్లకట్టు త్రిప్పే తిరపతి అవతలఒడ్డు నుంచే గోపీని గుర్తుపట్టాడు. "ఏమండోయ్ చిన్నబ్బాయిగారో, ఎప్పుడు దిగటం" అన్నాడు. బల్లకట్టు ఇవతల ఒడ్డుకు వచ్చింది. గోపీ ఎక్కాడు.

"ఆc, బెజవాడసంగతు లేంటి బాబూ" అన్నాడు తిరపతి గెడవేస్తూ.

"బెజవాడ కాదు తిరపతి, ఇప్పుడు విజయ వాడ అనాలి. తెలిసిందా ?"

ఇనపబద్దెల కానుకొని బోడిగుండూ, గోచి పెట్టుకొని ఉన్న పదేళ్ల కుర్రాడు గోపీ వేసు

కున్న సిల్కు బుష్షర్టు వేపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

అది చూసి తిరపతి "అదేమిట్రా, అట్టా చూస్తావ్. మన సుబ్బారెడ్డికాపుగారి అబ్బాయి కదూ. బస్తీలో చదువుకొంటున్నాడు — మా చిన్నోడు బాబూ. మీ తోటివాడే. వీడి కొక మంచి చొక్కా ఇప్పించండి అబ్బాయిగారూ" అన్నాడు.

"చదువుకొంటున్నావా ?" అడిగాడు గోపీ.

ఆ పిల్లవాడు లేదని తల ఊపాడు.

"నీ పేరేంటి ?"

"సుబ్బన్న—సుబ్బడు. నేను కూడా బల్లకట్టు తిప్పగలను" గర్వంగా అన్నాడు సుబ్బడు కాలవ లోకి చూస్తూ.

"చిన్నబ్బాయిగార్నికూడా నీ వెంట తీసుకుపోరా" అన్నాడు తిరపతి కొడుకువేపు చూసి.

"ఎక్కడికి పోతున్నావ్" అడిగాడు గోపీ.

"పెదకట్టంట. తుమ్మబంక పోగు చేయటానికి పోతున్నాను. మీరూ వస్తారా ?" ఉత్సాహంగా అడిగాడు సుబ్బడు.

"మరి నాకూ కాస్త బంక పెడతావా ? పుస్తకాలు అంటించుకోటానికి ?"

సుబ్బడు 'వో' అన్నాడు.

గోపీకి సుబ్బడికి బాగా స్నేహం కలిసింది. పెద్ద కట్టమీద తుమ్మల్లో బంక పోగుచేస్తూ సుబ్బడు ఎన్నో కథలు చెప్పాడు. ఫస్టుఫారం చదువుతున్నాగూడ గోపీకి రానన్ని కథలు సుబ్బడికి వచ్చు. సినిమా పద్యాలు ఘంటసాలకన్నా బాగా పాడగలడు. ఇంటికి వచ్చేప్పుడు గోపీకి బోలెడంత తుమ్మ బంక ఇచ్చి పంపాడు.

"సాయంత్రం మా ఇంటికి రా. నీకు చొక్కా ఇస్తాను" అన్నాడు గోపీ. దూరంగా పోతున్న సుబ్బడు బోడిగుండు వెనక్కు తిప్పి 'వో' అన్నాడు.

ఇంటికొచ్చాక "ఎక్కడిదిరా తుమ్మబంక ?" అన్నది గోపీతల్లి.

"తిరపతి కొడుకు సుబ్బడు లేడూ, వాడు పెట్టాడు. వాడూ నేనూ కలసి పెదకట్టంట తిరిగి పోగుచేశాం. అమ్మా, సుబ్బడు చాలా మంచి వాడు కదూ ?" అన్నాడు గోపీ.

అమ్మ విసుక్కుంది.

"ఆ పాలేరువెధవతో నీకు స్నేహం ఏమిట్రా? కరణంగారింటికి పోగూడదూ. వాళ్ళబ్బాయికూడా పట్నం నుంచి వచ్చాడుగా" అన్నది.

గోపీ సుబ్బణ్ణి రమ్మన్నసంగతి మర్చిపోయి అన్నం తిని కరణంగారింటికి పరిగెత్తాడు.

మర్నాడు గోపీ కాలువగట్టు కెళ్ళేప్పటికి సుబ్బడు గోచీపెట్టుకొని కాలవలో ఈత కొడుతున్నాడు. గోపీని చూచి "మీరు రండి. ఈత కొడదాం. నీళ్ళు వెచ్చగానే ఉన్నాయ్" అని కేక వేశాడు.

"నేనా ! నాకు ఈత రాదుగా?" గోపీ తిరిగి కేక పెట్టాడు.

సుబ్బడు ఈదుకొంటూ గోపీ ఉన్న ఒడ్డుకు వచ్చాడు.

గొప్పవారి అబ్బాయి గోపీ కోరి పాలేరుకొడుకు సుబ్బడితో చెలిమిచేశాడు. ఫలితం ఒక్కటే. గోపీకి జ్వరం వచ్చినందుకు శిక్షగా సుబ్బడిని పగ్గంతో చితగ్గొట్టాడు గోపీతండ్రి.

అపరాధం లేకపోయినా అవమానం తప్పలేదు. అయినా సుబ్బడు లేకపోతే గోపీ ఏమికాను ? గోపీతండ్రి ఏమికాను ?

"నాకూ ఈత నేర్పుతావా ?" అన్నాడు గోపీ.

"ఇక్కడ కాదు. ఇది చాల లోతు. మధ్యాన్నం లంకమీదకు వస్తే అక్కడ నేర్పుతాను" అంటూ మళ్ళీ ఈదుకొంటూ అవతలికి వెళ్ళిపోయాడు.

గోపీ ఇంటిదగ్గర తొందరగా అన్నం తిని లంకకు బయలుదేరాడు. బల్లకట్టుమీద సుబ్బడు కలిశాడు. కరువుకాలవ దాటితే వచ్చేది కృష్ణా నదే. అసలు కరువుకాలవకీ, కృష్ణకీ ఒకటే గట్టు. ఆ గట్టు దాటితే కొంచెందూరం తాటిచెట్లు, తుమ్మలు, ఆ తర్వాత ఇసుక. కంటికి కనిపించినంతవరకు తెల్లటిమెత్తని ఇసుక. దాదాపు అర కోసెడు దూరం పోతే పెద్దలంక. ఆ లంకని గోపీ నాన్నే కౌలుకు తీసుకున్నాడు. ఇసుకలో నడుస్తుంటే మెత్తగా, వెచ్చగా, చక్కిలిగింతపెట్టి నట్లుగా ఉంటుంది. ఇంకా ఎంతదూరమైనా నడిచి వెళ్ళాలనిపించింది గోపీకి. లంకలో మంచి రేగిచెట్లు ఉన్నాయట. సుబ్బడు నోరూరిస్తుండగా ఇద్దరూ లంకమీదకు చేరుకొన్నారు. తూర్పు వైపున లంక ఒడ్డునే పెద్ద వేపచెట్టొకటి ఉన్నది. అంత పెద్ద చెట్టుని గోపీ ఎక్కడా చూడలేదు. పొడవుగా ఉన్న వేపచెట్టు కొమ్మలు, ప్రక్కనే ఉన్న మడుగు మీదకు వాలి నీళ్ళలో ఊగుతున్నాయి. గోపీ ఆ వేపచెట్టునూ, తెల్లగా మెరుస్తున్న నీళ్లనూ చూస్తూ "దీంట్లో దిగుదామా?" అన్నాడు.

"అమ్మో ! దీంట్లోనే ? దీంట్లో మొసళ్ళు ఉన్నాయి తెలుసా ? పొరబాటున ఏ గొడ్డు దిగినా, మళ్ళీ బయటకు రాలేదు" అన్నాడు సుబ్బడు గోపీచెయ్యి పట్టుకుంటూ.

"అంతా ఒట్టిదే. నిజంమొసళ్ళు ఇక్కడుంటా యేమిటి ?"

"నిజంమొసళ్ళే. నే సొంతకళ్ళతో చాల సార్లు చూశాను ఒడ్డుకొస్తే. మొసళ్ళు ఒడ్డుకొచ్చినప్పుడు ఏమీ చెయ్యలేవు. అసలు దీనిపేరే మొసళ్ళమడుగు. కావాలంటే మా అయ్యని అడుగు" అన్నాడు

"మరి నాకు ఈత నేర్పుతానంటివిగా?"

"ఇక్కడ కాదు. అవతల ఇంకొక మడుగు ఉంది. అదైతే లోతు ఉండదు. రేపు ఒక తుండుగుడ్డ తీసుకురండి. ఈతకొట్టాక తుడుచుకోక పోతే మీలాంటివారికి జలుబు చేస్తుంది" అన్నాడు సుబ్బడు.

గోపి ఉత్సాహమంతా చచ్చిపోయింది. సుబ్బడు సినిమాలో పద్యాలు పాడుతూ, మంచి మంచి రేగి పళ్ళు ఏరి కోసి ఇచ్చాడు. ఒక తుమ్మచెట్టెక్కి కొమ్మకు వేళ్ళాడుతున్న గిజిగాడిగూడు తెంపుకొచ్చాడు గోపీకిద్దామని. కాని గోపీ దాన్ని తీసుకోలేదు.

"ఛా. దానిగూడు తెంపితే మనకు పాపం కదూ" అన్నాడు.

సుబ్బడు మళ్ళీ చెట్టెక్కి ఆ గూడుని కొమ్మకు కట్టి వచ్చాడు. "రేపు తప్పకుండా ఈత నేర్పాలి సుమా !" అన్నాడు గోపీ.

'వో' అన్నాడు సుబ్బడు.

చీకటి పడుతుండగా ఇంటికి చేరాడు గోపీ. వాళ్ళమ్మ అప్పుడే గారెలు వండుతూంది. "మధ్యాన్నంనుంచీ ఎక్కడకు పోయావురా, అన్నంకూడా తినకండా? కరణంగారి అబ్బాయి నీ కోసం వచ్చిపోయాడు" అన్నది.

గోపీ గారెలు తింటూ లంకకు పోయిన సంగతీ రేగిపళ్ళ సంగతీ చెప్పాడు. వాళ్ళమ్మ మండిపోయింది.

"వెధవా, నిన్న చెప్పానుగదా వాడి వెంట వెళ్ళొద్దని. మళ్ళీ ఎందుకు పోయావ్ ? వాడితో నీకు స్నేహమేమిటి — నువ్వు మళ్ళీ వాడితో కలిసి తిరిగావంటే నాన్నతో చెప్తాను. తెలిసిందా ?" అన్నది.

గోపికి కూడ కోపం వచ్చింది. "ఏమమ్మా ? వాడు మాత్రం కరణంగారి అబ్బాయి లాంటి వాడు కాదా ? ఐనా మా బోర్డింగులో అందరమూ కలిసే తింటాం. నీదంతా పిచ్చిగాని" అన్నాడు.

వాళ్ళమ్మ ఆశ్చర్యంతో నోరు నొక్కుకొంది. గోపీ గారెలు తినకండానే లేచిపోయాడు.

మర్నాడు కరణంగారింటికి వెళ్ళలేదు. మధ్యాహ్నం కాగానే గప్‌చిప్‌గా తుండుగుడ్డ ఒకటి తీసుకుని లంకమీకు చేరాడు. సుబ్బడు చాల సేపు ఈత నేర్పాడు. కాని గోపీకి ఇంకా బాగా రాలేదు కాసిని రేగిపళ్ళు కోసుకొని తిని సాయంకాలానికి ఇంటికి చేరాడు.

వాళ్లమ్మ ఎక్కడకు వెళ్ళావని అడగలేదు. గోపీ చెప్పనూ లేదు. కాని లంకలో ఈతకొట్టిన సంగతి వాళ్లమ్మకి తెలిసింది. బహుశా పాలేరు వెంకడు చెప్పి ఉంటాడు. అన్నం తిని ఆరుబయట మంచంమీద కూర్చొని, సీతను ఆడిస్తున్నాడు గోపీ. వాళ్ల నాన్న

అప్పుడే పొలంనుంచి వచ్చి స్నానం చేస్తున్నాడు. గోపీ అమ్మ తుండుగుడ్డ అందిస్తూ "చూశావా ? మనవాడు చేసేనిర్వాకం ?" అన్నది.

గోపీ నాన్న 'ఏమిటి' అన్నట్లు చూశాడు.

ఆవిడ అంతా చెప్పింది. "నిన్న నేను అన్ని చెప్పినా వినక ఇవ్వాళ లంకకెళ్లి ఈత కొడుతున్నాడట. ఐనా మనవాడి ననిమాత్రం ఏం ప్రయోజనం లే. ఆ వెధవకి మాత్రం కొంచెమన్నా భయం ఉండొద్దా ?"

"అంతవరకూ వచ్చిందా ? నేను చూస్తాలే" అన్నాడు గోపీనాన్న.

మర్నాడు గోపీకి బాగా జలుబుచేసింది. కొంచెం జ్వరంకూడా వచ్చింది. దానికోసం వాళ్లమ్మ చేసిన హడావిడి ఇంతా అంతా కాదు. గోపీని మంచంమీదనుంచి దిగనివ్వలేదు. రంగాచారి వచ్చి, ఏవో కుప్పెలు అరగదీసి మందిచ్చాడు. ఆ నాటుమందు వాసన చూస్తే గోపీకి మంచినాడే జ్వరం వచ్చేది. వాళ్లమ్మ రోజంతా సుబ్బణ్ణి తిడుతూనే ఉంది. గోపీకి ఇంతజబ్బు రావటానికి సుబ్బడే కారణమని వచ్చినవాళ్లందరికీ చెప్తూంది. సుబ్బణ్ణి తిడుతూంటే గోపీకి ఎంతో బాధగా ఉంది. రెండు మూడు సార్లు కోపంతో "ఇంక ఊరుకో అమ్మా" అన్నాడు.

చీకటిపడుతూండగా సుబ్బడు బిక్కు బిక్కుమంటూ వచ్చాడు. గోపీ లోపల గదిలో మంచం మీద పడుకొని ఉన్నాడు. వాళ్లమ్మ సుబ్బణ్ణి బయట వాకిట్లోనే చూచి "ఏంరా, ఎందుకొచ్చావ్ ?" అని గదమాయించింది.

"చిన్నబ్బాయి చొక్కా ఒకటి ఇస్తామన్నారండీ" అన్నా భయం భయంగా.

"...రా, నీకు చొక్కా కావాలా ? పిల్లాణ్ణి తీసు... ...డుచేసింది చాలక ఇప్పుడు మళ్లీ వచ్చా... ! ...ళ్ల నాన్న వస్తున్నాడులే ఉండు" అన్నది కోపంగా.

అంతలో గోపీ నాన్న వచ్చాడు. వస్తూనే సుబ్బణ్ణి చూసి "ఇట్రారా" అని అరిచాడు. సుబ్బడు భయపడ్డాడు.

"విన్నే. కదలవేంరా మొద్దా."

సుబ్బడు మాట్లాడలేదు. ఆయనకు కోపం ఎక్కువైంది. చేతులో ఉన్న పగ్గం చివర విప్పి బలంకొద్దీ సుబ్బడి కాళ్లమీద ఒక దెబ్బ వేశాడు. సుబ్బడి నోటంట ఏడుపు రాలేదు. గజగజా ఒణుకుతున్నాడు. రెండోదెబ్బ పడింది. "ఫో, గాడిదా" అని అరిచాడు. గోపీనాన్న. గోపీ ఇదంతా విని, నీరసంతో మంచం దిగి వచ్చేప్పటికి సుబ్బడు ఏడుపు దిగమింగుతూ, చీకట్లో కలిసిపోయాడు.

గోపీకి రెండో రోజే జ్వరం తగ్గిపోయింది. కరణంగారి అబ్బాయి స్నేహం గోపీకి నచ్చలేదు. రెండు మూడు సార్లు కాలువగట్టుకు వెళ్లాడు. సుబ్బడు, గోపీ పిలిచినా కూడా పలకలేదు. అసలు గోపీవేపు చూడనన్నా లేదు. సుబ్బడి బాబు బల్లకట్టు తిరపతి మాత్రం "వాడి సావాసం మీ కెందుకులే బాబూ. మీరు గొప్పోళ్లు. మీకు వాడి సావాసం తగదు" అన్నాడు బాధగా. గోపీకి చాలా కష్టం వేసింది. ఏదో చెప్పాలనుకున్నాడు. కాని చెప్పలేకపోయాడు.




-చిత్రకారుడు—ఎమ్. ఎస్. ప్రకాష్ (విశాఖపట్టణం)

## సంక్రాంతి సెలవుల్లో

గోపీకి మిగతా తన ఈడు పిల్లలతో ఆడుకో బుద్ధివేయలేదు. పొలాలవెంటా, కాలువగట్ల మీదా ఒంటరిగా తిరుగుతున్నాడు. బొత్తిగా ఏమీ తోచటంలేదు. ఉత్సాహం అంతా చచ్చిపోయింది. సెలవులు ఎప్పుడు అయిపోతాయా అని ఎదురు చూస్తున్నాడు.

ఒకరోజు ఏమీ తోచక లంకవేపు వెళ్లాడు. లంకలో తుమ్మలు కొడుతున్నారు. గోపీవాళ్ల పాలేరు ఇంకా నలుగురైదుగురు కూలీలను పెట్టుకొని తుమ్మలు కొట్టేస్తున్నాడు. వెంకడు గోపీని చూసి "ఏం చిన్నబ్బాయిగారూ, పల్లెటూళ్లో ఏమీ తోచటంలేదా? రేగిపళ్లు కోసిపెడతా రాండి" అని కేకవేశాడు. గోపీ వినిపించుకోలేదు. కాసేపు ఒక్కడే లంకలో అటూ ఇటూ తిరిగాడు. సుబ్బడు గేదెలు కాస్తూ కనిపించాడు. కాని గోపీని పలుకరించలేదు. పలుకరిస్తే వాళ్ల నాన్న తంతాడేమోనని భయం. ఆయన పగ్గంతో కొట్టిన దెబ్బలు వాడు మర్చిపోలేదు. గోపీ ఒక్కడే విచారంగా తిరగసాగాడు. అంతలో పళ్లతోముకోటానికి వేపపుల్లలు కోసుకుందామని బుద్ధిపుట్టింది. గోపీ మెల్లగా మొసళ్లమడుగు పక్కనే ఉన్న వేపచెట్టు వద్దకు వచ్చాడు. చెట్టు చాలా పెద్దది కావటంవల్ల బాగా ఆకులేసి చక్కని పుల్లలున్నాయి. సుబ్బడేగనక ఉంటే నిమిషంలో కావాల్సినన్ని పుల్లలు విరిచిపెట్టేవాడు కదా అనుకున్నాడు గోపీ.

గోపీకి చిన్నప్పటినుంచీ చెట్లు ఎక్కడం బాగా అలవాటే. అందుచేత సునాయాసంగానే చెట్టు

ఎక్కేశాడు. గబగబా పది ఇరవై పుల్లలు విరిచాడు. ఇంతలో వెనకగా ఏదో శబ్దమైంది. గోపీ వెనక్కు తిరిగి చూశాడు. పచ్చని పసిరిక పాము ఒకటి బర్రున కొమ్మమీద నుంచి గోపీవేపుకు జారుతూంది. అంతే! గోపీ 'అమ్మో' అని ఒక్క కేక పెట్టాడు. కాలు జారి క్రింద ఉన్న మొసళ్ల మడుగులో పడిపోయాడు.

ఆ కేక విన్న తుమ్మలు నరుకుతున్నవాళ్లంతా పరుగెత్తుకుంటూ వచ్చారు. అప్పటికే గోపీ ఒకసారి మునిగి మళ్లీ పైకి తేలాడు. అందరూచూస్తూ ఒడ్డున నిలబడ్డారే గాని, మడుగులోకి దిగటానికి ఎవ్వరూ ధైర్యంచేయలేదు. మొసళ్లమడుగంటే అందరికీ భయమే. పాలేరు వెంకడు గుండెలు బాదుకొంటూ కాలుగాలినపిల్లిలాగా అటూ యిటూ తిరుగుతున్నాడు. తుమ్మలు కొట్టటానికి వచ్చిన కూలీలంతా చూస్తూ నిలబడిపోయారు నిస్సహాయంగా.

అరుపులు విని సుబ్బడుకూడ అక్కడకు వచ్చాడు. వెంటనే ఆలోచించకండా మడుగులోకి దూకేశాడు. "ఒరే, చస్తావురా. దాంట్లో మొసళ్లున్నాయిరా" అని అరిచారు కూలీలంతా. కాని అప్పటికే సుబ్బడు ఈదుకొంటూ గోపీ దగ్గరకు చేరాడు. ఒడ్డున ఉన్నవాళ్లంతా ఇద్దర్నీ ఆశ వదులుకున్నారు. సుబ్బడు అతి కష్టంమీద గోపీని ఒడ్డుకు లాక్కొచ్చాడు. గోపీకి తెలివి లేదు.

గోపీకి తెలివివచ్చేప్పటికి ఇంట్లో మంచం మీద ఉన్నాడు. చుట్టూ అమ్మ, నాన్న, సీత, అక్క, బావ, పాలేర్లు అందరూ నిలబడి ఉన్నారు. గోపీ కళ్లుతెరిచేప్పటికి అందరిప్రాణాలూ కుదుటబడ్డాయి. గోపీనాన్న సంతోషంతో "ఒరేయ్, సుబ్బన్నా, ఇటురా" అని కేకవేశారు. గోపీ ఆశ్చర్యంతో వాకిలివేపు చూశాడు. సుబ్బడు విప్పారిన ముఖంతో లోపలకు వచ్చాడు. "అడుగో నాన్నా, నీ స్నేహితుడు. నిన్ను బతికించినది వాడేరా. వాడి ఋణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేం" అన్నది గోపీ తల్లి, గోపీతల నిమురుతూ.

"వాడికున్న ధైర్యం పెద్దవాళ్లకు గూడా లేదు" అన్నాడు గోపీనాన్న సుబ్బడి వేపు ప్రేమగాచూస్తూ.

పక్కనే ఉన్న పాలేరు వెంకడు సిగ్గుతో తల వంచుకొన్నాడు.

"ఐతే మే మిద్దరం హాయిగా కలిసి తిరగొచ్చుగా?" గోపీ అనుమానంగానే అడిగాడు.

"రేపు భోగిపండుగ. సుబ్బడు మనింట్లోనే అన్నం తింటాడు. వాడికిగూడా కొత్త చొక్కా, లాగూ కుట్టిద్దాం. తరవాత ఇద్దరూ కలిసి సర్కసుకి పోదురుగాని. సరేనా ?" అన్నది వాళ్లమ్మ.

గోపీకి సంతోషం ఎక్కువై కళ్లంబడి నీళ్లు వచ్చాయి.



# "బలీయసి

ఆ ఊళ్లో ఉన్న కుటుంబా లన్నింటికన్నా శంకరయ్యకుటుంబం ఘనమైనది. మన్నన కెక్కినదిని. సంసారంలో సంతోషం జీవితంలో సంతృప్తి అనుభవిస్తున్న, శంకరయ్య ధన్యజీవిగా అభినందింపబడి స్థానికమైన పలుకుబడికూడా సంపాదించుకున్నాడు.

ఇటువంటి యోగదశలో రెండోకొడుకు సూర్యారావు బి. ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యేడని టెలిగ్రాము అందిన ఆ రోజున, పెద్ద పండుగనాడు ఎంత సందడి, ఆనందం పంచుకుని ఆంధ్రప్రజ సంతసిస్తుందో, అంతకు రెట్టింపుగా శంకరయ్యకుటుంబం పండుగ చేసుకునారు. ఇంటి ఇల్లాలు సత్తెమ్మ సరేసరి; ఇల్లిల్లా ఆవిడే. మాటమాటలోనూ నవ్వే. అన్న వాక్యమంతా హాస్యధ్వనితమే. ఆ కుటుంబీకులంతా జన్మత: కవులో పండితులో అన్నట్లున్నారు.

నిజానికి శంకరయ్య కుటుంబంలో ఎక్కువ చదువుకున్నవాళ్ళెవరూ లేరు. అందులో శంకరయ్య పూర్తిగా అసంస్కారి. పూర్వులు సంపాదించి పెట్టిన ఆస్తిని ఆసరాగాచేసుకుని, పెద్దవాడయ్యాడు. అంతమాత్రంచేత వ్యవహారజ్ఞానం లేని వెంగళాయి కాడు. బాగా చదువుకున్నా, ఆస్తిపాస్తులని భ్రష్టాకారంచేసిన మనుష్యులు ఎంతమంది లేరు! శంకరయ్య చదువుకోకపోయినా, తన ఆస్తిని వృద్ధిపరచేడనే అంటారు. అటువంటి కుటుంబంలో ఆంగ్లవిద్య నభ్యసించి ప్రథమశ్రేణిలో పట్టభద్రుడైన కొడుకు వంశానికి పేరుప్రఖ్యాతులు సమకూర్చడానికే పుట్టేడనుకున్నా రందరూ. విందులూ, వీవనలా అన్నీ సమాప్తిచేసుకుని తీరుబాటుగా వీధిఅరుగుమీద కూచుని శంకరయ్య, భార్య సత్తెమ్మ, కుమార్తె సీత, సూర్యారావు ఇంకా కావలసిన బంధువులు అందరూ కలిసి తాంబూలాలు వేసుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

వెన్నెల పుచ్చపువ్వులా విరియపూసింది. కొంచెం దూరంలో ఉన్న మర్రిచెట్టు ఇంకొకప్పుడైతే జుట్టు విరగబోసుకున్న దెయ్యంలా అగుపించేదేమోకాని, ఆ సంతోష సమయంలో నిండుమోముతో శాంతంగా కూర్చున్న మహా



# కేవలమీశ్వరాజ్ఞా"

లక్ష్మిలా అగుపించింది ఆ బృందానికి. వాళ్ళు మాట్లాడుకుంటున్న విషయాలు ఏవిధంగానైనా అతక్కపోయినా ఆనంద హృదయాల్ని స్పష్టీకరిస్తున్నాయి.

"ఏమే ! రామం ఇంకా రాలేదూ ?" అంటూ మాటల మధ్యలో శంకరయ్య భార్య నడిగేడు.

"మీరేకదండీ వాణ్ణి బంగారంపేట పంపించేరు. ఏపనికోసరం పంపించేరో అది సాధించుకునే వస్తాడుగాని ఉత్తచేతుల్తో రాడుగా" అంది సత్తెమ్మ. రామం శంకరయ్య పెద్ద కొడుకు. ఆ ఊళ్ళోనే అవకాశంఉన్న ఎనిమిదో క్లాసువరకూ చదివి, తర్వాత హైయర్ ట్రెయినింగు పేసయి తను చదువుకున్న స్కూల్లోనే మేష్టరుగా ప్రవేశించాడు. తండ్రికి సాయంగా ఉంటూ వ్యవహారాలన్నీ చూస్తూ చేతనైనంత ఓపికతోనూ, శ్రద్ధతోనూ కుటుంబానికి సహకార మిస్తాడు.

"ఆ! వాడు వెళ్ళడం సానుకూలపర్చుకుని రావడం. కల్ల ! అసమర్థుడితో పన్లు చెయ్యమని ఎవళ్ళు చెప్తారు ? నావంటి మరో అజ్ఞానికాక" అంటూ శంకరయ్య విసుక్కున్నాడు. ఇలా విసుక్కోవడం మాటమాటకీ చులకనచేస్తూ ఉండడం శంకరయ్యకలవాటే.

"మీరు మరీ అంటారండీ. ఎండనక, వాననక పనిచేసేవాణ్ణి అసమర్థుడిగానూ, ఎక్కడికీ కదలకుండా కూర్చున్న మనం పెద్ద మొనగాళ్ళం అంటూ మాట్లాడుతున్నారు. అదేదో సామెత చెప్పినట్లుంది. వడ్డించేవాడికన్నా, పురమాయించేవాడు ముందలిసిపోతాడట !" అంటూ సత్తెమ్మ రామాన్ని సమర్థిస్తూ చెప్పింది. కాని, ఆవిడ మనస్సులోనూ రామం సూర్యారావుకన్నా తెలివైనవాడు కాదు అన్న అభిప్రాయం లేకపోలేదు. తనకు ఇద్దరూ కొడుకులే. ఇద్దరినీ ఒకేలా పెంచి పెద్దచేసింది. పరిస్థితుల అనవకాశం వల్లనో, ఆ సమయానికున్న అభిప్రాయ ప్రభావంవల్లనో రామం, చదువు మానుకోవలసివచ్చి తండ్రి వ్యవహారాలు చూస్తున్నాడు. సూర్యం పైచదువులు చదువుతున్నాడు.

"సరి సర్లే, వాడిమాటలా ఉంచు" అంటూ

అక్కడే కూర్చున్న సూర్యారావుతో "ఏరా సూర్యం! ఇకముం దేం చేయతలంచుకున్నావు. నాతోకూడా కొంచెం చెప్పు నీ మనసులోని కలలు. నీ కోరికలు తీర్చడానికి నేను తూగుబడి కావాలిగా!" అంటూ శంకరయ్య అడిగేడు.

"నా ఇష్టం ఏముంది. మీ రెలా చేస్తే అలాగే."

"ఈ నంగిమాటలు మాని నీ మనసులోని అభిప్రాయాన్ని చెప్పరా. ఇప్పుడే చెప్పకుంటే తర్వాత దుఃఖపడి ప్రయోజనం లేదు."

"ఎం. ఏ. చదవాలనుంది."

"అబ్బో! ఎం. ఏ. వే. ఇప్పటికే నేను పెట్టుబడిపెట్టలేక కుటుంబ ఖర్చు భరించలేక ఈ సంసారాన్ని ఈదలేకపోతూవుంటే, ఇంకా నువ్వు పెద్దచదువులకి పోతానంటే నా శక్యమా అని."

"మరి బి. ఏ. పేసయితే ప్రయోజనం ఏం లేదు కదండీ!"

"ఎందుకు లేదూ? సుబ్బిగాడికొడుకు 'ఎప్పే' పేసయే ఇప్పుడు పెద్దహోదాలో ఉద్యోగం చెయ్యడంలేదూ? మరి నీచదువు అంతకన్నా ఎక్కువేగా?"

"చదువుకీ ఉద్యోగానికీ లంకె వెయ్యకూడదు. నాకన్న ఎక్కువ చదువుకున్నవాళ్ళు కూడా, అదృష్టం కలిసిరాక, చిన్నచిన్న ఉద్యోగాలలో పొట్ట పోషించుకొంటున్నారు నాన్నగారూ! మనకి భగవంతుడు ఆ బాధ ఇవ్వలేదుకాబట్టి, ఇంకా చదువుతానని అంటున్నాను."

"అదేమోనుస్మీ! ఈ ఇంగ్లీషు చదువుల్లో ఉన్న లోతుపాతులు నాకేం తెలుస్తాయిలే! ఇదుగో చూడూ! ఒక ముఖ్యమైన విషయం చెప్దామనుకున్నాను. ఇప్పుడు సమయం వచ్చింది. విను. నువ్వు బాగా జ్ఞానవంతుడవయ్యావు. స్వంత ఆలోచనలు, స్వతంత్రంగా బతకాలన్న కోరికలూ చదువుకొన్న నీకుకాక నాకున్నూ రామంగాడికీ ఉంటాయనుకోవడం పొరబాటు. నీ కా పై చదువులపై అభిలాష ఉంది. కాబట్టి నీ చదువుకి నే నాటంకం రాకూడదు. అది ఒక విషయం. రెండవది. నువ్వు చూస్తున్నావుగా పెద్దమనిషై నాలుగేళ్లయినా పెళ్లికాని నీ చెల్లెల్ని. దాని విషయంలో నే పడుతూన్న బాధ నీకు తెలియదనికాదు. కాని, అన్ని విషయాలూ స్పష్టంగా అనుకున్నప్పుడు, దాని పెళ్లివిషయం కూడా చాలా ముఖ్యం అని అనాలికదా! తండ్రినైన నాబాధ్యత తీర్చాలికదూ! అంచేత, ఇవన్నీ ఆలోచించి ముందూ వెనకా జాగ్రత్తగా పరిశీలించి, నే నొక నిశ్చయాని కొచ్చేను" అని శంకరయ్య తన ఉపన్యాసధోరణికి కొంత విశ్రాంతి నిచ్చేడు.

వీధిలో వ్యవహారం చూసుకుని రామం ఇల్లు చేరుకున్నా డదేసమయంలో. తాత్కాలికంగా తన సంభాషణకు విరామం ఇచ్చిన శంకరయ్య రామాన్ని చూసి, "ఏం రా! రామం! ఇంత రాత్రయిందేం రావడం?" అనడిగేడు. అలసినట్లున్నాడు రామం. సమాధానం చెప్ప వీలుచేసుకోవడానికని ఒక నిట్టూర్పుతీసి "పని తెముల్చుకుని బయలుదెరే టప్పటికి మనూరు బస్సులన్నీ వచ్చేసేయి. మరి గత్యంతరంలేక నడుచుకొని వొచ్చేను" అన్నాడు రామం.

"ఏమయిందయితే వ్యవహారం!"

"అయిందీ అని చెప్పలేను. అవలేదూ అని చెప్పలేను. ఇవ్వవలసిన ఐదువందల చిల్లర అసలు మొత్తానికి వందన్నర నగదిచ్చి బాకీ రెండు మాసములతర్వాత ఇస్తానని ముక్క రాసిచ్చేడు. ఇదుగో ఆ సొమ్ము, ఆ నోటు" అంటూ ఆఫీసరుముందు పెద్ద గుమాస్తా వల్లెవేసినట్లు విషయం సంగ్రహంగా చెప్పేడు.

"పని పొంతం పూర్తిచేసుకుని రాలేకపోయావా. మిగిలినసొమ్ము కూడా యిస్తేనేగాని కదలనని భీష్మించుకుని కూర్చోవలసింది. ఏమిటో అప్రయోజకుడి వయ్యావు నువ్వు."

"లేదు మొర్రోమని వాడు ఏడుస్తూ ఉంటే, అక్కడ భీష్మించుకు కూర్చుంటే లాభం ఏమిటి?"

"ఇక్క డేం లాభాలు ముంచుకు పోతున్నాయని కొట్టుకొచ్చేవు."

"రాత్రయిపోయిందని."

"రాత్రయిపోయింది! రాత్రి! కొర్నాకూచుని తినేవాళ్లకు ఇంటి వ్యవహారాలు కొంచెం చూడమని చెప్తే తప్పుకాదూ!"

"తప్పూ, రైటూ అని కాదు. రాత్రయింది. ఇంటికొచ్చేను."

"మళ్లా అదే అంటాడు" అని తనలోతాను "అప్రయోజకపు వెధవ!" అని గొణుక్కున్నాడు.

రామం మనస్సు చాల గాయపడింది. ఏదో ఒంటరిగా ఉన్నప్పుడు చీవాట్లుపెడితే సహించేవాడు. అందరూ అరుగుమీద ఉండగా, తన్నొకణ్ణే వేలుపెట్టి నిందించడం, శ్రమపడినా ఫలితం దక్కకపోవడం, ఈ రెండు బాధలవలన, కళ్లలో నీళ్లు తిరిగేయేమో అనికూడ భావించాలి. 'ఈ మాటల కేమిటి లోపల కెళ్లి భోంచెయ్యి' అండానికి కూడ ఎవ్వరికీ స్ఫురించలేదు. ఆ వాతావరణం అటువంటిది. సత్తెమ్మ అక్కడే ఉన్నా, ఆదేంకర్మమో ఉపేక్షగా ఊరుకుంది. బహుశా సూర్యారావు పట్టభద్రుడవడంవలన కలిగిన ఆనందం, కష్టజీవులనీ, శ్రమజీవులనీ తలంచడానికి తావిచ్చింది కాదు కాబోలు. అలాంటప్పుడు అసలే చిన్నచూపులో ఇరుక్కున్న రామాన్ని తలంచ గల్గిందెవరు. ఇంట్లోకెళ్లడానికి రామం కదిలేడు. అప్పటికి చెప్పింది సత్తెమ్మ, భోంచేసిం తర్వాత మాట్లాడుకోవచ్చని. ఈలోగా రామం వెళ్లిపోవడాన్ని, ఆమెమాటలు గాలిలో కలిసిపోయాయి.

శంకరయ్య పేలవంగా నవ్వుతూ సూర్యారావు వైపు దృష్టిసారించేడు.

"మధ్యలో మాట ఆగిపోయాయి. ఇటు వినురా సూర్యం! విన్నతర్వాత జాగ్రత్తగా ఆలోచించుకొని నీ నిశ్చయం చెప్పు" అంటూ ఉపోద్ఘాతంగానే ఇంకా సాగదీస్తున్న రాగాల్లాగ చెప్తున్నాడు. ఇటూ అటూ తేల్చకుండా మాట్లాడడం శంకరయ్యకలవాటే, అయినా, ఏం చెప్తాడో అన్న కుతూహలం సూర్యాన్ని కలవరపెట్ట సాగింది.

"మన వెంకటశాస్త్రిలేడూ! ఎప్పొకేటు. ఆయన తనకూతురిని నీకిచ్చి సమస్తమైన లాంఛనాలూ, మర్యాదలూ జరిపించి పెద్ద హోదాలో పెళ్లిచేస్తానని కబురుపెట్టేడు. నువ్వాసంబంధానికి అంగీకరిస్తే నీ పెద్దచదువుకి కావలసిన డబ్బూ వస్తుంది. నీ చెల్లెలు పెళ్లికి కావలసిన పెట్టుబడీ వస్తుంది. లేదు కాదన్నావూ, నీ చదువు సాగడం కష్టం. అంటూ ముగించేడు.

సూర్యారావుకి నెత్తి విరిగినంతపనైంది. పైచదువూ, చెల్లెలిపెండ్లీ, తన వివాహంతో ముడి కట్టబడినవని తెలుసుకుని చాల మధనపడ్డాడు. ఒకప్పుడు కన్యాశుల్కంతో కొడుకు పెండ్లి జరిపించిన తండ్రులుంటే, ఇప్పుడు వరకట్నంపేరిట డబ్బు గుంజి, కావలసిన స్వార్థాలు తీర్చుకుంటారన్నమాట, అని విచారించేడు. ఆశయాలూ, ఆదర్శాలూ శంకరయ్యదృష్టిలో చేతకానివాడి మాటలు. అతనిదృష్టిలో ధనసంపాదనకై చేయవలసిన ఏపనైనా సరే, వ్యవహారం క్రిందనే లెక్క. మొహమాటంలేనిమనిషి. తన చదువు బి. ఏ. వరకూ సాగేటట్టు చెయ్యడం కూడా ఒక వ్యాపారలక్షణమే నన్నమాట. ఇంతకూ శంకరయ్య సూర్యం విషయంలో ఏమాత్రం ఖర్చుచేసేడు. చేదోడుకు వాతోడు అన్నట్టు రామం ప్రతినెలా పంపే సొమ్ము

హీనంగా చూస్తే సహించలేక పెద్ద కొడుకు రామం, కేవలం డబ్బు కక్కుర్తితో కామేశ్వరికి ద్రోహం చేయలేక రెండోవాడు సూర్యారావు ఇల్లువిడిచి పోయారు. కూతురు సీత అనాకారి కావడంచేత పెళ్ళాడడానికి ఎవరూ ఒప్పుకోలేదు. భార్య సత్తెమ్మ కొడుకులమీద బెంగతో మంచమెక్కింది.

శంకరయ్య చచ్చిన పాము. ఇంకా ఏమిచేద్దామని వచ్చాడు నరసింహం?

కాని చివరకు జరిగిం దేమిటి?

బలీయసీ కేవలమీశ్వరేచ్ఛా...

కాక అప్పుడప్పుడు పంపించే పదీ పాతికే కదూ. న్యాయవాలోచిస్తే రామంవే సూర్యం చదువుకై సహాయం చేస్తూన్నది. జీతం అందగానే ప్రతీనెలా పంపడం, తన ఖర్చులకోసరం తండ్రి మీద ఆధారపడడం—అదీ రామంపని. సూర్యారావుకి జాలివేసింది తన అన్నయ్యని తలంచుకున్నకొలదీ. ఆ మాటే అంటే శంకరయ్య మండిపడతాడు. శంకరయ్యే డబ్బు పంపవలసి వస్తే తన చదువు సాగేదేనా ? ఇప్పుడు మరొక లంకె. ఏమిటంటే వెంకటశాస్త్రి కూతురిని పెండ్లాడి ఆ కట్నపుధనంతో తన చదువూ చెల్లెలు పెళ్ళీ కూడా కానివ్వడం. తాను కామేశ్వరికి మాటిచ్చేడే. నిలువెత్తు ధనంపోసినా ఆసంబంధ చేసుకుంటాడా ?

ఆలోచనలు ఉప్పెనలాగ మనసులో అట్టు మిట్టాడుతూ ఉండడంవలన ఏసమాధానం చెప్ప లేక పోయాడు. అనుక్షణం కామేశ్వరి జ్ఞాపకం వస్తోంది. 'నన్ను మోసగించుతావా' అన్నట్లు చిన్న పుచ్చుకున్న ముఖంతో ఎదురుగా నిలుస్తోంది. 'తల్లితోనైనా చెప్పి మనస్సు మార్చలేనా' అన్న ఆశ ఒకవంక లాగుతూ ఉంటే, నిష్కర్ష మనిషి తండ్రి అన్న నిర్ధారణ మరో వంక బాధిస్తోంది.

అటు రామం పరిస్థితులు కూడ అసంతృప్తికరంగానే ఉన్నాయి. ఇంట్లోకి వెళ్తూనే భార్యను పిల్చేడు రామం. జవాబుగా ఒక సన్నని గొంతుక ఆవులసాలలోంచి వినపడింది. అసలే గోరుచుట్టు దానిమీద రోకటిపోటు !

"అంట్లేమిటే తోముతున్నావు" అంటూ ఆవులసాలవేపు వెళ్ళేడు. మినుకుమినుకు మంటూన్న ఒక బుడ్డిదీపంముందు బురదలో పీటవేసుకుని గిన్నెలు తోముతూంది రామం భార్య. ఆదృశ్యం చూస్తూ నోట మాటరాక అలానే నిల్చుండిపోయాడు. ఆమె కాపని తప్పని సరిగా రోజూ ఉన్నదే. ఆ విషయం తనకీ తెలుసు. కాని ఆవేళమాత్రం చాల దుఃఖితుడయ్యాడు. "అమ్మ ముసిపోయింది. చెయ్యలేదు కాని, సీతేనా సాయంచెయ్యకూడదా" అనుకున్నాడు మనస్సులో.

"అదేమిటండీ అలా నిలపడిపోయేరు. లోపలికి పదండి. ఇప్పటికే చాల రాత్రయిందని, ఏపని తెమిలినా అయినట్లే అని గిన్నెలు రాసేస్తున్నాను. తినకున్న పని తినకున్నా తప్పదుకదూ" అంటూ, నూతిదగ్గర కాళ్ళూ చేతులూ కడుక్కుంది.

"నువ్వుకూడా ఇంకా తినలేదా ?"

"మీరు రానిదీ ఎలా తినేస్తాను. కొత్తగా అడుగుతున్నారే."

"ఏం లేదులే. పద." ఇద్దరూ ఒకరి వెనుక ఒకరు నిశ్శబ్దంగా నడుచుకుంటూ వంట ఇంట్లోకి భోజనాలనిమిత్తం వెళ్ళేరు. భోంచేస్తూ రామంవే అడిగేడు. "మన వాటం ఏం బాగు లేదు కదూ" అని.

"బాగులేకేం. అంచక్కా ఉంది. అయినా, బాగో, వోగో మీకు తెలియాలిగాని, నాకేం తెలుస్తుంది."

"పేటనుంచొచ్చి ఇంకా గుమ్మంలో అడుగు పెట్టేనో లేదో అప్పుడే చివాట్లు మొదలెట్టేడు మానాన్న. ఒంటరిగా ఉన్నప్పుడో, మనం మాత్రమే ఉన్న సమయంలోనైనా, మాట అంటే నా కాట్టే బాధ అనిపించదు. మానాన్న కలవాటే. కాని, గుమ్మంలో అందరూ కూర్చున్నారు. రాయుడుగారూ, నర్సత్త, లింగమొదినా వాళ్ల పిల్లలూ-అంతమందిలోనూ నిలపెట్టి,తిట్టేడు మా నాన్న." అంటూ కంట నీరు పెట్టుకున్నాడు. తన బతుకే అంత. ఇంక విచారించి ఏం లాభం. "నాకు చాకిరీ తప్పదు. ఈ దీవనలూ తప్పవు."

"పోనిస్తురూ. భోంచేస్తూ ఎందు కలా విచారిస్తారు."

"నా గతి ఇలా కడుక్కుపోతూఉంటే, నీ బతుకూ అలానే ఉంది. నువ్వు జీతం నాతం ఇవ్వక్కర్లేని పనిమనిషివి."

"మనతీరే అంతైనప్పుడు, ఒకర్ననుకుని ప్రయోజనం ఏమిటి."

"అంటే నేనొక చదువులేని చవటననా నీ అభిప్రాయం."

"మిమ్మల్ని కాదండీ. మన ఇంటి తీరు గురించి."

"అందుకే ఎన్నాళ్లిలా ఏడవడం ?"

"లేకుంటే మరేంచేస్తాం. మన కాళ్లలో శక్తిలేక ఇంకొకరిమీద ఆధారపడ్డప్పుడు, సహించుకోవాలి."

"నాకుమాత్రం వేరుపడి, ఇంకొక ఊళ్లో ఉద్యోగం చెయ్యాలనుంది."

"ఆవేశంలో తొందరగా మాట్లాడేస్తున్నారు. ఇన్నాళ్లాయి ఓర్చింది ఇప్పుడేమిటి కష్టం అనిపిస్తోంది. వేరుపడ్డం అంటే ఎంత అప్రతిష్ఠ !"

"నా మనస్సు ఇవాళ ఎందుకో పరితాపంతో కుళ్లిపోతున్నది."

"ఏం ! మీ తమ్ముడు పేసయ్యాడనా !"

"ఆఁ! పేసయ్యాడా. నాకు తెలిసే తెలీదే !!"

"ఫస్టుక్లాసులో. అందుకే అందరూ వీధి గుమ్మంలో కూచుని ....."

"పొంగిపోతున్నారు. నువ్విక్కడ దిక్కులేని దానిలా, అంట్లు తోముతూ మురిగిపోతున్నావు ... హుఁ! నాతో చెప్తే ఏడుస్తానని భయపడి పోయారు కాబోలు."

"ఇవాళ సందడికి మరిదే నాయకుడు. ఈ లడ్డూలు వేసుకొండి. మధ్యాహ్నం చద్ది (పులిహోర—శ్రీకాకుళం) పరవాన్నం కూడా చేసేం."

"అంటే ఇవాళ పండుగ చేసుకున్నారన్నమాట."

"మీ కోసరమా ఏమిటి ?"

"నా గురించి ఇంత ఖర్చే. మొన్న వంకాయ తగువుతో మన ఇంటివిషయాలు వీధివీధల్లా తెలిసిపోయాయి."

"ఎందుకాగొడ విప్పుడు. అలాంటి తగువులు ఇప్పటికి లక్ష అయ్యాయి. మొన్నటి తగువు మొదటిదా ఏమిటి ? ప్రతిరోజూ తెల్లారితే ఉన్న భాగోతమే కదూ."

"అవుననుకో. మరోసారి మననంచేసుకుందా వేంవిటి. సరదాకే అనుకో."

రామం భార్య నవ్వింది. రామంకూడా నవ్వుకున్నాడు.

"మా నాన్నేమో ఇంటికి యజమాని. అంచేత పూర్తిగా వంకాయ అతనికి. సూర్యం పెద్ద చదువువాడు. రాకరాక సెలవులకి ఇంటి కొస్తాడు అందువల్ల వాడికి మూడు పెడలు. మిగిలిన తనసంతు తిండానికున్నవాళ్లు. వాళ్లకి అర్ధ వంకాయ. ఇది "మెంతి వంకాయ ఉపాఖ్యానం" అంటారు.

రామం భార్య నవ్వునాపుకోవడానికి ప్రయత్నం చేస్తూ "మరి నాకో" అంది.

"నీకా, నే నొదిలేసిన ఎంగిలిముక్కలు" నవ్వుకున్నా రిద్దరూ. నిక్రష్టంలో సంతోషం, గత్యంతరంలేని [illegible]తం.

"సోగిస్తే ఎందు కీరభస."

"అలా ... మెత్తగా ఉండబట్టే మన

# "బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

బతు కిలా ఉండే వెర్రిమొద్దా. ఒక్కసారి తిరగబడు, నీ పరిస్థితు లెలా మారుతాయో తెలుసుకుందువుగాని."

"అవన్నీ మన ఊహలు. మనలాంటివాళ్లం తిరగపడితే, మనతిండిని మనకాళ్లతో తన్నుకున్నవాళ్ల మవుతాము."

"నీతో మాటలేంవిటి పోనిస్తూ. నిష్ప్రయోజనం"

"పోన్లెండి. అయితే, ఇంతకీ రెండు వెయ్యమంటారా, ఒకటా."

"ఏమిటీ పిడాట్లా"

"కాదండీ లడ్డూలు."

"నా కక్కర్లేదులెస్తూ. చద్ది కొంచెం ఉంటే వెయ్యి."

"ఇంకెక్కడిదీ. మధ్యాహ్నానికే చాలలేదు."

"కొంచెం ఉంచలేకపోయావా ? నా కిష్ట మని తెలుసుగదా."

"అంతా కొలతప్రకారం జరగాలి. నేనేం చెయ్యగలను."

"బాగుందికదూ మన అవస్థ. దైన్యం అంటే ఇంకేమిటో నాకు తెలీదు. మొన్న సూర్యానికని అదేదో—దానిపేరు జ్ఞాపకం రావడంలేదు— ఆ! అది. ట్వీడు. ట్వీడుట ! మా చక్కని పేంటు గుడ్డలే ! ఆ గుడ్డ కొంటూంటే, నాక కూడా ఒక జరీఅంచు పంచ కొనమన్నాను. కొననే లేదు సరికదా, 'వాడు చదువుకున్నవాడు, పట్నంలో ఉంటున్నాడు. వాడి కివన్నీ కావాలి గానీ, కూపస్థమండూకంలా ఈ పల్లెటూరి బురదలో దొర్లే నీ కెందుకూ' అంటూ ముదరగించేడు మా నాన్న. ఇంక తిండి విషయంలోనా అది

...లం చెయ్యక్కర్లేదు. రోజూ జరుగుతున్న భాగోతం ...స్తే తెలుస్తూనే ఉంది. తిండి, బట్టకీ, వాచిపోతూ ఉండడమే కాబోలు నా బ్రతుక్కి అర్థం" అంటూ వాపోయాడు.

"మధ్యాహ్నం తినకుండా నావంతు చద్ది ఉంచేను, మీరు తింటారుకదా అని" అంటూ చిన్న దొప్పలోంచి కంచంలో వేసింది.

"నాకు చద్దీ అక్కర్లేదు. వల్లకాడూ అక్కర్లేదు" అంటూ కంచం ముందు నుంచి లేచి పోయేడు రామం. తిండి సహించకే లేచిపోయేడో, మనస్సు పరిపరివిధాల శోకించడాన్ని ఆ ఉద్వేగం సహించలేకే లేచిపోయేడో కాని వెళ్తూ వెళ్తూ "ఇవ్వాళే ఏదో తేల్చెయ్యాలి" అన్న మాటలు తన భార్య విని నివ్వెరపోయింది.

వీధి అరుగుమీద ఇంకా బాతాఖానీ జరుగుతున్నాది. రామం అరుగుమీద కూర్చుంటూ "ఏంరా! సూర్యం! పరీక్ష పేసయ్యావుట కదూ!" ఫస్టుక్లాసు అన్న విశేషణం కావాలనే అన్లేదు.

"అవునన్నయ్యా! ఫస్టుక్లాసులో పేసెయ్యేను. మరి—నాన్నేమో ...." అంటూ అప్పటివరకూ జరిగిన సమాలోచనా సారాంశం చెప్పబోయేడు.

"నాతో చెప్పలేదేంరా! ఏనాడాయొచ్చేను."

"జ్ఞాపకం లేదన్నయ్యా" అంటూ క్షమించమన్నట్టన్నాడు. ఇంతలోనే శంకరయ్య వీ రిద్దరి సంభాషణ మధ్య చొరుకుని,

"ఏం నీతో చెప్పకపోతే. ఏమేనా మించిపోతుందా" అన్నాడు. రామం వెంటనే సమాధానం ఇవ్వలేదు. శంకరయ్య నోటంట వచ్చిన ఈ దురుసుమాట, అక్కడి వాతావరణానికి నిశ్శబ్దాన్నిచ్చింది.

"మీరు ఎన్ని మాటలతో నన్ను నా మనసుని పొడిచినా తృప్తి కలగనట్టుంది. ఇంక నే నీ నిందలు, అవమానాలు భరించలేను. నేనో నిశ్చయాని కొచ్చేను. ఆ నిర్ణయాన్ని ఆచరణలో పెట్టడానికి రెండు రోజులే అవకాశం" చాలా మెల్లిగానూ, దృఢంగానూ అన్నాడు రామం. ఈ మాటలు రామం నోటంటే వస్తున్నాయా అని అందరికీ ఆశ్చర్యం వేసింది.

రామాన్ని 'మేదకుడు' అనే భావించేరు గాని నిశ్చయాలు, మనోభావాలు ఉంటాయని నెవ్వరూ భావించలేదు. ముఖ్యంగా సూర్యారావుకే ఆశ్చర్యం వేసింది. అన్నయ్యమాటలు హాస్యమో, ఏమో అనుకున్నాడు.

"అదేమి టన్నయ్యా అల్టిమేటమిచ్చినట్టు మాట్లాడేస్తున్నావు" రామానికి చాలా కోపం వచ్చింది."

"నువ్వంటున్న పెడసరపు ఇంగిలిపీచు మాటలకి అర్థం నాకు బోధపడదు. నా మనసులో సంఘర్షణ టూకీగా చిన్న మాటల్లో చెప్తాను విను. నాకు జ్ఞానం వచ్చిననాటినుండీ ఈవరకూ ఏవిధంగా తలిదండ్రుల ఉపకారాన్ని పొందిఉన్నానో నాకు తెలీదు. పుట్టిన వెంటనే చంపేయకుండా పెంచడమే ఒక ఉపకారమైతే అది మహాబాగు. చదువూ, చట్టుబండలూ లేని నాకు, తిండికీ, గుడ్డకీ వాచిపోతున్న నాకు, జీతం నాతం అక్కరలేని కంబారిలా బతుకుతున్న నాకు, అసంతృప్తి, ఆవేదన ఎక్కువై పోతున్నాయి. అందుచేత, ఈ బ్రతుక్కింక స్వస్తి చెప్పి, ఇంకోతోవన పోదలంచుకున్నాను."

రామం మాటలు విని శంకరయ్య చప్పట్లు కొట్టేడు. "భేషుగ్గా ఉపన్యాసం ఇచ్చేవురా రామం. చాల దిట్టంగానే ట్రెయినింగు సంపాదించేవు."

"నాకు ట్రెయినింగు ఎవరిస్తారు నాన్నా. ఇస్తే మీ కోడలే ఇవ్వాలి. మీరు నవ్వే కాకుండా ఇంకొక తల్లికడుపున పుట్టిన ఆడపిల్లని కూడా ఆడిపోసుకుంటున్నారు" అన్నాడు రామం.

"అధికంగా పేలకురా వాజమ్మా! పోరు నష్టమూ పొందు లాభమూ అన్నారు పూర్వులు. నీ పోరు నిన్నే కొడుతుంది. ఏ నిర్ణయాలు చేసుకున్నారో ఏడవండి" అంటూ, శంకరయ్య విసురుగా లేచి తన గదిలోకి పోయి విరిగిపోతుందా అన్న చప్పుడుచేస్తూ తలుపేసుకున్నాడు.

అంత సంతోష వాతావరణం క్షణంలో విషాద కోపాలతో నిండిపోయింది. అందరూ ఒకరొకరే అరుగుమీద నుండి లేచిపోయేరు. పగలల్లా ఆనందంతో హాయి ననుభవించడాన్నేమో సత్తెమ్మ నేలమీదే నిద్రపోయింది. సీత మాత్రం వెళ్లలేదు.

"అన్నయ్యా!" చాల మెల్లిగాను, ఆప్యాయంగానూ పిల్చింది. రామం పలకలేదు.

"అన్నయ్యా! ఎందుకంత కోపం నీకు?"

"నీకు తెలీదు సీతా నేను పడుతూన్న ఆవేదన. నా మనస్సెప్పుడూ పరితపించి పోతూంది. ఒకసారి ఈ వేదన మురికిగుంటలోంచి బయటపడి స్వేచ్ఛగా ఉండాలనిపిస్తుంది. మరోసారి నా ఆలోచనలు పితృద్రోహమా అనిపిస్తుంది. సూర్యం చదువు ఒక విధంగా మెరుగునపడింది, కనుక నీ పెళ్లికూడా జరిగితే ఎంతో బాగుండును అని ఆలోచిస్తాను. మరుక్షణంలోనే వీళ్ల అవసరాలు తీర్చడానికే నా బ్రతుకంతా అని వాపోతాను. నాన్న ఇనప్పెట్లో మూట కదల్చడు. ఈ రోజుల్లో కట్న, కానుకలు నిలువెత్తున పోసినా, స్ఫురద్రూపం కలిగిన ఆడపిల్లల పెళ్లిళ్లే కావడంలేదు. మనలాంటి సాంసారికపు పిల్లల కెలా అవుతుంది. నీమీద దేముడికి కూడా కోపం వచ్చినట్లుంది" అన్నాడు రామం. సీత వెంటనే సమాధానం ఇవ్వలేదు.

"అది నిజమే నన్నయ్యా. నువ్వు డబ్బు పంపబట్టే చిన్నన్నయ్య చదువు ఇంతవరకేనా వచ్చింది" అని ఇంకా ఏమో చెప్పబోయి వూరుకుంది సీత.

"ఏం చెప్పు. ఏదో ఇంకా అందామనుకుని మానేసేవు. సూర్యానికి పంపకుండా నీ కోసం కూడబెట్టమనా? అదెలా అవుతుంది సీతా! నాన్చెప్పు కోడుగా."

"నాకూ తెలుసు. నే నీ అనాకారి జన్మ ఎత్తడాన్ని కదా, దేముడికీ, నాన్నకీ కూడా బరువై పోయాను" అంటూ ఏడవడం మొదలుపెట్టింది. రామం ఆమెను ఓదారుస్తూ, ఇంట్లోకి తీసుకుపోయేడు. సత్తెమ్మ అలా అరుగుమీదే ఒట్టి నేలని పడుకుంది ఆ రాత్రల్లా. రామం అసంతృప్తి గాని, శంకరయ్య కోపంగాని, సూర్యారావు సమస్య

## "బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

గాని, ఆఖరుకి సీత పడ్డ ఆవేదనగాని, ఆమెను సుషుప్త్యవస్థలో అంటలేకపోయాయి.

## 2

శంకరయ్య, పాపయ్య బంధువులూ స్నేహితులూను. పాపయ్య సత్తెమ్మకి ఏదో వరసని అన్నయ్య అవుతాడు. ప్లీడరుగుమాస్తాగా పనిచేసి, కొంత వెనకవేసుకున్న పాపయ్య అరవై ఏళ్ళు పైబడ్డా యని తన గుమాస్తావృత్తికి స్వస్తిచెప్పి కొడుకు నర్సింహానికి సంసారపు బాధ్యత వదలి సుఖంగా వృద్ధాప్యం గడుపుతున్నాడు. సంతతి కోసం తపించితపించి నర్సింహాన్ని నడి వయసులో కన్నాడు పాపయ్య. మరి నాలుగు సంవత్సరాలకే కామేశ్వరి పుట్టింది. ఆ తర్వాత పాపయ్య అర్జనాపరుడై, బాగానే సంపాదించేడు. కామేశ్వరి ఎప్పటికేనా పరాయివాళ్ళయింటికి వెళ్ళ వలసినదే. అంచేత పాపయ్య తనలో తాను నిర్ణ యించుకున్నాడు కామేశ్వరిపెళ్లి వైభవంగా చేయాలని.

అదేసమయంలో తనకి బంధువూ స్నేహితుడూ అయిన శంకరయ్య కూతురు సీతని నర్సింహాని కిచ్చి వివాహం చేయాలనుకుంటున్నా డని సూచావాచా చెప్పేడు. ఈ సంబంధం పాపయ్య కిష్టమే అయినా పాపయ్య భార్య, తన కొడుకు నర్సింహం ఇద్దరూ 'ససేమిరా' వద్దన్నారు. గౌరవానికి భంగం రాకుండా, స్నేహం చెడకుండా ఉండేటట్లు పాపయ్య "కామేశ్వరికి సంబంధాలు ముందు వెతుకుతున్నాను. దాని పెళ్లి అయాక నర్సింహంపెళ్లికి యత్నాలు చేయాలనుకుంటున్నాను" అని నచ్చ చెప్పడానికి ప్రయత్నించాడు.

శంకరయ్య పాపయ్య కన్న ఆస్తిపరుడు. అంచేత శంకరయ్యకి తనుకాక ఎదుటవారిని లోకువగా చూడడం అన్న స్వభావం కలవాడవటాన్ని, కొంచెం చులకన పాపయ్యంటే. ఏదేనా మిష దొరుకుతుందా తన ఆధిక్యత ప్రదర్శించడానికి, అని ఎదురుచూస్తున్న శంకరయ్య "నీకు ఈసంబంధం నచ్చలేదని చెప్పకూడదుటోయ్ !" అని పెడుసుగా సమాధాన మిచ్చేడు. అదిమొదలు శంకరయ్య పాపయ్య శత్రువుల క్రింద మారిపోయారు.

'కుటుంబ గౌరవం వీధినపెడితే లొంగ కేమవుతాడు' అని దురభిప్రాయపడ్డ శంకరయ్య 'ఏం జూసుకుని విరగబడుతున్నాడో ప్లీడరు గుమస్తా పాపయ్య వాడి కొడుకు 'దేబెయ్యా'' అని అడిగిన వాళ్ళకీ అడగని వాళ్ళకి చెప్పి, చెప్పించి, ఆ చిన్న ఊళ్లోనే అందరినోటా నర్సింహానికి బదులు 'దేబెయ్య' అన్న పేరు వాడుకలోపడేవరకూ పాటుపడ్డాడు. పాపయ్య సాత్వికుడు. ఆగ్రహం లేనివాడు. అదీకాక, ఆడపిల్ల తండ్రి. తన సోమత

తాను గ్రహించుకుని, ఆవేశపడడంవల్ల, కామేశ్వరికి వివాహం అవకుండా రసాభాస అవుతుందన్న భయంవలన, శంకరయ్యని ఏమీ అన్లేదు. కాని నర్సింహం ఆ నిశ్శబ్దాన్ని ఛేదించాడు.

"కనురెప్పలులేని ఆ కురూపి సీతని పెళ్ళాడిన వాడు, కళ్ళున్నా లేనివాడై యుండాలి. దాన్ని పెళ్ళాడేకన్నా, కన్నూ, ముక్కూ తీరుగా ఉన్న రాతిబొమ్మని పెళ్లిచేసుకుంటే నయం" అని ప్రతి ప్రచారం సాగించేడు. దీంతో శంకరయ్య అహం పెరిగింది. ప్రతీకారవాంఛ ఇనుమడించింది.

నర్సింహం చేస్తూన్న దుష్ప్రచారం మంచిది కాదని, అతని చెల్లెలు కామేశ్వరికి కూడా వివాహం కావాలికాబట్టి ఆడపిల్లలు ఇంట్లో ఉన్నప్పుడు అంత హద్దుమీరి ప్రవర్తించడం మంచిదికాదని, రెండు కుటుంబాలూ స్నేహితంగా ఉండడం ఎంతో లాభదాయకమని బోధించే ఉద్దేశంతో ఒకనాడు సూర్యారావు పనికట్టుకుని పాపయ్య ఇంటి కెళ్ళేడు. వీధి గుమ్మంలో కూర్చుని కామేశ్వరి ఏదో అల్లిక చేస్తూన్నట్టుంది. తలంటు పోసుకోవడాన్ని తేలికైన ఆమె ముంగురులు ఫాలం మీద పడుతూ ముచ్చటగొల్పుతున్నాయి. సన్నని నడుముని చుట్టి, ఉబికీ ఉబకని ఆమె వక్షోజాల్ని పాదుని చుట్టుకున్న తీవలా పెన వేసుకుని బుజంమీదినుండి నిశ్చింతగా వాలిన ఆమె పైట చెరగుని చూసి, సూర్యారావు రెండుక్షణాలు స్తబ్దంగా నిల్చుండిపోయాడు. తన మనస్సే శంకించినట్లనిపించింది. తన ఆశ్చర్యసంభ్రమాలు కామేశ్వరిని చూసినందువల్లనా లేక ఆమె పైటచెరగు వల్లనా ? అని. కాని సున్నితమైన, సుందరమైన భావనాపరంపరలో తేలియాడుతున్నవాడైనందున, మెదడుని, రాయబారానికి పంపి, మనసుకి నచ్చచెప్పేడు; "మానవత్వంకలిగిన నేను, ఆ జీవంలేని పైట చెరగు పెనవేసుకుని ఉండడం చూసి, ఓర్వలేక, నా కా అదృష్టం పట్టలేదే అని ఆశ్చర్యం కల్గడాన్ని అలా నిల్చుండిపోయాను. అందువల్ల నా తప్పేంలేదు" అని.

సూర్యారావుని చూసి, కామేశ్వరి లేచింది. మర్యాదగా "రా ! సూర్యం!" అంటూ చాపమీద కూర్చోబెట్టింది. పెరట్లో మాట్లాడుతున్న వాళ్ళ అమ్మని పిల్చింది. ముగ్గురూ కలిసి కాలక్షేపప్రసంగం, యోగక్షేమాలు మాట్లాడిన తర్వాత "ఒస్తానని' చెప్పి సూర్యారా వివతల పడ్డాడు. ఏ పని నెరవేర్చడానికి వెళ్ళేడో అది మరచి మరో క్రొత్త తీయనిబాధని కోరి తెచ్చుకున్నాడు. ఎప్పుడు తలంపులోనైనా మసలని కామేశ్వరి గడియగడియకీ జ్ఞాపకం వస్తోంది. నిందాపూరితంగా తన సోదరివిషయంలో దుష్ప్రచారం చేసిన నర్సింహం చెల్లెలు కామేశ్వరి, ఆమెనా తాను ప్రేమిస్తున్నది. 'ఛీ' అని తృణీకరించాలనుకున్నాడు. కాని మనస్సొప్పలేదు. కాలేజీ వాతావరణం అక్కడి కలాపాలు సంఘటనలు అన్నీ తలంపులోకొచ్చి మనస్సును వేధించసాగాయి. సంస్కారం ఉన్న తనుకూడా




-చిత్రకారుడు : ఎం. ప్రసాదరెడ్డి (కడపజిల్లా)

ఉన్నదున్నట్లు ఒప్పుకోక నిజస్వరూపాన్ని మరుగు చేసి పైకి బడాయిగా తిరగడం తన అంతరాత్మనీ వ్యక్తిత్వాన్నీ మోసపుచ్చడమే అనిపించింది.

"వాస్తవానికి సీత—కామేశ్వరి ఇద్దరినీ సరిపోలుస్తే, అనకూడదుకాని హస్తిమశకాంతరం తేడా ఉంది. కామేశ్వరి సుందరి. సీత కాదు. కామేశ్వరి శ్రావ్యమాధుర్యాలు నిండేటట్లు పాడగలదు. సీత నోరే మెదపదు. కామేశ్వరి మేలి పసిమి శరీరచ్ఛాయతో మెరిసిపోతుంది. సీతనల్లని దేహంతో అనాకర్షణీయంగా ఉంటుంది. అశాశ్వతమైన రూపమా ప్రధానం ప్రేమించడానికి పెళ్ళాడడానికిన్ని. ఔను" అని మనసుకి సమాధానం చెప్పుకున్నాడు. పెళ్లిచూపులంటే మరేమిటి ? వివాహము చేసుకొనబోయే కన్య రూపసి అవునా కాదా అనే కదూ ! మనసు మంచిదవునా కాదా అని చూసినంతమాత్రాన గ్రహించగల గొప్పవాళ్ళు పెళ్లికొడుకులుగా పుట్టలేదు" అనుకున్నాడు.

సూర్యారావుకి ఆలోచిస్తున్నకొలదీ నర్సింహంలో తప్పులేదనిపించింది. కామేశ్వరి స్థానంలో సీతే ఉంటే, ఆమెకోసం ఈవిధంగా పరిత ...వేవాడా ? అటువంటిది నర్సింహం సీతని పెళ్లిచేసుక్లో ...స్తే ఎందుకో తనకు కోపం ... న్యాయమో, అన్యాయమో సూర్యార... ని పెళ్లి చేసుకోవడానికి కృతనిశ్చ... . కామేశ్వరియొక్క తలిదండ్రుల ...కూడా అంగీకార సూచితంగ... . కామేశ్వరిని కూడ వీలు చ... ఆమె మనస్సులో ఏముందో ...ను గాని, ఆమె

తలిదండ్రుల చాటుబిడ్డ. ఏం చెప్పగల్గుతుంది. అయినా ఆమోదచిహ్నంగా పదేపదే సూర్యారావు కళ్ళపడేటట్లు మెసులుతూ ఉండేది.

అన్ని ఆటంకాలూ తీరేయని ధైర్యంచేసి శంకరయ్యతో సంగతిసందర్భాలన్నీ విపులంగా మాట్లాడాలని వెళ్ళేడు. కామేశ్వరిప్రాసు ఎత్తిందే తడవుగా శంకరయ్య ఉగ్రరూపుడయ్యాడు. "నీకెంత సిగ్గులేదురా. పౌరుషహీనంగా ప్రవర్తిస్తున్నావు. నీ చెల్లెల్ని చేసుకున్నాడూ వాడి కొడుకు. అటువంటిది వాడి కూతురుని చేసుకుంటానని చెప్పడానికి నీకు నోరెలా ఆడిందా" అని నానామాటలూ అన్నాడు. ఆ తర్వాత తండ్రీకొడుకులూ చాలవరకూ వాదించుకున్నారు. సూర్యారావు కామేశ్వరిని తప్ప మరెవ్వరినీ పెళ్లి చేసుకోడనీ, శంకరయ్య ఆ వివాహం తాను బ్రతికుండగా జరగబోదనీ ప్రతినలుపట్టి విడిపోయేరు. కొన్నాళ్ళపాటు, తండ్రీ కొడుకు మాట్లాడుకోవడం కూడ మానుకున్నారు.

ఇదంతా జరిగి చాలాకాలమైంది. కాలం పరిస్థితుల తీవ్రతని పరిహరిస్తుంది కదా ! అందుకు అనుకూలమైన అదృష్టం కూడ కలిసివస్తే ఆ పట్టుదలలవల్ల కలిగిన కోపతాపాలు వేగం చల్లారుతాయి. సూర్యారావు బి. ఏ క్లాసులో ప్రవేశించడం, ఆపైన ఫస్టుక్లాసులో ఉత్తీర్ణుడవడం, ఇవన్నీ శంకరయ్యని సూర్యారావు పట్ల సుముఖుడుగా మార్చివేసేయి. అప్యాయత అభిమానం వృద్ధి అయ్యాయి. అప్పుడప్పుడు కలుగుతూన్న మనోవైకల్యాలు కూడా పూర్తిగా

(60 వ పేజీ చూడండి)



ఒకరు మనఇంటికి రావాలి. మనమూ ఒకరిఇంటికి వెళ్ళవలసిందే. అయితే అది ఒకరికి కాని మనకు కాని తలనొప్పిగా పరిణమించకూడదు. ఇందుకు ఎవరైనా ఏమిచేయాలి అన్నదానికంటె, ఏమి చేయరాదు అన్నది గమనించడం ముఖ్యం అంటారు ఈ రచయిత్రి.

## ఓ. వి. లక్ష్మి

మనం ఎవరింటికైనా వెళ్ళినా, మన ఇంటికి ఎవరేనా వచ్చినా ఇంకా కొంతసేపు ఉంటే బాగుండు ననేలా ఉండాలి కాని ఎంత వేగంగా ఈ పీడ వదులుతుందా అన్నట్టుండకూడదు. కొంతమంది ఎవరింటికేనా వెళ్ళితే ఆ ఇంటివారు వారి ప్రవర్తనతో విసిగి వేసారి మరేవిధంగానూ పొమ్మని చెప్పలేక "ఏమండీ మీరు వంట పూర్తి చేసుకునే బయలుదేరారా" అని ప్రశ్నిస్తారు. తెలివితేటలు శూన్యం అయినవాళ్లైతే "ఏమండోయ్, మీ ఇంట్లోలా కాదు, ఏమనుకున్నారో ఏమో, మధ్యాహ్నం 3 గంటలకే వంటయిపోతుంది మా ఇంట్లో" అని ఇంతగా పెద్ద కళ్ళు చేసి (అ) వివేకాన్ని ప్రదర్శిస్తారు. ఇంటికి వచ్చిన వాళ్ళు సరదాగా కబుర్లు చెప్తూ అంటే ఊళ్ళో వాళ్ళ గొడవంతా ఏకరువుపెట్టి ఉన్నవాటికి నాలుగు లేనివి కల్పించి మెరుగుపెట్టి డ్రామా డైలాగ్సు స్టైయిల్లో నొక్కి వక్కాణిస్తారు. ఎందుకొచ్చిన గొడవ చెప్పండి. ఊళ్ళో వారి బాధంతా వాళ్ల బాధలా ప్రవర్తిస్తారు. "చూశావూ, వాళ్ల సరళ లేదూ, ఇంటి చాకిరీ అంతా చేస్తుందా పాపం, నోరు వాయి లేకుండా, ఆ రాక్షసి అత్తగారికి సంతృప్తి లేదాయె. అలా సాధిస్తూ దాని ప్రాణాలు తీస్తూంటే ఆ చేతకాని భర్త కలుగజేసుకోడు గదా" దీనిమీద వాదాలు, ప్రతివాదాలు విరామం లేకుండా నాలుగు గంటలు అనవసర ప్రసంగం సాగుతుంది.

మరికొందరున్నారు వాళ్ళు ఎవరింటికి వెళ్ళినా, ఎవరేనా వాళ్ళ ఇంటికి వచ్చినా కబుర్లకు ఇంకే విషయాలూ లేనట్లు, రోగాల గొడవ ప్రారంభిస్తారు. ఎవరేనా రాగానే పలుకరించాలి గదా! "ఏమండి పిన్నిగారూ ఈమధ్య ఊళ్ళోనే ఉన్నారా మీరు, త్రోవతప్పి వచ్చినట్టున్నారు. అయినా వ్వి ఆయన గారికి పెద్ద పనయిందటగా, ఇంక మేము కనిపిస్తామా" అని వచ్చినవారు ఎంత బాధ పడతారో అన్న జ్ఞానము లేకుండా చటుక్కుమని అనేస్తారు. లేదాంటే "ఏమండీ అంతలా చిక్కిపోయారు, ఈమధ్య సుస్తీ చేసిందా ఏమిటి" అని ప్రశ్నిస్తారు. ఇంటికి వచ్చినవారు ఖర్మం కాలి "ఏమండీ అంతా కులాసాయేనా ?" అని అడగడమే తడవు. "అబ్బ ఏమిటోనండి పిన్నిగారు, వారం రోజులనుండీ మా ఇల్లు ఆస్పత్రి అయిందంటే నమ్మండి. మా పెద్దవాడికి మలేరియా జ్వరం. దిక్కుమాలిన రోగం ఊళ్ళో అంతమంది దుక్కల్లా ఉం... మా వాడికే రావాలా, వెర్రినాగమ్మ రెండోవాడికి ... దగ్ బ్రోంకయిటిస్‌ట. ఏం రోగాలో—మ... ా, వాడికి నాలుగు దినాలయి ... మాస్టారి సంగతి వేరే చెప్ప ... తా నొప్పు అంటారు. ఇల్లంత ... చాకిరీ చెయ్య డానికి నేను ... మిగిలాను. ఏమోనండి ... పుతున్నారంటే నమ్మండి. డాక్టర్లు ఎక్కువ అవుతున్నకొద్దీ రోగాలు ఎక్కువవుతున్నాయి" అంటారు.

కొంతమంది ఉన్నారా, "మీ ఇంట్లో ఈవేళ ఏమిటి వంటకాలు" అని ఎవరేనా ఇంట్లో అడుగు పెట్టగానే ప్రశ్నిస్తారు. ఉన్నవి లేనివి నాలుగు ఏకరువు పెడతారు కొందరు: మనస్సు చిన్న బుచ్చుకొని నాలుగు వంటకాలు చెబితే "ఈ కరువు రోజుల్లో అన్ని వంటకాలు ఎందుకు చెప్పండి, దివాలా తియ్యడానికి కాపోతే. నే చెప్పిన మాట విని, పచ్చడి చారూ అన్నంతో సరిపెట్టండి" అంటారు.

"మొన్న మా ఇంటికి ఒకావిడ వచ్చింది. వచ్చింది లగాయతూ ఇది ఎక్కడ కొన్నారు, ఆ వస్తువు ఎక్కడ కొన్నారని గుక్క తిప్పుకోకుండా ప్రశ్నలు వేసింది. ఇంకా చాలక "మొన్న కోడలికి పట్టుచీర కొన్నారటగా. కాస్త చూపిస్తారూ, మా కోడలిక్కూడా కొందామని అనుకుంటున్నాము" అంది ఆవిడ. తీరా చీర చూచి, "ఎంత ఖరీదండీ ?" అని అడిగి నూట పాతిక రూపాయలని చెప్పగానే "నూట పాతిక రూపాయలే, శుద్ధ దండగ, ఎనభై రూపాయిలకంటే ఒక్క దమ్మిడీ ఖరీదు చెయ్య" దంది. ఏం చెప్పమన్నారు—ఇలాంటివాళ్ళు సంఘానికి చీడ పురుగుల్లాంటివారు. ఇంకా తృప్తిచెందక, "చూశారూ, ఈ జరీ అంచు మన్నదు సుమండి. చాకలికి వెయ్యగానే దాని పని సరి" అంది ఆవిడ.

ఎవరింటికేనా వెళ్తే వాళ్ళ ఇంట్లోని వస్తువులన్నీ పరీక్ష చెయ్యడం కొంతమందికి అలవాటు. వచ్చిన వాళ్ళు పొందికగా కూర్చోవడం మానేసి ఎందుకు చెప్పండి ఈ పరిశోధన ? మీకు నమ్మకం కలుగుతుందో లేదో కాని, మా ఇంటి ప్రక్కనున్న ఆవిడకి మా ఇంట్లో వస్తువులు ఎక్కడ ఉన్నాయో, మాకు తెలియనివి కూడా క్షుణ్ణంగా తెలుసు. ఒకసారి ఆమె మా ఇంటికి వచ్చి ఏదో మందు ఇమ్మని అడిగింది. ఆ మందు లేదని చెప్పగానే (లేదనే మా ఇంట్లో వారి నమ్మకం) ఆమె "ఉంచ




టని కూడా లేదని అబద్ధం ఎందుకు ఆడతా రమ్మా. ఇష్టం లేకపోతే చెప్పెయ్యకూడదూ" అంది. మేము నిర్ఘాంతపోతే ఆమె చనువుగా గదిలో ప్రవేశించి అలమారు మూల ఉన్న మందుసీసా తీసుకుని చక్కా వెళ్లింది.

ఎవరేనాఇంటికి రాగానే వాళ్ల చీర, జాకెట్టు, గాజులు, నెక్లెస్ తణిఖీ చెయ్యడం, అభిప్రాయాలను వెలిబుచ్చడం కొందరికి అలవాటు. ఎంత చనువున్నా పరాయివాళ్ల ఇంటికి వెళ్లి "అబ్బ, ఈవేళ ఇంత ఉక్కగా ఉంటే పంకా ఉండీ పెట్టుకోరేం ఖర్మం, మీరు" అని వెళ్లి పంకా ఆన్ చెయ్యడం, "మీ ఇంట్లో ఇండియన్ లిజెనర్ లేదా ఏమిటి, విజయవాడనుంచి ఇప్పుడు మంచి ప్రోగ్రాం వస్తుందని" రేడియో (మిస్) హేండిల్ చెయ్యడం లాంటి అలవాట్లు ప్రాణసంకటంగా ఉంటాయి.

ఎవరింటికైనా వెళ్లితే, సిటింగ్ రూములోనే కూర్చోవడం, అధిక ప్రసంగం చెయ్యకుండా, అలాగని వెళ్లిన దగ్గరనుండి మూతి ముడుచుకుని కూర్చోమని కాదు, ముక్తసరిగా ఎదుటివారి మనస్సు నొప్పించకుండా, సరదాగా మాట్లాడడం అలవాటు చేసుకోవాలి. గంటల తరబడి, ఎదుటి వారికి విసుగు పుట్టేలా వాగకూడదు. ఏ ఒక్క [illegible] ★

## పాకశాల

వెన్నప్పాలకు ముందు బియ్యం నానబోసుకుని, ఒక బుట్టలో పొయ్యాలి. నీళ్ళు అన్నీ ఆరాక పిండి కొట్టాలి. ఒక తవ్వెడు బియ్యానికి ఏబులం పంచదారపడుతుంది. పిండి మెత్తగాదంచాలి. రెండూ జల్లెడదంచినట్లు పంచదార కూడా మెత్తగా పెట్టాలి. ముదురది, అంత లేతదీ కాని ఒక కొబ్బరికాయు కూడా కోరుకుని పంచదార, పిండి, ఈ కోరు మూడూ కలపాలి. ఒక పెద్ద దబ్బకాయంత వెన్నముద్ద వేసి బాగా కలపాలి. ఇంకా కాస్త పొడిపొడిగా ఉంటుంది. అప్పుడు రోటిలో వేసి దంచాలి. అప్పుడు మెత్తగా అవుతుంది. అంటే మన అరిశల పిండి మాదిరిగా అవుతుందన్న మాట. దీనిని ఒక గిన్నెలోకి తీసి, నిమ్మకాయంత ఉండలు చేసి, రెండు అరచేతుల మధ్య అర చేతిలో సరిపడ్డంత అట్లులా చేయాలి. బియ్యం పిండి తోపు కలిపి, అందులో ముంచి, నూనె బాగా కాగాక వేయించాలి. ఉట్టినే వేయించే కన్నా, తోపులో ముంచితే బాగా పొంగుతాయి. [illegible] వేసుకోండి.

ఇవి రెండు మూడు రోజులు కూడా నిల్వ ఉంటాయి. కమ్మ కమ్మగా బావుంటాయి.

జి. సూర్యకాంతం (కిర్లంపూడి)

## అరటిపూవు పచ్చడి

అరటిపూవు వగరు కదా! పచ్చడి చేసుకుంటే ఎంత రుచిగా ఉంటుం దనుకున్నారు!

ఒక అరటిపూవు ఒలిచి దొంగొళ్లు తీసివేసి, రోటిలో పోసి మెత్తగా దంచాలి. తర్వాత జల్లెడలోకి తీసుకొని నీళ్లతో బాగా కడగాలి. పిడచ పిడిచి పళ్లెంలో పెట్టుకోవాలి. మూకుడులో నూనె పోసి కొంచెం వేయించుకుని పది ఎండు మిరపకాయలు, అర అరాకు మావు పప్పు వేరుగా వేయించుకొని, ఇండుపకాయంత ఇంగువ, జీలకర్ర తాలింపు పెట్టి వుంచుకోవాలి. గచ్చకాయంత చింతపండు, ఒక స్పూను ఉప్పు, చిటికెడు పసుపు వేసి మెత్తగా రుబ్బాలి ఇష్టముంటే గోళీకాయంత బెల్లం కూడా వేసుకోవచ్చు. అన్నంలో వేసుకొని నేయి పోసుకొని కలుపుకుంటేమహాకసాధకం అవసరంలేదనిపిస్తుంది.

ఎన్. సూర్యకాంతం

# చిన్నపిల్లలకు కోటు

ఈ కోటు ఆరు నెలల లోపు పిల్లలకు సరి పోతుంది. ఇది కాలర్, ఫుల్ హాండ్స్‌తో చక్కగా ఉంటుంది. ఆరు కుట్లు ఒక 'ఇంచ్' కొలతతో వేయాలి. దీంట్లో వచ్చే కుట్లు, నిట్, పరల్ ఇంక్రీజు, డిక్రీజు, గార్టర్ స్టిచ్ (రెండు వైపులా నిట్ చెయ్యడం.) ఇవి అందరికీ సామాన్యంగా వచ్చే ఉంటాయి. కాబట్టి ఏలా వేసేదీ వివరముగా ఇవ్వలేదు. దీనికి తొమ్మిదో నంబర్ సూదులు కావాలి. 11 వ నం. కూడా కావాలి.

ముందు 62 కుట్లు కాస్టాన్ చేసుకోవాలి. తరువాత డిజైన్ వెయ్యాలి.

## డిజైను

మొదటి వరుస :—నిట్1, పరల్ 1. దీన్ని రిపీట్ చేసుకుంటూ కుట్లు పూర్తి అయ్యేవరకు వెయ్యాలి.

రెండవ వరుస :—మొదటి వరుస మాదిరి (అంటే నిట్ ఉన్నచోట, నిట్, పరల్ ఉన్న చోట పరల్.)

మూడవ వరుస :—అంతా నిట్ చేయాలి.

నాల్గవ వరుస :— అంతా పరల్ చేయాలి.

ఐదవ వరుస :—పరల్ 1, నిట్ 1. దీన్ని రిపీట్ చేస్తూ ఆఖరి కుట్ల వరకూ వెయ్యాలి.

ఆరవ వరుస :—ఐదవ వరుస మాదిరి (అంటే పరల్ ఉన్నచోట, పరల్, నిట్ ఉన్నచోట నిట్.

ఏడవ వరుస :—అంతా నిట్.

ఎనిమిదవ వరుస :—అంతా పరల్.

ఈ ఎనిమిది వరుసలు డిజైను అన్నమాట. ఇలాగ 9 డిజైన్లు పూర్తి చేయాలి. అంటే 72 వరుసలు వేయాలి. ఇప్పుడు ఆరమ్‌హోల్ షేపింగ్ చేయాలి. ఎలా అంటే నిట్ ఉన్నవైపు మూడు కుట్లు తగ్గించాలి. పరల్ వైపున మూడు కుట్లు తగ్గించాలి. తరువాత వరస కొకటి చొప్పున 51 కుట్లు సూదిమీద ఉండే వరకు తగ్గించాలి. మొత్తం 11 కుట్లు తగ్గించాలి. [illegible] తగ్గించాక 30 వరసలు నేరుగా వెయ్యాలి.

భుజాల షేపింగ్ :—వరసకు నాల్గు కుట్లు చొప్పున ఎనిమిది వరసల్లో 32 కుట్లు తగ్గించి మిగిలిన 19 కుట్లను విడిగా సూదిమీదకు వదిలేయాలి. ఇక ముందు అల్లుకోవాలి.

## ఎడమభాగం

9 వ నం. సూదిమీద 26 కుట్లు వెయ్యాలి. తరువాత 72 వరుసలు డిజైను అల్లాలి. (కుడి వైపున 73 వరుసలు అల్లాలి)

72 వరుసలు అల్లాక ఆరమ్‌హోల్‌షేప్ చేయాలి. మూడు కుట్లు కాస్టాఫ్ చేయాలి. సూదిమీద 20 కుట్లు వుండేవరకు ఒక్కొక్కటి చేతివైపు తగ్గించాలి. 24 వరుసలు నేరుగా అల్లాలి. తరువాత మెడవైపు సూదిమీద 16 కుట్లు ఉండేవరకు తగ్గించాలి. నేరుగా మూడు వరుసలు* అల్లాలి. తరువాత వరసకు నాలుగు కుట్ల చొప్పున మూడు వరుసల్లో తగ్గిస్తూ కాస్టాఫ్ చేయాలి. ఇలాగే కుడిభాగం కూడా అల్లాలి.

## చేతులు

11 వ నం. సూదిమీద 28 కుట్లు కాస్టాన్ చెయ్యాలి.27 వరుసలు గార్టర్ స్టిచ్‌లో అల్లాలి. (అంటే రెండువైపులా నిట్ అన్నమాట) తరువాత రెండు వరుసలు డిజైను అల్లాలి. డిజైన్స్ అల్లుతూ ఇటువైపు ఒకటి, అటువైపు ఒకటి

**పుష్పకుమారి**

కుట్లు ప్రతి మూడు వరుసల కొకసారి ఎక్కువ చేస్తూ సూదిమీదికి 50 కుట్లు వచ్చేవరకు అల్లాలి. మూడు వరుసలు నేరుగా అల్లాలి. తరువాత నిట్ వైపు మూడు కుట్లు, పరల్ వైపు మూడు కుట్లు తగ్గించాలి. తరువాత సూదిమీదికి పన్నెండు కుట్లు వుండేవరకు వరస కొకటి తగ్గిస్తూ అల్లి తరువాత ఆ పన్నెండింటినీ కాస్టాఫ్ చేయాలి. ఇలాగే ఇంకొక చెయ్యి కూడా అల్లాలి.

## పాకెట్స్

9 వ నం. సూది మీదికి 16 కుట్లు నిట్ చేసుకొని 19 వరుసలు డిజైనుతో అల్లి 8 వరుసలు గార్టర్ స్టిచ్‌తో అల్లి కాస్టాఫ్ చెయ్యాలి. ఇలాగే ఇంకొక పాకెట్ కూడా అల్లుకోవాలి.

## బటన్ బ్యాండ్

11 వ నం. సూదిమీదకు 8 కుట్లు కాస్టాన్ చేసి 142 వరుసలు గార్టర్ స్టిచ్‌లో అల్లి ఎడమ భాగంతో అతకాలి. ఈ అతకటం నీట్‌గాను, మెడ దగ్గర సరిపోయేటట్లు అతకాలి.

## బటన్ హోల్ బ్యాండ్

11వ నం. సూది మీదికి 8 కుట్లు కాస్టాన్ చేసి రెండు వరుసలు గార్టర్ స్టిచ్‌లో అల్లాలి.

బటన్‌హోల్ చేసే విధం :— మూడు కుట్లు నిట్ చేసి రెండు కుట్లు కాస్టాఫ్ చెయ్యాలి. తరువాత మూడు కుట్లు నిట్ చెయ్యాలి.

రెండవ వరుస. మూడు కుట్లు నిట్ చేసి రెండు కుట్లు కాస్టాన్ చేసి మిగిలిన మూడును నిట్ చెయ్యాలి. ఇలా హోల్ చేశాక 20 వరసలు అల్లి మళ్ళా బటన్‌హోల్ చెయ్యాలి. ఇలా మొత్తం 7 బటన్‌హోల్స్ చెయ్యాలి. తరువాత 12 వరుసలు నేరుగా అల్లాలి. తరువాత దీన్ని కూడా కుడిభాగానికి అతకాలి. (ఇలా అతకటం కష్టం అనుకునేవారు ఫ్రంట్ పోర్షన్ అల్లుకునే టప్పుడు 26 కుట్లు కాస్టాన్ చేసుకున్న తరువాత అదనంగా 8 కుట్లు ఎక్కువ చేసుకొని ఈ ఎనిమిది కుట్లను గార్టర్ స్టిచ్‌తోను, మిగిలినది డిజైనుతోను మెడవరకు అల్లుకుంటే సరి పోతుంది.)

## కాలర్

ముందు భుజాలు అతుక్కొని పక్క భాగాలు అతుక్కున్న తరువాత చేతులు అతకాలి. ఇలా అతుక్కున్న తరువాత కాలర్ మొదలుపెట్టాలి. బటన్‌హోల్ బ్యాండ్ యొక్క ఎనిమిది కుట్లు సూది మీదకి తీసుకోవాలి. తరువాత కుడివైపు కుట్లను వరుస కొక్కటి చొప్పున తీసుకొని, వెనక మెడవైపు 19 కుట్లు తరువాత ఎడమ వైపు మెడ దగ్గర వరుస కొక కుట్టు చొప్పున, తరువాత బటన్ బ్యాండ్ యొక్క ఎనిమిది కుట్లు, ఒకే సూదిమీదికి తీసుకొని 34 వరుసలు గార్టర్ స్టిచ్‌లో అల్లాలి. తరువాత లూజుగా కాస్టాఫ్ చేయాలి. ఫిట్‌గా చేశారంటే కాలర్ షేప్ చెడిపోతుంది. తరువాత 7 బటన్లను బటన్ హోల్‌కు సరిపోయేటట్లు కుట్టాలి. పాకెట్స్‌ను బటన్ హోల్ బాండ్‌కు, బటన్ బేండ్‌కు ఒక్క అంగుళం దూరంలో (కిందిభాగం యొక్క అంచు సరిగా పెట్టి నీట్‌గా, కుట్లు కనపడకుండా అతకాలి.

నేను దీనిని ఆరునెలల పిల్లకు అల్లాను. సరిగా సరిపోయింది. పిల్లలు బొద్దుగా ఉంటే ఇంకా ఎక్కువ కుట్లు పెట్టి అల్లుకోవాలి. ఎక్కువ తక్కువ కుట్లు పెట్టుకొని ఎవరి కొలతకు వారు సరిగా అల్లుకోవచ్చు. ఇది చిన్న పిల్లలకే కాక పెద్ద వాళ్ళకు కూడా బాగుంటుంది. నేను పాత స్వెటర్ విప్పి అల్లాను కాబట్టి ఇన్ని ఔన్సు వూలు పడుతుందని చెప్పలేదు. సుమారు నాలుగు లేక ఐదు ఔన్సులు పట్టవచ్చు. జాగ్రత్తగా రెండు, మూడు సార్లు చదివితే తప్పక సులభముగా కుదురుతుంది. తప్పక ప్రయత్నించండి. ★



# వనితా వాణి

## వచ్చేపోయే బంధువులు, ప్రాణాలు

25-1-61వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వనితాలోకంలో ప్రచురించబడిన "వచ్చేపోయే బంధువులు-ప్రాణాలు" అన్న వ్యాసం చదివాను. దానిలో కుమారి సరోజగారు వివిధ మనస్తత్వములుగల బంధువులను గురించి చక్కగా వ్రాశారు. వారన్నట్లు తలవని తలంపుగా వేళాపాళా గానప్పుడు వచ్చే చుట్టాలు చాలా చిరాకు కలిగిస్తారు. కాని "కొంతమంది బంధువులు, ఎండాకాలపు సెలవులు రాగానే ఆ సెలరోజులు అక్కడ ఉంటే ఖర్చు అవుతుందని జీతం బ్యాంకులో వేసుకొనివస్తారు" అన్న వాక్యము అతిశయోక్తిగా కన్పిస్తున్నది. మన ఇండ్లకు వచ్చి నెల రెండు నెలలు ఉండేవారు మన ఆత్మీయులు, మన ఇబ్బందులు వారి ఇబ్బందులుగా చూచుకొనువారే అయిఉంటారు. వారు కూడా మనలను వారి ఇండ్లవద్ద చాల వాత్సల్యముగాను, గౌరవంగాను చూస్తారు. అంతేగాని మన ఇంటికివచ్చి మనలను వేధించుకునే చుట్టాలు నాలుగు లేక అయిదు రోజులుకంటే ఎక్కువ మకాము చేయరనుకుంటాను. వారున్న ఆ కొద్దికాలంలోనే, మనకు ప్రాణసంకటము తెచ్చిపెడతారనే మాటమాత్రం వాస్తవము. ఒకవేళ మన ప్రాణాలను కొరుక్కు నిలిచే చుట్టాలు నెలల తరబడిఉంటే వారిని బంధువులనటంకంటే రాబందులు అంటే బాగుంటుందనుకుంటాను.

తాతినేని ప్రఫుల్ల (పునాదిపాడు)

* * *

## బస్తీవారికి లాయకీ

25-1-61వ తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని వనితాలోకంలో ప్రచురించిన-"వచ్చేపోయే బంధువులు-ప్రాణాలు" అన్న వ్యాసం బస్తీ సంసారాలు చేసేవారికిన్నీ, ఎవరికివారే యమునాతీరే అన్నట్లు బంధుప్రేమ లేనివారికిన్నీ చదువుటకు ఇంపుగా ఉన్నదేమోకాని నాకు మాత్రం ఏమంత బాగాలేదు. కేవలం వచ్చిన బంధువుల అలవాట్లు, తప్పులు ఉట్టంకించారేకాని "ఏదో మన బంధువులు దూరదేశములో ఉన్నారు. మనము రాకరాక వచ్చినాము, చూచిపోవుదము" అని ఇంటికివస్తే, ఆతిథ్యము మాట అటుంచి కాస్త ప్రేమగా పలుకరించనైనా పలుకరించనివారు ఎందరో ఉన్నారు. అటువంటివారిని ఏమనాలి? గనుక ఇటువంటి వ్యాసములవల్ల ఏమీ ప్రయోజనములేదు అని నా హెచ్చరిక.

ఎమ్. ధనలక్ష్మీ తాయారు

* * *

"వచ్చేపోయే బంధువులు-ప్రాణాలు" అను వ్యాసము చాలా బాగుంది. విషయములు అన్నీ మామూలుగా జరుగుతుంటాయి పల్లెటూళ్ళలో. కాని పట్నం విషయంలో మాత్రం సదా జరుగుతున్నాయి. బంధు రాకడ ప్రాణ పోకడ" అను నానుడి నిజం.

కొత్తపల్లి రాజరత్నం
(బాలుకొండా-అర్మూర్)

* * *

## చుట్టమై చూడవచ్చి....

"వచ్చేపోయే బంధువులు-ప్రాణాలు" అన్న వ్యాసం చదివాను. పట్టణవాసులైన బంధువుల ఇళ్ళలో చుట్టమై చూడవచ్చి దెయ్యమై పట్టినట్లు అన్ని రోజులు బంధువులు ఉండడం అసంబద్ధమే. కాని వాళ్ళ ఇంట్లో జరిగిన సంఘటన దృష్ట్యానే రచయిత్రి చూచారు. అతిథి-అభ్యాగతి అన్న నానుడి అన్ని సంప్రదాయాల్లో ఉండనే ఉంది. వేళాపాళా తిథి వార నక్షత్రాలతో పని లేకుండా దిగేవారినే 'అతిథి' అంటారు.

విపరీతమైన ధరలతో ప్రతివస్తువూ మండిపోయే రోజుల్లో వచ్చేపోయే బంధువులకు ఇక్కట్లను తెలియచేస్తూ ఇంకా వివరంగా వ్రాస్తే బాగుండేది. కుమారి సరోజగారు ఈ విషయంమీద వ్రాసి వారి అభిప్రాయాలను తెలిపినందుకు నా ధన్యవాదాలు. నిత్యజీవితంలో ప్రతి మనిషీ ఎదుర్కోవలసిన పైకి చిన్నవిగా కనుపించే ఇలాంటివే ఒకప్పుడు సమస్యలుగా తయారవుతాయి.

ఎన్. ప్రసూన (మద్రాసు)

* * *

## స్త్రీ....

18-1-61వ తేదీ సంచికలో సరళగారు "స్త్రీ" గురించి వ్రాసిన వ్యాసము చాలా బాగున్నది: "ఏది ఏమైనా స్త్రీ స్వాతంత్ర్యము అంటే పురుషుని స్వాతంత్ర్యము వంటిదికాదు. అది ఆమె పరిధిని మరింత దృఢతరం చేస్తుంది. ఆమె జీవితం మరింత ఉపయుక్తం, మహత్తరం అవుతుంది. ఇంటికి దీపం ఇల్లాలు సమాజానికి చలువ పందిరవుతుందని" అన్న వారి మాటలు చాలా ఉత్తేజపరుస్తున్నాయి. మరియు సబబుగా ఉన్నవి. ఇట్టి అపూర్వమైన సలహా లిస్తున్న సరళగారికి నా హృదయపూర్వక అభివందనములు.

మీ (మా) పత్రికద్వారా తెల్పుటకు చాలా సంతోషిస్తున్నాను.

ఆర్. వి. రమణమ్మ (తుని)

* * *

## రుచి లేదు

18-1-61వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రకటించిన విధముగా కిళాంబి సత్యవతీదేవిగారు వ్రాసిన విధముగానే రవ్వ చంద్రకాంతలు చెసినాము. చాల బాగా కుదిరినవి కాని రుచిగా లేవు.

వైజాగ్ కేక్ బాగానే కుదిరినది.

జె. అనసూయ (చింతలపూడి)

* * *

## రుచిగా ఉంది!

కిళాంబి సత్యవతీ దేవిగారు 18-1-61వ తేది పత్రికలో వ్రాసిన ప్రకారం "రవ్వలడ్డు" చేసినాము. చాలాబాగా వచ్చినవి. మంచి రుచి సువాసన కలిగియున్నవి. వారికి మన పత్రిక ద్వారా ధన్యవాదము లర్పించుచున్నాను.

త్రిపురాంబ (నరసాపురం)

* * *

## ఛట్నీ పొడి

25-1-61వ తేది పత్రికలో శ్రీమతి ఎల్. ఇందిరమ్మగారు (కర్నూలు) ఛట్నీపొడి చేయు విధము చక్కగా తెలిపినారు. నేనింతకుముందెన్నియో దినములనుండి నా సోదరీమణులెవరైన అది చేయు విధము తెలుపగలరేమోయని ప్రతి వార పత్రికను తిరుగవేసినాను. ఇన్ని దినములకు నేను అది చేయు విధము తెలిసికొనగలిగినాను.

వి. యశోద (మద్రాసు)

* * *

# వనితావాణి

25-1-61 వ తేది సంచికలో ఎస్. ఇందిరమ్మగారు వ్రాసిన ఛట్నీపొడి మేము చేసినాము. చాల బాగా కుదిరింది. రుచిగా కూడా వుంది.

డి. కె. సుమతీ రెడ్డి (బొల్లారం)

*   *   *

## పేరు అర్థం కాలేదు

18-1-60వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రిక పండుగ పిండి వంటలు శీర్షికలో జి. సరోజగారు వైజాగ్ కేక్ తయారు చెయ్యడం గురించి వ్రాశారు. సరోజగారు చెప్పినట్లుగా మా ఇంట్లో సంక్రాంతి సాయంత్రం చేశాము. బాగానే ఉంది. కాని మాకు ఆ పిండివంటకు "వైజాగ్ కేక్" అన్న పేరెందుకు వచ్చిందో తెలియకున్నది.

భానుమతి (అగ్రహారంవీధి-బొబ్బిలి)

*   *   *

## మొటిమలకు మందు

కె. సుందరిగారూ! మొటిమలకు మీరు చెప్పినట్లు రాశానండీ. నాలుగు రోజులు రాసేసరికి దానియొక్క ఫలితం కనిపించింది. ఇప్పుడు నా పచ్చటిముఖం నాకు వచ్చేసింది. ఇందుకు కారణమైన మీకు సుందరంగారికి నా హృదయపూర్వక వందనములు. నేను పటికను పొడిచేసి ఒక టీ స్పూన్ నీళ్ళలో కలిపి ముఖానికి రాసేదాన్ని. ఇంగ వలన ముఖం శుభ్రపడి మర్నాటికి మొటిమలు వచ్చుటకు అవకాశం తగును.

ఒక సోదరి మొటిమలవలన పడిన మచ్చలు పోయేందుకు ఏదైన చెప్పమన్నారు. ఇతర మచ్చలువలెకాక మొటిమలువలన పడిన మచ్చలు, కొత్త మొటిమలు రాకుండా చూసుకుంటే త్వరలో పోతాయి. నాకు 20 రోజుల్లో పోయాయి. నాకు ఇప్పుడు, ఇది వరకు మొటిమలు వున్నాయంటే ఎవరు నమ్మరు

కుమారి గూడా లలిత (నరసాపురం)

*   *   *

## ఆలుమగల పరస్పర సహకారం

18-1-61 వ తేదీ పత్రికలో వనితాలోకం శీర్షికయందు మందరపు లలితగారు వ్రాసిన "సంసార జీవితంలో ఆలుమగల పరస్పర సహకారం" అనే వ్యాసం చదివాను. చాలా బాగుంది. ఇంటి విషయమే పట్టించుకోని గృహస్థులయొక్క, ఇంటిలో ఎల్లప్పుడు చిరచిరలాడే గృహిణులయొక్క భావములను చక్కని ఉదాహరణలతో తెలియజేసిన రచయిత్రికి నా వందనాలు.

ఝాన్సిలక్ష్మి (గుంటూరు)

*   *   *

## నల్ల మచ్చలు

చారపప్పు తీసికొని నీరుపోసి మెత్తగా నూరి దూదితో అరగ అరగ రాసిన నల్లని మచ్చలు పోవును.

పి. శారదాదేవి (హన్మకొండ)

*   *   *

## మచ్చుతునక

11—1—61 తేదీ వార పత్రికలో శ్రీమతి అన్నపూర్ణగారు వ్రాసిన 'స్త్రీలు—పరనాసక్తి' అనే శీర్షిక చదివితిని. ఈమధ్య వ్రాస్తున్న వ్యాసము లన్నిటిలోకి అత్యుత్తమంగా ఉందని చెప్పగలను. పూకదంపు కబుర్లతో విలువైనటువంటి శీర్షికను పాడుచేయకుండా మచ్చుతునకలని చెప్పుకొనతగ్గ ఇటువంటి వ్యాసాలు కనీసం నెలకి ఒకటి అయినా వ్రాసినట్లయితే నావంటివారి కోరిక తీరుతుంది.

కె. వి. లక్ష్మి (అనకాపల్లి)



## దిండుగలేబుకు



—విరిశెట్టి అచ్యుతరావు (పుల్లేటికుర్రు)




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**8-2-61** బుధవారం మొదలు
**14-2-61** మంగళవారం వరకు.

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

విశేషంగా ఆదాయమూ, ఆదాయంతోపాటు ఖర్చులు పెరుగుతవి. ఉత్సాహం బాగా ఉంటుంది. అధికారులతో సమావేశం లభిస్తుంది. వాహనాలు, యంత్రాలు మొదలయినవి కొనగలుగుతారు. ఒకానొక స్నేహితుని విషయంలో మీరు పడే శ్రమ అక్కరకు వస్తుంది. శుభ కార్య విశేషాలలో పాల్గొన వలసి వస్తుంది. అధిక త్రిప్పట, విశ్రాంతి లేని పనులు మీ సుఖ సంతోషాలకు ప్రతిబంధకం అయ్యే అవకాశా లున్నవి. మీకు రావలసిన ధనం చాలావరకు సకాలంలో వస్తుంది. వారం రెండవ భాగంలో ఇతరులకు హామీ ఉండవలసిన అవసరం కలుగుతుంది. కలహాలు వచ్చేటట్లు కనపించినా మీ నేర్పుతో సరి చేసుకో గలుగుతారు. 9, 10 లలో బంధు విరోధం, లోగడ జరిగిన పొరపాట్లను సర్దుకొనటం, శుభ వార్తలు.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా).

ఈ వారం ముఖ్యంగా విలాస వినోదాలతో సుఖంగా జరుగుతుంది. మీ పట్టుదలవల్ల లోగడ జరుగని అనేక పనులు యీ సమయంలో అనుకూలిస్తవి. శుభకార్యాలు సంతృప్తికరంగా నెరవేర్చ గలుగుతారు. ఒకటి రెండు సమయాలలో నీచులతో కలహాలు రాగల అవకాశా లున్నవి. మిమ్ములను ప్రోత్సాహపరచిన మనుష్యులు తలవని తలంపుగా మీ విరోధి వర్గంలో చేరుతారు. మీ మాట చలామణి బాగుంటుంది. ఆదాయం మామూలుగానే ఉంటుంది. వారాంతంలో దూరపు ప్రయాణం చేయవలసి వస్తుంది. ధన సంబంధమైన లెక్కలు, వ్యవహార ప్రసంగాలు, మొదలైన విషయాలలో నిదానము, మాట కట్టుబాటు అవసరం. 11, 12 లలో కార్యభారము, బంధువుల వద్ద నుంచి శుభవార్తలు, ఆదాయ వృద్ధి.

## మిధునం :

(మృగశిర **3, 4** పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఆరోగ్యాన్ని గురించిన శ్రద్ధ అవసరం. పేరు ప్రతిష్ఠలు బాగుంటవి. పండితులతో మైత్రి లభిస్తుంది. వృత్తిలో డబ్బుకన్నా పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి. అకస్మాత్తుగా బంధు మిత్రులకు సంబంధించిన కష్ట వార్తలు తెలుస్తవి. సాటి వారితో పోటీపడి శక్తికి మించిన భారం పైన పెట్టుకుంటారు. ఆస్తి కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. పిల్లల ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు.

> ### గ్రహస్థితి
>
> మిధునంలో అంగారకుడు, సింహంలో రాహువు, ధనుర్మకరాలలో గురువు, మకరంలో శని, మకర కుంభాలలో సూర్యుడు, కుంభంలో బుధ, కేతువులు, మీనంలో శుక్రుడు, తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

మిమ్ములను స్తోత్రం చేస్తూ సహాయం నిమిత్తం ఎదురుచూచేవారు ఉంటారు. ప్రయాణాలు అనుకూలిస్తవి. దక్షిణ దిక్కునుంచి ధనలాభంతోపాటు, కలహ వార్తలు కూడా వస్తవి. వారం చివర రోజులలో శిరస్సుకు సంబంధించిన అవయవాలలో బాధ కలుగుతుంది. 8, 9 లలో సంఘంలో గౌరవము, శ్రమవల్ల ఫలితం.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష).

హృదయంలో ఉండే జాలీ, మృదుత్వము మాటలలో కనబరచలేక పోవటంవల్ల పనులలో ఆలస్యము, శ్రమ కనుపిస్తవి. ముందుకన్నా ధనాదాయం బాగుంటుంది. ఒక రిద్దరు పెద్ద మనుషులు మిమ్ములను ఆదరించి సహాయం చేస్తారు. ధర్మ కార్యాలలోను, దైవ కార్యాలలోను పాల్గొంటారు. నౌకరులతో కలహాలు వస్తవి. మీ మనస్సులో గాని, పనులలో గాని ఇంతకుముందు ఉండే చురుకుదనం లోపిస్తుంది. ఇతరుల వ్యవహారాలలో ప్రవేశించే సందర్భంలో ముందు జాగ్రత్త అవసరం. వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు. నిబ్బరంతో ఉందామని ఎంత ప్రయత్నించినా సందేహాలు మిమ్ములను వెంబడిస్తూ ఉంటవి. ఇతరుల వద్ద నుంచి రావలసిన ధనం సులభంగా సకాలంలో వస్తుంది. 9, 10 తేదీలలో సుఖభంగం, ఆప్తులతో నిష్ఠుర ప్రసంగాలు, స్వల్ప ఆదాయము.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

బాహ్యవిషయాలలో మీ అధికారము, మాట చెల్లించుకో గలుగుతారు. అనేక సందర్భాలలో విరోధ భావం తొలగిపోయి అనుకూలమార్గం కనిపిస్తుంది అధికారులవల్ల కార్యసిద్ధి, ధన లాభము పొందగలుగుతారు. మీ రహస్యాలను బయటకు లాగటానికి ప్రయత్నించేవా రుంటారు. అందువల్ల చిక్కులు రాకుండా చూచుకొనండి. తలవని తలంపుగా అనారోగ్యం కనుపించి వెంటనే నెమ్మదిస్తుంది. వృత్తి ఉద్యోగాలలో గౌరవంతోబాటు ఆదాయం కూడా పెరుగుతుంది. కుటుంబంలో అందరిని సంతృప్తిపరచటం అనేది సమస్యగా తయారవుతుంది. ఖర్చుకు తగిన సుఖం పొందలేక పోతారు. 11, 12 లలో లాభవార్తలు, సంఘంలో గౌరవ ప్రాప్తి.

* * *

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా. హస్త, చిత్త 1, 2 పా.)

దేహ శ్రమ విశేషంగా ఉంటుంది. ప్రతి పనిలోను చిక్కులు వచ్చేటట్లు కనిపిస్తూ చివరకు సంతృప్తికరంగా ఫలితం పొందగలుగుతారు. మీ పట్టుదల, బుద్ధిబలము వీటిని సకాలంలో ఉపయోగించుకొని సంఘంలో మీ అంతస్తును కాపాడుకొంటారు. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. ఒకరిద్దరు విరోధులు అపకారం చేయటానికి ప్రయత్నిస్తారు కాని, దైవబలం వల్ల అది వారికే ఎదురు తిరుగుతుంది. ఇతరులకు సలహా చెప్పవలసి వస్తుంది. వృత్తిలో మీతో పోటీచేదామనుకునేవా రుంటారు. అందువల్ల మీ రెంతమాత్రము కంగారు చెందవద్దు. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. అనుకున్న దానికంటె విశేషంగా ఆదాయంఉంటుంది. 13, 14 లలో బంధుదర్శనం, వ్యవహారాలలో అనుకూలత.

* * *

## తుల :

(చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

వ్యవహార విషయాంలో మీ ప్రయత్నాలు ఫలిస్తవి. మీ క్షేమం విచారిస్తూ మీ రహస్యాలను తెలుసుకోటానికి ప్రయత్నించే పెద్దమనుష్యు లుంటారు. జాగ్రత్తగా ఉండండి. ఆదాయం బాగుంటుంది.

మాట పెట్టించుపవల్ల ఆప్తులతో విరోధాలు రాగల అవకాశా లున్నవి. విశ్రాంతి లేని కార్యక్రమాలు ఉంటవి. అయితే దృఢ స్వభావంతో నిర్వహించుకో గలుగుతారు. ఈ సమయంలో వచ్చే వార్తలు సంతృప్తికరంగా ఉండవు. పెద్దమనుష్యుల తరపోలో మీచేత పని చేయించుకుని మోసం చేసేవా రుంటారు. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. రాజకీయాలలో మీ అంతస్తు పెరుగు తుంది. విలువగల వస్తువులు కొనే అవకాశా లున్నవి. 13, 14 తేదులలో ఆస్తి వృద్ధి ప్రయత్నాలు, మిత్రులతో అభిప్రాయ భేదాలు.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ.)

ప్రస్తుతం జరిగే మార్పులు తాత్కాలికంగా శ్రమగా తోచినా ముందు ముందు మీ హోదా, ఆదాయము పెరగటానికి మార్గం ఏర్పడుతుంది. ధైర్య స్థైర్యాలు కలుగుతవి. ఈ సమయంలో జరిగే ఖర్చులకు తగినట్లు ఉపయోగం పొంద గలుగుతారు. ఒకానొక సందర్భంలో కార్య నిర్ణయం చేయటానికి ముందు ఆందోళన కలుగుతుంది. మీ క్షేమం కోరే ఆప్తమిత్రులు మిమ్ములను సక్రమమైన మార్గంలోకి త్రిప్పి సహాయం చేస్తారు. అధికారులవల్ల మీ పనులు పూర్తి అవుతవి. విలాస వినోదాలకై ఖర్చులు పెరుగుతవి. పండితు లతో స్నేహసంబంధాలు లభిస్తవి. ఆదాయ వృద్ధి ప్రయత్నాలు సుముఖంగా ఉంటవి. కుటుం బంలోని వారి ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. 12, 13 లలో కారణంలేని భయము, శ్రమవల్ల కార్యసిద్ధి, అకస్మాత్తుగా దేహబాధలు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

కొన్ని చిక్కులనుంచి బయట పడ్డామనే సంతృప్తి పొందగలుగుతారు. కుటుంబంలో ఇంతకు ముందు మీ మనస్సునుబాధించేవారు వారి స్వభావాన్ని కొంతవరకు మార్చుకుంటారు. వ్యాపారాలు ఆరం భించటం, గృహాలు నిర్మించటం వంటి పనులలో ప్రతిబంధకాలు తొలగి ముందుకు పోవటానికి అవ

# రాశిఫలాలు

కాశం లభిస్తుంది. మిమ్ములను కలహాలకు లాగే మనుష్యు లున్నా జాగ్రత్తగా తప్పుకో గలుగుతారు. సంఘకార్యాలు అధికం. తూర్పు ఉత్తర దిక్కుల నుంచి ఆదాయంతో కూడిన శుభవార్తలు తెలు స్తవి. అధికారులతో పేచీలు రాగలవు. వృత్తిలో క్రొత్తవారి సహాయం లభిస్తుంది. 8, 9 లలో ఆదాయ వృద్ధి, ప్రయాణ సూచనలు, కలహాలు.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

సాధారణంగా మీ మాటకు ఎదురు ఉండదు. ఏ సమయానికి తగినట్లు ఆ సమయంలో నడుచుకో గలుగుతారు. మీతో చేరటానికి తాపత్రయపడే మను ష్యులను తొందరపడి కలుపుకోవద్దు. సకాలంలో ధన సహాయం లభిస్తుంది. వ్యాపార వ్యవహారాలలో మీ యోచనలు వెంట వెంటనే కార్యరూపంలోకి వస్తవి. అకస్మాత్తుగా శ్రమలేని ఆదాయం పొందగలమనే ఆశలు ఫలించవు. ప్రయాణాలు చేయవలసి వస్తుం దని అనుకుంటారు. కాని జరుగవు. శుభ, పుణ్య కార్యాలు జరుగుతవి. శ్రమకు తగిన ఫలితం పొందగలుగుతారు. బంధువులవల్ల మీరు ఎదురు చూచే సహాయం ప్రస్తుతం లభించదు. 13, 14 లలో మానసికమైన బాధలు, తలపెట్టిన పను లలో ప్రతిబంధకాలు, వృధా సంచారం.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా. శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

దేహారోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. ఒకరి సంతృప్తి కోసం మరొకరితో విరోధించవలసివస్తుంది. బంధువర్గంలో గౌరవం లభిస్తుంది. కోర్టు కచేరీ లలో శ్రమ అనుకూలిస్తుంది. తీర్థయాత్రలు

## ఈ వారము ధరలు

ఈ వారం ఆరంభంలో బంగారు ధర పెరుగుతుంది. వెండి ధర కూడా బాగా పెరిగి కొద్దిగా తగ్గుతుంది.

పసుపు ధర తేజీ వచ్చి నిలుస్తుంది. ప్రత్తి ధర వారం ఆరంభంలో మందీ, చివరకు బాగా పెరగగల అవకాశా లున్నవి. నూలు ధరలో 12 నుంచి పెరుగుదల వస్తుంది.

నూవులనూనె ధరలో కొద్దిగా తగ్గుదల కనిపిస్తుంది. వేరుశనగపప్పు ధరలో తేజీ వచ్చి తగ్గుతుంది. నూనె ధరలో మార్పు రాదు.

గోనె సంచులకు గిరాకీ వస్తుంది. కందుల ధరలో మందీ వస్తుంది. మినుములకు ధర బాగుంటుంది.

మొదలైన పుణ్యకార్యాలు నిరాటంకంగా జరుగు తవి. ధనవ్యయం అధికంగా ఉన్నా సుఖము, కార్యసిద్ధి పొందగలుగుతారు. నౌకర్లమీద ఆధార పడి చేసిన పనులు అసంపూర్తిగా నిలచిపోయే అవకాశా లున్నవి. మీతో కూడా ఉంటున్న మను ష్యులే మీ మాటకు వ్యతిరేకంగా పనులు ప్రారం భిస్తుంటారు. వారం రెండవ భాగంలో చేతికి చిక్కిన అవకాశాన్ని సందేహిస్తు జార విడుచు కుంటారు. 10, 11 లలో గౌరవ ప్రాప్తి, ధన లాభము, బంధువుల వద్దనుంచి శుభ వార్తలు.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా. ఉ. భాద్ర, రేవతి).

ఇంతకుముందుకన్నా మనశ్శాంతి లభిస్తుంది. ధైర్యంతో మీ ధర్మాన్ని నిర్వర్తించుకో గలుగుతారు. అపవాదులు వస్తవనే భయం ఒకప్రక్క బాధిస్తున్నా దైవానుగ్రహంవల్ల ఎదటివారిని సంతృప్తిపరచ గలుగుతారు. వృత్తిలో ప్రశాంతత, పైవారి వల్ల ఆదరాభిమానాలు లభిస్తవి. కుటుంబ విషయాలలో మీరు జోక్యం తగ్గించుకొనటం మంచిది. అనేక సందర్భాలలో భారం ఇతరులకు విడిచిపెట్టటం వల్ల కొంతవరకు సుఖం పొందగలుగుతారు. ఆదాయం బాగానే ఉంటుంది. సాధారణ విషయా లలో కూడా ఖర్చులు పెరుగుతవి. యంత్రాలు, ఆయుధాలు మొదలైనవి ఉపయోగించే సమయా లలో జాగ్రత్త అవసరం. 9, 10 తేదీలలో శుభ కార్యాలు, దేహ శ్రమ, పైవారి వల్ల గౌరవం.



# అంతా ఉట్టిదే

బంధకవి ఉదయశంకర్



ఆ వేళ నరకచతుర్దశి మూలాన బడికి సెలవు. బాబుకి ఆరోజు అస్తమానూ తీరుబడే లేదు. రేపు దీపావళి మరి!! బాణసంచా తయారు చెయ్యడంతో ఆ రోజు గడిచి పోయింది. రాత్రి-అన్నం తిని అలా ఓసారి స్నేహితుల దగ్గర కెళ్లాడు. ఎవరెవరు ఏవేం బాణసంచా తయారు చేసారో ఏవేం బజార్లో కొన్నారో చూచాడు. తను కట్టిన వాటిగురించి కొన్నవాటిగురించి గొప్పగా చెప్పాడు! పిల్లలందరూ చుట్టూ మూగి వింటున్నారు.

"ఉరేయ్! రండ్రా! రాకెట్ వెలిగిస్తాను" అంటూ గోపీ పిల్లల్ని అందర్నీ పిలిచాడు. పిల్లలు యిటు వైపు వచ్చేసారు, బాబు రాకెట్ కొనలేదు. అదేఁమిటో! ఎలా వుంటుందో నని ఆత్రుతగా చూస్తున్నాడు.

పిల్లలందరూ చూస్తుండగా గోపీ రాకెట్ వెలిగించాడు. అది 'ఛుఁయ్' మని అంటుకుని గుఫ్ మంటూ పైకెగిరింది.

పిల్లలు పైకి చూస్తూ—అబ్బ! చాలా పైకెగిరిందే" అన్నారు. అంత పైకెగిరిన రాకెట్ పైన—'ఢాం' అని పేలి దట్టంగా పొగ వచ్చింది. ఆపొగలోంచి చిన్న బుడగలాంటిది మెల్లిగా కిందకు దిగింది. పిల్లలు సంతోషంతో చప్పట్లు కొట్లారు. గోపీ వాళ్లందరికేసి గర్వంగా చూచాడు! మీసం లేదుగాని ఉంటే మెలివేసేవాడే.

బాబు దృష్టి అంతా రాకెట్ మీదే వుంది. నెమ్మదిగా యింట్లోకి పోయి రాకెట్ కొనడమేలాగా అని ఆలోచిస్తూ పడుకొన్నాడు. "నాన్న నడిగితే ఇంకేఁవీ వొద్దం'టాడు. అమ్మనడిగితే 'ఉన్నవన్నీ చాల

# అంతా ఉత్తిదే

వేంటి?' అంటుంది రమేలా X!? చెల్లాయి నడిగితే...నాన్న అప్పుడప్పుడిచ్చిన డబ్బులు డబ్బీలోవేసి దాచుకుంటుంది. ఔను! చెల్లాయి నడుగుతాను" అని అనుకొని చెల్లాయికోసం చూసాడు. 'అప్పుడే నిద్రపోతోంది......సర్లే! రేపడుగుతాను...గోపీ తెచ్చిన దానికంటే యింకా మంచిది తెస్తాను. వాడి దాంట్లోంచి బుడగ దిగింది! నా దాంట్లోంచి నిజంగా రాకెట్టే దిగుతుంది..." ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.

మొత్తం మీద బాబు రాకెట్ కొన్నాడు. పిల్లలందర్నీ కేకేసి రాకెట్ వెలిగించాడు. అది యథాప్రకారంగా పైకెగిరింది. ఈ సారి అందులోంచి బుడగ లాంటిది కాకుండా బాబు అనుకుంటున్నట్టు 'రాకెట్' దిగింది. పిల్లలందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. బాబు కూడ ఆశ్చర్యపోయాడు! ఎక్కడిదామేంటి అనుకున్నాడు. రాకెట్ తనకోసమే అన్నట్టుగా క్రింద ఆగింది. "ఎక్కు బాబూ" అన్నాడు గోపీ. "బాబోయ్! నాకు బయ్యం! నువ్వు కూడ ఎక్కు" అన్నాడు బాబు. ఇద్దరూ కలిసి రాకెట్‌లో కూర్చుని విజయగర్వంతో చూశారు. "ఎగురుతే బాగుండును" అన్నాడు గోపీ, అనడమే తడవుగా రాకెట్ మెల్లిగా శబ్దం చేసుకుంటూ పైకిలేచింది. పిల్లలందరూ వింతగాచూస్తున్నారు. రాకెట్ పైకెగురుతూనేవుంది. బాబు గోపి క్రిందకు చూస్తున్నారు. క్రింద ఎలక్ట్రిక్ దీపాలు-మేడలు-ఇళ్లు-రైళ్లు కొన్నిచోట్ల మతాబులు — చిచ్చుబుడ్లు వెలుగులు కన్పిస్తున్నాయ్! ఒక్కొక్కసారి అవ్వాయి చువ్వలు రాకెట్ దాకా ఎగిరొస్తున్నాయ్! "అబ్బా! చాలా పైకొస్తున్నాయిరా! జువ్వలు...ఇంతకీ మనమెక్కడికెళ్తున్నాం? కొంపతీసి చంద్రలోకానిక్కాదుగదా!" అన్నాడు బాబు.

"చంద్రలోకానికేరా!" అన్నాడు గోపి. "నిజంగానా!" సంతోషంతో గంతులు వెయ్యబోయాడు బాబు. "పడిశావ్ లే! కూచో—పడ్తావ్!" అన్నాడుగోపి. క్రమంగా క్రింద ఏమున్నదీ కన్పించడంలేదు. రాకెట్ "రయ్! రయ్" మంటూ మేఘాల్లోంచి దూసుకుపోయింది. ఆలావెళ్లివెళ్లి చంద్ర




లోకంలో ఆగింది. ఆశ్చర్యంగా చూసాడు బాబు. నేచెప్పలా!" "అన్నట్టుచూసాడు గోపి. ఇంతలో నలుగురు 'మనుషులు' వంటివాళ్లు వచ్చారు.

"ఏయ్! ఎవరు మీరు?" అన్నాడు వాళ్లలో ఒకడు. "ఈమధ్యన రాకెట్ల గొడవెక్కువైంది. మొన్ననో రాకెట్టొచ్చి నా తలవెంట్రుకలకి తలిగింది. నేను కనక ఆ దెబ్బకు తట్టుకున్నాను. వెంటనే దాన్ని పట్టుకుని......నలిపేసాను" అన్నాడు యింకొకడు. ఒకళ్ల మొహం ఒకళ్లు చూసుకుకున్నారు— బాబు—గోపి.

"మా రాజుగారు మీకేం కీడు చేసారు? చక్కగా చల్లనివెన్నెలనిస్తుంటే—మీకు కష్టంగావుందా? మా రాజుగారి అందంచూసి మీకు ఏడుపుగా వుందా?" వేరొకడు బాణాల్లా ప్రశ్నలు వేశాడు.

"అయినా మంచిగా పోనే మామీద రాకెట్లతోటి స్పూత్నిక్కులతోటి-ఇంకేవీ లేవు కాబోలు—దాడిచేస్తారెందకయ్యా?" అన్నాడు మరొకడు.

"మంచివాడి కివి రోజులు కాదండి!" అన్నాడు గోపి మెల్లగా. బాబు భయంగా చూసాడు. "అది మీలోకంలో...అయినా మీరు రాకెట్లెందుకెయ్యాలి?" అన్నాడతను. "నేనెయ్యలేదండీ!" అన్నాడు గోపి — "నవ్వుకాపోతే యితను" అన్నాడతను బాబుకేసి వేలు చూపిస్తూ — "నేను కాదండి!" అన్నాడు బాబు వణుకుతూ — "నువ్వుకాపోతే మీ అన్నయ్య వచ్చు!" అన్నాడతను — ఇదెక్కడి గోలరా బాబూ! అనుకున్నాడు బాబు అలా అనుకుని "నాకు అన్నయ్యల్లేరండీ!" అన్నాడు — "లేకపోతే మీనాన్న గావచ్చు" అన్నాడతనే "మా నాన్న కాదండీ." అన్నాడు దాదాపు ఏడుస్తూన్నంతపని చేస్తూ— "మీనాన్న కాదూ... అయితే వీళ్లనాన్న న్నమాట." అన్నాడతను గోపివైపుచూసి — "మానాన్న-కూడా — కాదయ్యా" అన్నాడు విసుగ్గాగోపి. "మావూళ్లోవాళ్లే కాదసలు" అన్నాడు బాబు. "ఊరేంటి! మాదేశంవాళ్లే కాదు" అన్నాడు గోపి — "మీఊరివాళ్లు—దేశంవాళ్లు అవకపోతే మరొకదేశంవాళ్లు—అవునా?" అన్నాడతను. "అవును" అన్నాడు గోపీ "ఆఁ!

అలాచెప్పండి — ఎవళ్లో వాళ్ళు! — ముత్తం మీద మీ 'నరులే' గా రాకెట్ వేసింది!" అన్నాడు అతను. "ఆఁ! అవునయ్యా!" అన్నాడుగోపి- "అదే? ఎందుకు వెయ్యాలీ అంట?" అనడిగాడతను మళ్లీ - "వడిశినట్టే వుంది-యిదేదో 'గొర్రె - తోడేలు' కథలావుందిరా గోపీ! "అన్నాడు బాబు — "నిజఁవే!" అన్నాడుగోపీ. "ఏం! నాప్రశ్నకు సమాధానం చెప్పరేం?" అడిగాడు యిందాకటతను—గోపీ—బాబూ ఎంతకీమాట్లాడలేదు. "ఉంకండి! మీపని రాజుగారితోచెప్తా" అంటూ ఒకడు ప్రక్కనున్న గుమ్మంగుండా లోపలికెళ్లాడు. గోపీ_బాబూ కళ్ళు కలుపుకున్నారు. ఇంతలో 'చంద్రుడు' వచ్చాడు. ఆయన్ను చూడగానే గోపీ—బాబూ ఆశ్చర్యపోయారు. చంద్రుడు మనకు కన్పించేలాగ గుండ్రంగా వుంటాడని వాళ్ళనుకున్నారు. కాని మనిషిలాగే వున్నాడు!

"ఈయనే మా 'చంద్ర' మహారాజుగారు...మహారాజా! ఇదివరకల్లా ఈట్టి రాకెట్లో—స్పూత్నిక్కులో వచ్చేవి. ఈసారి 'నరులే' వచ్చేసారు" అన్నాడు ఇందాకటతను—"ఉట్టివేంటండీ! ఇదివరకు కోతులూ—కుక్కలూ వచ్చాయిగా?"అన్నాడు గోపీ. "అవి సరేనయ్యా! మిమ్మల్నెక్కడ భరించగలం...మహారాజా! వీళ్ళకి గట్టిగా బుద్ధిచెప్పి పంపించండి" అన్నాడతను."పోనీయవోయ్! కుర్రాళ్ళు నెమ్మదిగా(బుద్ధి) చెప్పాలిగాని!...ఒకసారి మనలోకాన్ని చూసిపోతారు! రండోయ్" అంటూ చంద్రుడు—బాబు- గోపీలను తీసికొని 'చంద్ర భవనం'లోకి వెళ్లాడు. ఆభవనాన్ని చూస్తూ చాలా




"న్న...న్న...న్న...నత్తిగా...మాట్లాడుతావేం?

చిత్రకారుడు—ఎ. రఘురామరెడ్డి (మద్రాసు)

ఆశ్చర్యపోయి— ఆనందంలోపడిపోయి "ఇలా రండి! కూర్చోండి!" అని చంద్రుడు పిల్చేవఁకూ పడ్డ యిద్దరూ లేవలేకపోయారు! ఇద్దరూ ఒకే సింహాసనంమీద కూర్చున్నారు—వణుకుతూ. "అబ్బ- ఇంత చల్లగా వుందేఁవిట్రా!" అన్నాడు బాబు. "చంద్రుడు చల్లనివాడు కదురా!" అన్నాడు గోపీ. ఇద్దరూ ముడిచిపెట్టుకుని దగ్గరగా కూర్చున్నారు. చంద్రుడు వీళ్ళస్థితి గ్రహించి—ఒకసేవకుణ్ని పిలిచి అగ్నిదేవుణ్ని పిల్చుకురమ్మన్నాడు. కొంచెం సేపట్లో అగ్నిదేవుడు వచ్చాడు. అగ్నిదేవుడు రాగానే తీవ్రమైన వేడిపుట్టింది. గోపీ-బాబులకు చలిపోయి- చెమటలు పట్టడం మొదలెట్టాయి! ఈసారి చంద్రుడు వీళ్ళని చూసి నవ్వి "మీ మానవులంతా అతి సుకుమారులు..."అని "అగ్నిదేవా! నువ్వు చాలినంత దూరంలో వుండు!"అన్నాడు. అగ్నిదేవుడు అవసరమైన దూరంలో నిలబడ్డాడు. ఇప్పుడు గోపీ బాబులకు వెచ్చగా హాయిగా వుంది.

"మీ పేర్లేఁవిటి?" అనడిగాడు చంద్రుడు—"నాపేరు గోపి - ఇతని పేరు బాబు" అన్నాడు గోపి— "బాబా! నాన్నా!!" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రుడు—"బాబు ముద్దుపేరండీ! అసలు పేరు "ఆరుద్ర కుమార్"అన్నాడు గోపీ—"ఓహో. ముద్దు పేరెందుకూ?" అన్నాడు చంద్రుడు"ఎందుకేఁవిటి!ముద్దుకండీ" అన్నాడు గోపీ-"విచిత్రంగావుందే!" అన్నాడు చంద్రుడు-బాబుకు ఉడుకుమోత్తనం వచ్చింది. "విచిత్రమేవుంది! నాకింకా ఒక్కటే! మీకో! బోల్డు!! ముద్దుపేర్లు !!!" అన్నాడు (బాబు)- "నాకా! ముద్దుపేర్లు!!" అంటూఆశ్చర్యపోయాడు చంద్రుడు- "ఔను! 'జాబిల్లి! చందమామా! 'దాయ్‌దాయి!!' మీ ముద్దుపేర్లు కాదూ?" అన్నాడు బాబు- "భలే!

"ఘుటికుడివే!!" అంటూ నవ్వాడు చంద్రుడు. 'మరేమనుకున్నారు' అన్నట్టుగా చూశాడు బాబు "అదిసరే గానీ అబ్బాయిలూ! "ఇంతకీ మీరు — అదే మీ మానవులు 'మాలోకం' లోకి రాకెట్లు-స్పూత్నిక్కులూ పంపుతున్నారెందుకు?" అనడిగాడు చంద్రుడు. అంతా 'మాలోకంలావుంది' బాబుకి. "ఏమీలేదు ప్రపంచంలో చావులుతక్కువై-, పెళ్లిళ్లు కాకుండానే పుట్టుక లెక్కువై పోయాయ్! దాన్తో జనాభా అడ్డంగానూ- నిలువుగానూ పెరిగి పోతోంది. ఇంక కొంతకాలం పోతే భూలోకంలో చోటు చాలదు. అందుకని ఇప్పటినుంచే ఈలోకంలో యాం వైనా చోటుందేమోనని వెదుకుతున్నారు" అన్నాడు గోపీ. 'ఊహూఁ' అంటూ చంద్రుడు తల పంకించి ఏదో ఆలోచించటం మొదలెట్టాడు. "బాగానే వుంది!" అన్నాడు దూరంగా వుండి శ్రద్ధగా వింటున్న అగ్నిదేవుడు. "మరి అగ్నిదేవుడు ఇక్కడుండిపోతే-ప్రజలకు అగ్నిఎలావస్తుంది" అని అనుమానం తీర్చుకోడానికి అడిగాడు—బాబు. "అదా! రేపు దీపావళికదూ! అందరూ దీపావళి సరంజామా కొనుక్కొని దాచుకొని వుంటారు. అగ్నిదేవుణ్ని విచ్చలవిడిగా వదిలేస్తే ఆ బాణసంచాలవల్ల అగ్నిప్రమాదం సంభవించవచ్చు" అన్నాడు చంద్రుడు- "ఔను! అదీ నిజమే" అంటూ బలపర్చాడు గోపీ.

బాబు ఇటూ-అటూ చూసి — "అన్నట్టు ఇంద్రుడి కొలువులో వున్నట్టు — చంద్రుడి కొలువులో నాట్యకత్తెలు లేరేరా?" అంటూ గోపీనడిగాడు- "చంద్రుడాకాశం మీద తిరుగుతుండలి కదురా!



అందుకని నాట్యకత్తెలుండరు?" అన్నాడు గోపి పెద్ద తెలుసున్నవాడిలా. బాబు చంద్రుడితో "అన్నట్టు మీరు ఆకాశంమీద తిరగడానికెళ్లరూ? మాతో కబుర్లు చెబుతూ మరచిపోయారనుకుంటా!" అన్నాడు- గోపీ ఏదో

చింకిగుడ్డలతో ఉన్న బిచ్చగాడు రోడ్డుమీద పోయే ధనికుని "బాబూ బిచ్చం" అని అర్థించాడు.

ధనికుడు—"నాతోరా, నీకు మంచిగుడ్డ లిస్తాను."

బిచ్చగాడు—"మీ గుడ్డలు నాకువద్దు బాబూ! నాలుగు పైసలిప్పించండి."

ధనికుడు—"నీకు అత్యాశ లేదు, ఇంద తీసుకో" అని అర్థ రూపాయి ఇచ్చాడు.

బిచ్చగాడు — "అత్యాశలేక గాదు బాబూ మంచిగుడ్డలు వేసుకుంటే బిచ్చం ఎవరిస్తారండీ?"

ఎమ్. రంగస్వామి ముదిరాజు
(బెంగుళూరు)

అనబోయి మానేసాడు,- "ఇవ్వాళ చతుర్దశి కదూ!" అన్నాడు చంద్రుడు- "ఔను! నరకచతుర్దశి" అన్నాడు బాబు. "అంచేత తెల్లవారేముందు చాలా కొద్ది సేపు మాత్రంఆకాశంమీద తిరుగుతాను" అన్నాడు చంద్రుడు. ఈసారి గోపీ తను చెప్పబోయింది చెప్పాడు "మాసోషల్ ...సాంఘికశాస్త్రంలో భూమి తిరుగుతుందని చదువుకున్నామండీ...కాని మీరేమో 'మేమే తిరుగుతున్నా, మంటున్నారు ..." అని—ఫకాల్న నవ్వాడు! ఎవరు? చంద్రుడు!! నవ్వి "భూకంపం అంటే తెల్సా! భూమి కదుల్తుందన్నమాట' అదిక్షణంలో జరిగి పోతుంది." అన్నాడు- "ఔను! మొన్న నదేదో దేశంలో వచ్చిందండి! భూకంపం!! దాన్తో పెద్దపెద్ద భవనాలు, మేడలు, మిద్దెలు, ఇళ్లూ, మిల్లులూ ఇంకా బోల్డు నాశనమై పోయాయండి. ప్రాణనష్టంకూడా కల్గిందండి. అన్నాడు గోపి. "ఔనా! ఒక క్షణం భూమికదుల్తేనే అంతనష్టం సంభవించిందికదా! — మరి మా గ్రహాలు చుట్టూ తిరగడం ప్రారంభిస్తే ప్రపంచం అంతా నాశనమైపోదూ!" అన్నాడు చంద్రుడు. 'నిజమే కాబోలు' అనుకున్నారు బాబూ, గోపీ.

"ఇంకోవిషయమండి! సూర్యుడి కిరణాలు మీమీదపడి— వెన్నెలనిచ్చే ప్రభావం మీకు కల్గుతుందని ఆ శాస్త్రంలోనే చదువుకున్నామండి. మరి సూర్యుడు మీకన్న గొప్పవాడా?" అనడిగాడు గోపీ. చంద్రుడొకసారి బుర్ర ఝాడించాడు. "ఆఁ! గొప్పకేముంది... నా మహిమవల్ల నేను రోజుకోవిధంగా మారుతుంటాను. మరి సూర్యుడో! ఎప్పుడూ గుండ్రంగానే వుంటాడు" అన్నాడు చంద్రుడు. "మరే! ఒక్కొక్కసారి సన్నగా కొడవలిలాగ వుండి పోనుపోను గుండ్రంగా మారుతారు. ఆ తర్వాత రానురాను గుండ్రం నుండి సన్నగా కొడవలిలా మారుతారు" అన్నాడు బాబు.

ఈ అవకాశం జారవిడుచుకోకూడదనుకున్నాడు— చంద్రుడు-

"సూర్యుడు పగలే కన్పిస్తాడు!— రాత్రి కనిపించడు!! కనిపించలేడు!!! మరి నేనో! అప్పుడప్పుడు రాత్రుళ్లే కాకుండా పగలుకూడా కన్పిస్తూంటాను," అన్నాడు. బాబు గోపి బుర్రలూపారు. "ఇంకొక్కటి! పగలు సూర్యుడున్నా, లేకపోయినా వెల్తురు వస్తుంది. కాని రాత్రి నేను లేకపోతే చీకటేగా!" ఈసారి గర్వంగా అన్నాడు—చంద్రుడు—మళ్లీ రెండు బుర్రలూ వూగాయ్!—"మరొక్కటి! సూర్యుడెప్పుడూ కోపంగా (తీక్షణంగా) వుంటాడు! నేనో! ఎప్పుడూ శాంతంగావుంటాను. చూడండి! మీ రెప్పుడైనా సూర్యుడిముఖంలోకి తదేకంగా చూసారా? చూళ్ళేరసలు! ఎందుకని? సూర్యుడు కోపంగా వుంటాడని చెప్పాగా! నా ముఖంలోకి ఎంతసేపైనా చూసి ఆనందించవచ్చు" అన్నాడు, మీసాలున్నాయో లేవో! గాని ఆ వుండే చోటికిమాత్రం చంద్రుడి ఎడం చెయ్యి గర్వంగా లేచింది. ఈ సారి బాబు బుర్ర మామూలుగా వూగినా గోపీబుర్రమాత్రం హేళనగా వూగింది.

"వేరొక్కటి! మంచివాటిని, అందమైనవాటిని పోల్చవలసినపుడు వాటిని నాతో పోలుస్తుంటారు. కవులు— రచయితలూను.., అదెలాగంటారా!?—ఒక అందమైన ఆడదాని ముఖాన్ని 'చంద్రబింబ' మంటారు, అలానే ఒకరి కీర్తి ప్రతిష్టలుగాని—ఏదైనాసరే మంచిగుణం వృద్ధిచెందుతూవుంటే 'ఆహా! శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానమవుతోంది' అంటారు" అన్నాడు చంద్రుడు—"రైటే." అన్నాడు బాబు—"ఇంకేవిటి?" అన్నాడు గోపి.

"నన్ను హిందువులేకాకుండా—మహమ్మదీయులుకూడా కొలుస్తారు" అన్నాడు చంద్రుడు. "ఓ"నన్నాడు బాబు. "సూర్యుడివల్ల ప్రమాదాలు కూడా వున్నాయ్! వేసంకాలంలో బాగా ఎక్కువ! నీరెండి పోతుంది. చెట్లు చేమలూ ఎండిపోతాయ్! ఏదైనా అంటుకుందంటే తొందరగా ఆరదు. ఎండవేడికి చాలామంది 'వడ' గొట్టి 'సోష'వచ్చి పడిపోతారు. కొంతమంది చచ్చిపోతారు! నావల్ల అలాంటి ప్రమాదాలు లేవు..." అన్నాడు చంద్రుడు.

గోపీ ఉండబట్టలేక అనేశాడు "మీలోకంలోకూడా సొంతడబ్బా వాయించుకునేవాళ్లున్నారన్న మాట!" అని...దాన్తో! "ఆఁయ్!" అంటూ కోపంగా మీదకు రాబోయాడు చంద్రుడు. దీన్తో గోపీ, బాబూ సింహాసనంమీంచి క్రింద పడబోయారు...ఇక్కడ ఇంట్లో నిద్రపోతున్న బాబుకూడ మంచం మీంచి క్రిందపడబోయాడు...అదే సమయానికి అక్కడకు బాబుని లేపడానికి వచ్చిన బాబు తల్లి పడబోతున్న బాబును పట్టుకుంది. తర్వాత "లే...లే...బాబూ లే" అంటూ లేపింది—బాబుకి నలతగా మెలుకువ వచ్చింది. "అబ్బ! ఉండమ్మా! మంచి కలొస్తోంది..." అంటూ గారంచేసాడు కళ్లు నలుపుకుంటూ. "కలా లేదు! నీ తలా లేదు!! ముందులేచి దొడ్లోకి నడు! లేకపోతే తెల్లారేసరికి పక్కంతా తడుపుతావ్." అంటూ రెక్కపట్టుకు లేపింది. దాన్తో బాబుకి నిద్రమత్తు వదిలింది. కంగరిగింది.

అంతా కల! అంతా వుట్టిదే!!

---

బీచిలో ఇద్దరు స్నేహితులు కూర్చుని ఉండగా...

ఒకడు—ఒరేయ్. మనగదికి తాళం వేశానోలేదో అనుమానంగా ఉందిరా. దొంగలు...

రెండవవాడు—మనం ఇద్దరం ఇక్కడేఉండగా ఇంకా దొంగల భయమెందుకురా నీకు?

'కృష్ణవేణిమైథిలి' (హైదరాబాదు)

---

## "ప్రాతిపదిక విద్య"

### డి. పోచెట్టి

బుల్లి బుల్లి బుజ్జాయిల్లార
చిట్టి చిట్టి చిన్నాన్నల్లార
ప్రాతిపదిక విద్య మీరు
ప్రాకటముగ తెలిసికొని
పంతుళ్లకు పేరుతెచ్చి
ప్రతిష్ఠతను పెంచుడీ.
అ ఆలు ఆటతోని
కఖాలు కర్మతోని
పఫాలు పాటతోని
గట్టిగాను నేర్వుడీ.
శషాలు షడ్వర్గములను
జఝాలు జయించెనని
ముక్కు మూసుకొని మునులు
ముక్కువతో దెలిపినారు
జీవితములో నేర్పు విద్య
జీవితాన్ని దిద్దు విద్య
భావి పౌరుని జేయు విద్య
భాగ్యమ్మును ఇచ్చు విద్య
ఆటలోనె పని కలదు
పనిలోనే ఆటకలదు
పనితోనే నేర్పు విద్య
ఫలితమ్మును ఇచ్చును.

# చాటు కథామంజరి

## శ్రీనాథమహాకవి

(గత వారం తరువాయి)

శ్రీనాథ మహాకవిలో కవితా చమత్కృతి కన్న హాస్యయుక్తి ప్రయుక్తి గొప్పవి. ఆయన వెలయించిన వేనవేల చాటు ధారలలో ఈ హాస్యరసము పరవళ్ళు త్రొక్కుచున్నది. రేనాటికి శ్రీనాథుడు వెళ్ళినప్పుడు అక్కడి ఎఱ్ఱజొన్నల సంకటి కూడు తినలేక తన ఇష్టదైవమగు శివునుద్దేశించి——

గరళము మ్రింగితి నంచున్
పురహర గర్వింపబోకు పోపో పో నీ
బిరుదింక గానవచ్చెడి
మెరసెడి రేనాటి జొన్న మెతుకులు తినుమీ

అని గేలిచేసినాడు.

గురజాలసీమకు వెళ్ళినప్పుడు పులిపాడనే గ్రామానికి శ్రీనాథుడు పోయి అక్కడి శేషయ్య అను కరణముతోను, హనుమయ్య అను కాపుతోను, పుల్లయ్య అను రెడ్డితోను, కలహించి——

ఊరు వ్యాఘ్రపురగర మురగంబు కరణంబు
కాపు కపివరుండు రసపు నేడు
గుంపుగాగ నిచట గురిజాలసీమలో
నోగులెల్లగూడి రొక చోట

అని వెక్కిరించినాడు.

కారెముపూడిపల్నాటిలో ప్రసిద్ధి చెందిన గ్రామము. పల్నాటి యుద్ధ చరిత్రలో కారెమపూడి ప్రసిద్ధి తెలియనివారు లేరు.

వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుడు కళ్ళిపోతురా
జారయకాలభైరవుడు అ కమశకియె అన్నపూర్ణయున్
గేరెడు గంగధార మడుగే మణికర్ణికగా చెలంగునీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి వారికిన్.

ఇక దక్షిణ దేశమునకు వెళ్ళినప్పుడు శ్రీనాథుడు అరవవారి ఆచారములను ఆకారములను హేళన చేసినాడు.

తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిరియపుచారు
చెవులలో పొగవెళ్ళి చెమ్మరేగి
పలుతెరగులతోడ పచ్చళ్లు చవిగొన్న
బ్రహ్మరంధముదాక పారునావ-
అవిశాకు వేచిన ఆర్నెల్లు నసిలేదు-
పరిమెళమెంచిన పండ్లు సొగచు-
వేపాకు నెండించి వేసిన పొళ్లను

---

## బెజవాడ సదానందం

గంచానగాంచిన గ్రక్కువచ్చు-
అరవ వారింటి విందెల్ల నాగడంబు
చెపవతురు తమతీరు సిగ్గులేక
చూడవలెనెను ద్రావిళ్ల కీడుమేళ్లు-

అరవపిళ్ళ శ్రీనాథుని దృష్టిలో కోతిపిల్ల.

మేతగరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబున పందిపిల్ల
ఎల్ల పనులను చెరుపంగ పిల్లి పిల్ల
అదమున కోతిపిల్ల ఈ అరవపిల్ల'

బంధుస్నేహితులతో సల్లాపములు, ఎత్తిపొడుపులు, వాదోపవాదములు, అన్నియు శ్రీనాథుని కవితాప్రవాహానికి ఉపాయనములైన ఉపనదులే. అందుకు రెండు మచ్చుతునకలు.

మా కలిదిండి కామయ కుమారుడున్నిట తండ్రివైఖరే
గాక తదన్యు డెట్లగును? గాడిదకున్ తురగంబుపుట్టునే
చేకొని కొంకి నక్కకును సింగము పుట్టునె మాలకాకికిం
కోకిల పుట్టునే చిరుతకుక్కకు మత్తగజంబు పుట్టునే.

మంచి భోజనప్రియుడుగా తన బావమఱిది రామయ మంత్రిని గూర్చి——

గ్రామము చేతనుండి పరికల్పిత ధాన్యము నింటనుండి శ్రీ
రామ కటాక్షవీక్షణపరంపర చేగడతేరగాక మా రామయమంత్రి భోజన పరాక్రమమేమని చెప్పవచ్చు? నా
స్వామి యెఱుంగు తత్కబళచాతురితాళఫలప్రమాణముల్

అనిన రసమాడి ముక్కోటి ఆంధ్రులను శాశ్వతముగా నవ్వించినాడు శ్రీనాథుడు.

శ్రీనాథ మహాకవి తెలుగు వెలుగు; ఆ వెలుగునకు నీడలేదు. అది శాశ్వతమైనది. చిన్ననాటినుండి శ్రీనాథుని గూర్చినవి, శ్రీనాథుడు కూర్చినవి యెన్నో పద్యములు నేర్చుకొనదగియున్నవి. పిన్నలకు వెన్నముద్దలు, పెద్దలకు తగు బుద్ధులు, శ్రీనాథుడు తన కావ్యములలో ఎన్నో అందించాడు.

అమ్మను గూర్చి శ్రీనాథుని యీ పద్యము ఆయనవలెనే చావులేనిది.

అరుణగభస్తిబింబ ముదయాద్రి పయిం బొడతేర గిన్నెలో
పెరుగును వంటకంబు వడపిందెలునుం గుడువంగబెట్టి ని
ర్భరకరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే
హరహర! ఎవ్వరింక కడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్.

పెద్దవారయిన కొలది బాలకులు శ్రీనాథుని కావ్య రసధారలు సేవించి తరించవలసి ఉన్నది. అందుకు ముందు ఈ చాటుధారలు చవిగొనుట ఎంతేని అవసరము కాదా!

# హరివంశము

## సాందీపని పర్వము—1

యజ్ఞరక్షకుడును యజ్ఞవిధ్వంసియు
నై లోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు గంధర్వదర్పవి
దమనుండు నై లీలఁ దనరువారు
భువనసంభర్తయు భువనసంహర్తయు
నన నాత్మగుణకృత్యు లైనవారు
భూధరోద్ధారియు భూధరావాసియు
నగుట నిత్యప్రీతి నెగడువారు
విషధిజాత వెలుగు రత్నవిషము లురము
గప్పుకంఠము గై సేయ నొప్పువారు
భుజగశయనుండు భుజగవిభూషణుఁడు
నెప్పుడు గరుణతో వరదు లయ్యెదరు మాకు

—హరివంశము.

ఒక్క రోజున వసుదేవుడు దేవకీదేవితో ఇట్లా అన్నాడు: "దేవకీ! పుత్రులకు ఉపనయనము జరిపించవలయునని యున్నది. జననం మొదలుగా గొల్లలలో పెరిగినవారు. సంస్కారము, ఆచారము, ఘన విద్యాగ్రహణము లేక అడవులలో తిరిగినారు. వారు ఇప్పుడు క్షత్రియులా! విద్యావంతులా! సంస్కారమును పొందినవారా! ఉపనయనము జరుగక వారికి విద్యను అభ్యసించడం ఎట్లా వలనుపడుతుంది. దేవకీ! ఆలోచించుము."

దేవకి అన్నది: స్వామి! అక్కగారు వున్నది. ఆమె నాకు పెద్ద. ఇకను నందుడు ఆదిగాగల ఆభీరులు వున్నారు. యశోద వున్నది. ప్రభూ! పుత్రులకు నేను తల్లినా! స్వామి! యశోద తల్లి! అక్కగారు, రోహిణీదేవి గురువు. ఆ యశోద పుత్రులను పెంచినది. ఆ రోహిణీ అమ్మగారు శిక్షించినది. వారితో మాట్లాడవలయునుగదా! అదియును గాక గర్గుడు ఆదిగాగల పురోహిత వర్గము, నా తండ్రి ఉగ్రసేన మహారాజు, అంధకాది యదువృద్ధులు, అక్రూరాది సామంతవర్గము, దేవభాగాది బంధువర్గము, ఇంతమంది వున్నారు. మరదులు దేవభాగులు ఇంతవరకును ఉన్న కష్టమును చూచి ఉద్ధవునిగూడా, అట్లా వదలి వేసినారు. వానికిగూడా ఉపనయనము జరుపవలెనుగదా! తండ్రి ఉద్ధవునకు రామకృష్ణులనిన అది ప్రేమయా! భక్తియా! అదే నాకు ఆశ్చర్యముగా వున్నది. మరి స్వామి! కులస్వామి వృష్ణికనిష్ఠ నందనుడు శినియు వున్నారు. ఆయన మనకు పెద్ద. వారి తనయులు సత్యకులు. వారును తమకు సోదరులు. వారి బిడ్డడు సాత్యకి ఉన్నాడు. వాడు మన పిల్లలకన్న చిన్నవాడుగదా! అయినా ఏమి? వానికిగూడ ఇప్పుడే ఉపనయనము తలపెట్టిన బాగుండునుగదా!

వసుదేవునకు నవ్వు వచ్చినది. "దేవకీ! ఇంకను ఎవరైన యదుకుమారులు ఉపనయనార్హులు వుండినారేమో చూచినావా?" అన్నాడు. దేవకికి నవ్వు వచ్చినది. ఆనందమును కలిగినది. తాను ఇట్లా మాటలాడుకొని ఎన్నినాళ్లయినది! తన నాధుడు తనతో ఇట్లా పరిహాసికములాడిన రోజులు ఆమెకు నిజముగా ఇప్పుడు జ్ఞాపకమే లేవు. అయినను తమ జీవితములో ఎన్నో మార్పులు వచ్చినవి. ఎంత దుఃఖము, ఎంత ఆనందము, ఎంత నిర్వేదము, ఎంతటి వేదన, తమ జీవితములను ఆక్రమించుకొన్నది! ఆ దినములు ఇప్పుడు గడిచిపోయినవి. మేఘములు తొలగగా, ఆకాశము నిర్మలమై ప్రకాశించినట్లు ఆ దంపతుల మనము ఇప్పుడు స్వచ్ఛములు, విశదములు అయివున్నవి. వారి హృదయములు వీతశంకములయి, పుష్కర ప్రకర్షను ప్రకటించుచున్నవి. పుష్కరనేత్రుడైన శ్రీకృష్ణదేవుడు ఇప్పుడు వారికి అనుదినము ఆనందసంధాయి అగుచున్నాడు. శరీరములు మాత్రము వేరై, ఆత్మలు ఒక్కటే అయిన రామకృష్ణుల దర్శనము వారికి సర్వదుఃఖనివారకముగా వున్నది. వనుకటి కష్టములను, ఇప్పటి సుఖములను తలచుకొని దేవకి ఆనందబాష్పములనో దుఃఖాశ్రువులనో, నేత్రములనుండు వలలినది. వసుదేవుడు ఆమెను ఆ స్థితిలో చూచి ఆశ్చర్యపోయినాడు. "దేవకీ! కష్టములు తరంగములుగా జీవితము దుఃఖమయసాగరముగా నున్న దినములలోగూడా లేని కన్నీరు, ఇప్పుడు ఇది యేమి?" అన్నాడు. ఆమె స్థిమితమైన ప్రసన్నదృష్టితో తన ఆత్మనాధుని తిలకించినది. కొన్ని జన్మల ప్రేమ, కొన్ని జన్మల సాహచర్యము, కొన్ని జన్మల దాంపత్య జీవిత మాధుర్యము ఆ చూపులలో వున్నదో! వసుదేవుడనినాడు. "దేవకీ! నేను రోహిణి మేడలకు పోయివస్తాను. ఆమె వ్యవహారదక్షురాలు. ఆమె అభిప్రాయమేమో తెలుసుకొనివస్తాను."

దేవకి "కంచుకీ" అని పిలచినది. కంచుకివచ్చినాడు. "కంచుకీ సూతుని పిలిచి రథమును ఆయత్తము చేయుమను. స్వామి రోహిణీదేవి మేడలకు బయలుదేరుతున్నారు."

వసుదేవుడు రథము నధిరోహించినాడు. కింకిణీ ఘణఘణక్వాణనంగా, పతాకాచలనంగా రథము సాగుతున్నది. వసుదేవుని మనస్సు రామకృష్ణులమీదకు ప్రసరించినది. వారు తరచు తనకు కన్పించుట లేదు. ఉద్ధవునితో ఏవో మంతనము చేస్తూ, అక్రూరునితో మాట్లాడుతూ, ఉగ్రసేన మహారాజునకు ఉత్సాహమును కల్పన చేస్తూ, అంధకునితో నవ్వుతూ, శినిప్రభృతి యదువృద్ధులతో కలిసి తిరుగుతూ, సాత్యకితో ఆడుతూ కాలం గడుపుతున్నారు. అంధకుడు చెప్పగా తాను వినిన సంగతులు కొన్ని అద్భుతముగా ఉన్నవి. రామకృష్ణులు ప్రతిదినము మధురను చుట్టివున్న కోటగోడలను,

హరిలీల శివలీల

# హరి వంశము

అగడులను పరిశీలిస్తున్నారు. మహాదండనాయకులకు కూడా అవగాహనము కాని దుర్గరక్షణానిర్మాణ, దుర్గరహస్యములను గూర్చి ఆ అన్నదమ్ములు చర్చలు జరుపుతున్నారు. ఇప్పుడు మధురకు వచ్చిన భయమేమో తనకు అర్థము కాలేదు.

అంతలో వసుదేవునకు ఒక్క ఆలోచన వచ్చినది. అది రాగా ఆయన అద్భుతాక్రాంతుడయిపోయినాడు. కంసుని భార్యలు, ఆ స్త్రీప్రాసులు, జరాసంధ మాగధుని కూతుండ్రు, శ్రీకృష్ణ దేవునితో "తండ్రి! మేము పుట్టినింటికి పోయివస్తాము" అన్నారు. మరి మాగధుడు వారిని రమ్మనలేదు. తాను వచ్చి కూతుండ్రను చూడలేదు. ఇప్పుడు ఆ కూతుండ్రే తండ్రివద్దకు పోయినారు. మాగధుడు మధుర మీద ధ్వజము ఎత్తడుగదా! వసుదేవునకు ఈ ఆలోచన రాగా భయము వేసినది. ఆయన ఆ భయమును త్రోసివేసినాడు. ఇప్పుడు సకల యదువృష్ణి భోజ అంధక కౌద్ర గణ జన్యలోకం అంతా ఒక్క త్రాటి మీద వున్నది. వీరిని ఇప్పుడు తొకడము మాటలతో పనికాదు. కంసునియందు భయమువలననో, బంధుత్వమువలననో, మాగధుడు మధురమీదకు రాలేదు. ఇప్పుడు రాడని నమ్మకమేమి? వాడు ఉద్ధతుడు. ఇంకను ఉద్ధతులయిన రాజులు ఉన్నారు. వారిని మాగధుడు ఆకట్టుకొని మిత్రమండలమును నిర్మించుకొన్నచో!

రథము కదులుతున్నది. వసుదేవుని ఆలోచనలకు వలెను, ఒకప్పుడు మందంగా, ఒకప్పుడు వేగంగా నడుస్తున్నది. సూతుడు తన ప్రభువు మనస్సును ఎరిగి, వయస్సును చూచి రథాన్ని పోనిస్తున్నాడు. రోహిణీదేవి మందిరములు విశదములయిన రామకృష్ణుల ఆలోచనలను పోలి సుందరములై, కృతిమంతములై వసుదేవుని దర్శనాధ్యంలో ఒదిగినవి. సారథి రథమును వాకిటిలో ఆపినాడు. వసుదేవుడు రథము అవరోహణము చేసి, రోహిణీ మందిరములో ప్రవేశించినాడు. మందిరములను కలయ తిరిగినాడు. ఆమె కన్పించలేదు. అంతర్వంశికులను పిలిచి అడిగినాడు. వారును ఏమియు చెప్పలేక పోయినారు.

"రోహిణి ఎక్కడికి వెళ్ళివుంటుంది?" ఆ ప్రశ్నకు ఎవ్వరును ఏమియు జవాబు చెప్పలేదు. కంచుకి మాత్రము ఇట్లా అనినాడు: "ప్రభు! ప్రభువులు, రామకృష్ణులు వచ్చినారు. వారును, మహారాణియు కలిసి, రథములో బయలుదేరి ఎక్కడికో వెళ్లినారు."

వసు: ఎక్కడికి వెళినారు?

......................

వసుదేవునకు ఏమియు తోచలేదు, సరే వారు తిరిగి వచ్చేడిలోగా నందునితో మాట్లాడి రావచ్చు ననుకున్నాడు వసుదేవుడు.

తిరిగీ రథము కదిలినది. నందుని గృహము నగరమునకు చివరగా, యమునకు సమీపములో నున్నది. ఆ గృహమునకు తాను ఎన్నో సారులు వెళ్ళివున్నాడు. కాని అందులో రెండు తడవలు తాను పోయి వచ్చుటయే ఆయన మనస్సులో నిల్చిపోయినది. శ్రీకృష్ణ దేవుడు జన్మించిన రాత్రి, ఆ బాలుడు భగవంతుడు తన్ను తీసికొని పోయి యశోద ప్రక్కలో పరుండబెట్టి, ఆమె ప్రక్కలో వున్న ఆడుబిడ్డను తెచ్చి దేవకికి ఈయమని ఆజ్ఞాపించినాడు. తాను ఆ ఆజ్ఞను పాలించినాడు. తర్వాత నందుని హెచ్చరించుటకు ఆ మరునాడే తాను ఆ ఇంటికి వెళ్ళినాడు. ఆ దినము తనకు మరుపు రాదు.

నందుని ఇంటిలో అంతయు నవ్వులుగా నున్నది. బయటికి ఇంత దూరమునకుగూడా ఆ నవ్వులు వినిపించుచున్నవి. వసుదేవుడు ఏమీ అనుకున్నాడు. రథము వాకిటిలో ఆగగా నందుడు ఎవరువచ్చినారా ? అని బయటికి వచ్చినాడు. “వసుదేవస్వామియా? స్వామి! రండి ! రండి. తండ్రులును, రోహిణీ తల్లియు ఇప్పుడే వచ్చినారు. ఆ నవ్వులు విన్నారుగదా ! యశోదను ఉడికించుచున్నారు. అది యేమో అమాయకురాలు. బిడ్డలేమో ! స్వామి ! రాచబిడ్డలు !”

“అవును ! అవును ! వారు రాచబిడ్డలు” యశోద పసిబిడ్డ ! అవునా ! నంద !”

“తల్లి ! తల్లి ! మీరుఎట్లాఅంటే అట్లా” నందుడుగల్లునవ్వినాడు.

వసుదేవుడు రోహిణిని చూచి విచిత్ర మందహాసం చేసినాడు. “రోహిణి ! నీవు ఎలాగునసైనను పౌరవివి. బాహ్లీకుని బిడ్డవు. మాకు వారి రాజసములు ఎక్కడనుండి వస్తాయి !”

“అవును ! స్వామి ! అవును. మీరు రాజసం లేనివారు. ఈ బిడ్డలను చూడండి. ఆ రాజసం లేమి ఏమిటో తెలుస్తుంది.

వసుదేవుడు లోపలకు పోయినాడు. రోహిణియు, నందుడును గూడ ఆయనతో లోపలకు వచ్చినారు. రామకృష్ణులు వాల్చిన మంచములమీద కూర్చున్నవారు తండ్రి రాగా లేచి వినమితశిరస్కులై నమస్కరించినారు. ఆ తండ్రి ఆ పుత్రులను చూచుకొన్న చూపే చూపు ! వారు మధురకు వచ్చిన అనంతరము వారిని తాను ఎన్నిసార్లు చూడలేదు ! కాని ప్రతిదినము వారిని చూడగా క్రొత్త అవుతూనే వుంటున్నది. వారు తనకు నమస్కరించినారు. నమస్కరించగా, వసుదేవుడు వారిని దీవించినాడు. “తండ్రి ! రామ! తండ్రి! కృష్ణ! ఈ రోహిణి యేమయ్యా, ఇట్లా మాట్లాడుతున్నది ! తండ్రులకు రాజసములేమిటి! వినయధుర్యులు ! ఆ ! యశోద యేది ! అందరు వుండగా ఒక మాట మాటలాడి పోదామని వచ్చినాను” అనినాడు.

రోహిణి అన్నది : “స్వామి తాము వచ్చినారా ! దేవకి, దేవతోపమ పంపినదా !”

వసు : రోహిణి ! రోహిణి ! నీవు అన్న అందుకే నాకు గౌరవము, నీవు ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టగలదానవు. సరే ! తల్లి ! యశోద ! ఇట్లా రా. తల్లి ! అట్లా కూర్చో! మేము కూర్చుండలేదని సంకోచిస్తున్నావా ? సరే ! రోహిణి ! ఆ ఆసనం ఇట్లా తీసుకొని రా! అని, నేను కూర్చున్నాను. మీరుగూడా కూర్చోండి. తండ్రులు! మీరు ఆ మంచంమీద కూర్చోండి. నంద ! ప్రియమిత్రమా ! నువ్వు గూడా కూర్చో.

అని వసుదేవుడు ఆగినాడు. ఆగి కొంచెముసేపు యశోద దిక్కై చూచి ఇట్లా అనినాడు : యశోద ! తల్లి ! నీకు బాలకృష్ణుని జన్మదినం జ్ఞాపకమా ! తల్లీ ! ఎవరికి జ్ఞాపకము వుండదు ! నందా ! యశోద అప్పుడు ఒడలు తెలియని స్థితిలో నున్నది. భగవంతుని మాయ కప్పినదిపోలె, నగరం అంతా మాటు మణిగిపోయి వుంది. ఈ ఇంటిలో ఒక్కరుగూడా మెలకువగా వున్నవారు లేరు. ఇంటి తలుపులు తెరచి వున్నవి. నేను బిడ్డను పొత్తిళ్ళలో పెట్టుకొని వచ్చినాను. యశోద అప్పటికే ఆడుశిశువును కనివున్నది. ఈ బిడ్డను ఇక్కడ యశోద ప్రక్కలోవుంచి, ఆ పుట్టిన ఆడశిశువును చేతులలోకి తీసికొన్నాను. తీసుకొనిపోయి దేవకి చేతులలో పెట్టినాను. ఆ బిడ్డ యేమి బిడ్డ ! నందా ! ఆమె దేవత. ఆమె యోగమాయ. ఆమె కౌశికి. ఆమె బలరామ సహోదరి. ఇప్పుడు ఆమె వింధ్యవాసిని. సర్వయాదవులకు ఆరాధ్య దేవత. యశోద! నీవు ఆమె




“మీలో చాలామంది సరిగా క్లాసులకు రావడంలేదని నాకు తెలిసింది”

చిత్రకారుడు—సి. తులసిరావు (బందరు)

తల్లివి. నీవు సామాన్యురాలవు కాదమ్మా ! నా బిడ్డను నీ బిడ్డనువలె సాకినావు. సర్వలోకములకు గౌరవస్థానీయురాలవైనావు. నంద ! అప్పుడు నీకు ఈ రహస్యము తెలియదు. తెలియరాదని అట్లుల చేసినాను. ఈ రహస్యము ఇంతదనుక కాపాడబడినది. యశోద ! ఈ కృష్ణుడు, వీడు, నా బిడ్డ అనుకో ! దేవకి బిడ్డ అనుకో. అయినా లోకం వీనిని యశోద బిడ్డఅని గూడా అంటుంది. ఇప్పుడే అంటున్నది. లోకము వారు తండ్రిని చూచి “వీడు యశోదబిడ్డ కాదటవె” అంటున్నారు. వీడు “నందసూనుడు కాదటవె” అంటున్నారు. ఈ మాటను ఎవరు తీసివేస్తారు. నేను తీసివేయను. లోకము తీసివేయదు.”

వసుదేవుడు ఆగినాడు. యశోద ఆనందతరంగిత హృదయాంతరంగ అయినది. ఆమె కనుకొలకులు ఆనందబాష్పరుద్ధములయినవి. నందుడు ఆనందవశమున అవనతుడైనాడు. రోహిణి గల్లున నవ్వినది. స్వామి! బాగా అన్నారు. తండ్రి ఎప్పుడు యశోద బిడ్డడే ఇంతదనుక అదే మాట్లాడుచున్నాము. తండ్రి అన్నాడుగదా, యశోదే ! నేను నీ బిడ్డను అన్న మోహమువద్దు, దేవకీదేవి ఆ మోహమును పెట్టుకోలేదు. నీవు ఎవ్వరుతకవు. చల్లలమ్మ గొల్లదానవు. నన్ను పెంచి నన్నును గొల్లవానిని చేసినదానవు. నీవు నాకు యేమి చుట్టమవు. ఆ చుట్టమవు కాదని చెప్పిపోవుటకు వచ్చినాను” అన్నాడు. యశోద గొల్లున గోల పెట్టినది. మేము నవ్వులకు దిగినాము. యశోదతో నవ్వులకు దిగని సందర్భము లెప్పుడు. ఏమే ! యశోద ! నిన్ను రేపు బృందావనం పంపించివేస్తాను. అక్కడ నీలను నీవు కనిపెట్టుకొని వుండవలెను. తండ్రి ఇప్పుడు ఇక్కడ ఇన్ని పనులను వదిలిపెట్టి మీ కోసము బృందావనమునకు వచ్చునా! ఏమి! కృష్ణయ్యా ! నామాట నిజమేనా ?”

అని రోహిణి తిరిగి నవ్వినది. వసుదేవునకుగూడ నవ్వు వచ్చినది. అనుక్రోశమును కల్గినది. యశోద పడుచున్న బాధ తనకు తెలుసు. దేవికికి తెలుసు. ఆయన అన్నాడు. రోహిణి ! నీ గడుసుతనమును వదులు, పిచ్చితల్లి కళ్ళనీళ్ళ పర్యంతము అవుతున్నది.

రోహిణి యశోద చుబుకమును పట్టిఎత్తినది. కన్నులలో కన్నులుగా చూచినది. ‘యశోదా ! నేను పరాచికము లాడుట లేదే ! నీతో నేను పరియాచకములాడుదునా ! తండ్రి ఇంతవరకు చదువులు లేక అడవులలో తిరిగినాడు. ఇప్పుడు చదువుకొనవలదా! అవంతిలో సాందీపనియని కులపతి వున్నారట. ఆయనవద్ద విద్య నభ్యసించాలని తండ్రి అనుకుంటున్నాడు. రామయ్య అభిప్రాయం గూడా అదే. అందుకే నన్ను ఇక్కడకు తెచ్చినారు. మీకు చెప్పి, తర్వాత తండ్రికి, దేవకీదేవికి చెబుదామని వారి ఊహగా వుంది. పిల్లలు పెద్దవాళ్లు అవుతున్నారు. ఎప్పుడు మనదగ్గర వుంటారా ! మీరు చెప్పండి స్వామి !”

వసుదేవుడు రోహిణివంక విచిత్రంగా చూచినాడు. చూచి మందహాసం చేసినాడు. “రోహిణీ ! నీవు గడుసుదానవు. నేనును అందుకే వచ్చినాను. నీవు అన్నావుకదా! నన్ను దేవకి పంపించింది.

ఎవ్వరూ మాట్లాడలేదు.

# వాల్ట్ డిస్నీ వినూత్న సృష్టి

# "ఉత్తర ధ్రువం శోభ; క్షోభ"

సినీమాను విజ్ఞానసాధనంగా కూడా వినియోగిస్తున్న కొద్దిమంది హాలీవుడ్ పెద్దలలో పెద్ద వాల్ట్ డిస్నీ.

ఈయన యాత్రా చిత్రాలు, వివిధ ఖండాల విచిత్ర స్థితిగతులపై తీసిన చిత్రాలు ప్రపంచ ప్రజకు విజ్ఞానదాయకమై ఆయనకు ఆస్కార్ బహుమాన ప్రదాతలైనవి.

వేడికి చర్మం నల్లపడే ఆఫ్రికానుంచి శీతలానికి తెల్లపడే ధ్రువంవరకు గల ప్రదేశాల ప్రాణికోటిపై ఆయన చిత్రాలు తీశారు.

డిస్నీ విన్నాణంవల్ల 'జీవించిన ఎడారులు' చూచాము; కళకళలాడిన కీకారణ్యాలు చూచాము. ఉడుతలు, సింహాలు, కుందేళ్ళు, పక్షులు--ఇవే ఆయన నిర్మించిన 'ప్రకృతి చిత్రాల'లో హీరోలూ, హీరోయినులూ, విలనులూ!



ఈ తరగతి చిత్రాలలో మాట్లాడే 'పాత్ర' మచ్చుకు ఒక్కటైనా లేకపోయినా పశుపక్ష్యాదుల తత్వంబట్టి వాటితోనే కరుణ, భీభత్సం కడవలతో కుమ్మరింపజేయడం, మనుషులు నటించే ఫీచర్ చిత్రాలలోవలె ఈ ప్రకృతి చిత్రాలలోనూ ఆరంభంలో కొత్త ఆడంబరం, చివర క్లయిమాక్స సృష్టించడం, ఉత్సుకత కలిగించే రీతిని 'కథ' నడిపించడం, నేపథ్య సంగీతంతో దృశ్యపు విలువలు- ముఖ్యంగా వినోదం- ఇనుమడింప జేయడం — వీటిలో డిస్నీకి తుల్యులు అరుదు. ఈరీతి ప్రతిభకు మరొక మచ్చుతునక "వైట్ వైల్డర్ నెస్" (నిర్జన హిమప్రదేశము) మద్రాసులో విడుదలైంది. త్వరలో ఆంధ్రప్రదేశ్ లో విడుదల కాబోతున్నది.

ఉత్తర ధ్రువంలో హిమగిరుల పతనం, ఒక ప్రాణి తన ప్రాణం నిలుపుకొనేందుకు మరొకప్రాణిప్రాణంతీసేవిధం, పశుపక్ష్యాదుల "మాతృప్రేమ", ఋతువుబట్టి ప్రాణికోటి వలసపోయే ప్రాంతాల వైచిత్ర, తెల్లభల్లూకాల, తెల్ల తిమింగిలాల వింత ప్రకృతి, చిట్టి ఎలుకలకు వెరచే జల 'దంతగజముల' బ్రతుకురీతి- ఇటువంటివాటి నెన్నింటినో డిస్నీ బృందం కెమెరాలు పట్టగలిగినవి.

ప్రపంచానికి మంచుకప్పు, అర్ధరాత్రి రవి కనపడే చిత్రసీమ అయిన ఉత్తర ధ్రువ ప్రాంతానికి 12 మంది ప్రకృతి శాస్త్రజ్ఞులు, ఛాయాగ్రాహకులు వెళ్ళి టెక్నికలర్ లో తీసిన ఈ చిత్రం రాణించడానికి కెమెరా ట్రిక్కులుకూడా బాగా పనిచేసినవి.

చలనచిత్రాన్ని విజ్ఞానసాధనంగా వినియోగించే వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్స్ క్రితం సంవత్సరం 4,80,000 పౌనుల నష్టం 'కళ్ళచూచినట్లు' లండన్ వార్త వార్త

లాభనష్టాల సంగతి ఎలావున్నా ప్రకృతిని శాస్త్రజ్ఞులతో సమానంగా తమ ఛాయాగ్రాహకులు జయిస్తున్నారన్న సంతృప్తి డిస్నీ ప్రొడక్షన్స్‌కు కలదు. ★

భరణివారి 'బాటసారి'లో

జానకి.

# అవి... ఇవి...

ఫిలిం నిర్మాణంలో ప్రపంచం మొత్తంమీద ద్వితీయ, తృతీయ స్థానాలు వహిస్తున్న భారత దేశం 1960 లో కూడా ఆ అంతస్థులోనే ఉండ గల దనడానికి ఢోకా లేదు.

1960 లో దేశంలో మునుపెన్నడూ లేనన్ని కథా చిత్రాలు—320—తయారైనవి. 1959 లో కంటె 17 ఎక్కువగా ఫీచర్ చిత్రాలు నిర్మితమైనవి.

భారతదేశంలో నిరుడు కూడా మద్రాసే ప్రధాన ఫిలిం కేంద్రంగా ఉంది.

1960 లో మద్రాసు (హైదరాబాద్‌తో సహా) 144, బొంబాయి 133, కలకత్తా 43 ఫీచర్ చిత్రాలను తయారుచేసింది.

1959 లో మద్రాసు (హైదరాబాద్‌తో సహా) లో, అనగా దక్షిణ భారతంలో 136, బొంబాయి లో 122, కలకత్తాలో 45 చిత్రాలు నిర్మాణమైనవి.

1959 లో కంటె 1960 లో తెలుగు చిత్రాల సంఖ్య (డబ్బింగ్‌తో సహా 44; 55) పెరిగింది కాని తమిళ చిత్రాల సంఖ్య 76 నుంచి 63 కు పడిపోయింది.

హిందీ చిత్రాల సంఖ్య 1960 లో ఆ క్రితం సంవత్సరం కంటె నాలుగు హెచ్చింది (120; 116).

చెన్నపట్టణంలో హిందీ చిత్రాల నిర్మాణం 1959 లో కంటె 1960 లో పెరిగింది. (5; 9)

*   *   *

జనవరి నాల్గవ తేదీ సంచికలో 1960 లో నిర్మాణమైన తెలుగు చిత్రాల వివర మిచ్చినాము.

1960 లో తయారైన హిందీ, ఉర్దూ చిత్రాలలో విడుదలైనవాటి పేర్లు దిగువ తెల్పుతున్నాము.

తెలుగు వారికి సంబంధించినంతవరకు క్రింది విశిష్టాంశాలు గమనార్హం.

పీపుల్ పిక్చర్స్ వారి "ఎయిర్ మెయిల్" లో "చివరకు మిగిలేది" నటి శోభ మాలిని పేరుతో ముఖ్య భూమిక వహించారు.

శ్రీ తాతినేని ప్రకాశరావు "కాలేజీ గరల్" డైరెక్టర్.

హైదరాబాద్ సంగీత ప్రముఖుడు శ్రీ ఇక్బల్ కురేషీ "లవ్ ఇన్ సిమ్లా" సంగీత దర్శకుడు.

వాహినీ వారి "పెద్ద మనుషులు" ఆధారంగా ఏషియాటిక్ ప్రొడక్షన్ వారు "పతంగ్" నిర్మించారు.

హైదరాబాద్ సంగీత దర్శకుడు శ్రీ శంకర్ (జైకిషన్ సహచరుడు), హైదరాబాద్ నటుడు చంద్రశేఖర్, విజయవాడ తార వహీదా రహ్మాన్‌ల ప్రజ్ఞా ప్రాభవాలు 1960 లో ఇనుమడించినవి.

ప్రైయిట్ టేక్ హిందీ, ఉర్దూ చిత్రాల వివరం :

అయిఫిర్సే బహార్, అంచల్, అబ్దుల్లా, ఎయిర్ మెయిల్, ఆలం ఆరాకిబేటి, అనూరాధ, అఫ్సానా అఫ్సాహత్ జగన్నాద్, బాబర్, బహదూర్ లుటేరా, బంజారిన్, బారాత్, బర్ఖా, బరూద్, బర్సాత్ కిరాత్, బేవకూఫ్, భక్తరాజ్, బ్లాక్ రైడర్, బ్లాక్ టైగర్, బొంబాయికి బాబు, బస్ కండక్టర్, చాంద్ మేరీ ఆజా, చంద్రముఖి, చౌద్విన్‌క చాంద్, ఛాబిలి, ఛలియా, చిని జాదూఘర్, కాలేజి గరల్, కమాండర్, డాకా, దేఖా జాయెగా, ఢిల్లీ జంక్షన్, దీది, దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయ్, దిల్ భీతెరా హంభీతేరే, డాక్టర్ షైతాన్, డాక్టర్ జడ్, దునియా ఝుకతీహై, ఏక్‌కె బాద్ ఏక్, ఏక్‌ఫూల్ చార్ కాంటే, గాంబ్లర్, ఘర్కీలాజ్, ఘన్‌ఘట్, గరల్ ఫ్రెండ్, గోకుల్ కచోర్, హీర్‌సయాల్, హనిమూన్, జాలీనోట్, కాలా ఆద్మి, కాలాబజార్, కల్పన, కీచక్ వధ, కోహినూర్, లవ్ ఇన్ సిమ్లా, మాబాప్, మాకె ఆన్సూ, మదారి, మంజిల్, మసూమ్, మాయా మచ్ఛీంద్ర, మెహ్లోన్‌కె ఖ్వాబ్, మేరాఘర్ మేరా బచ్చే, మిస్ గుడ్‌నైట్, మిట్టి మెసోనా, మియాబీబీరాజి, మొగల్ ఆజం, ముక్తి, నాచె నాగిన్ బాజెబీన్, నయామా, ఫరఖ్, పతంగ్, పెడ్రో, పహ్లారాత్, పోలీస్ డిటెక్టివ్, ప్యార్‌కి రహే, కాటిల్, రంగీలీ రాజా, రిటర్న్ ఆఫ్ మిస్టర్ సూపర్‌మాన్, రోడ్ నెంబరు 303, సంయార్ ఏ పారిస్తాన్, సర్హాద్, సరోవర్ వర్‌కి సుందరి, సతీ నైశాలిని, షాన్ ఇ హింద్, షరీఫ్ డాకూ, శర్వణ కుమార్, శ్రీమాన్ సత్యవాది, సింగపూర్, సింహళద్వీప్‌కి సుందరి, సూపర్‌మాన్, త్రివిక్రమ్‌బాజ్, ట్రంక్‌కాల్, తుమహి ఔర్ సహి, వీర్ దుర్గాదాస్, జమీన్‌కె తారే, జింబో కమ్సటు టవున్.

*   *   *

విమర్శకులు మెచ్చిన చిత్రాలు ఆర్థికంగా అమిత ఆకర్షణ పొందక పోవడం, ట్రామీ చిత్రాలు బాక్స్ ఆఫీస్ దృష్ట్యా మేటివి కావడంఇక్కడే కాదు బ్రిటన్‌లో కూడా జరుగుతున్నది.

"ది అపార్ట్‌మెంట్", "సన్స్ అండ్ లవర్స్", "ది ట్రయల్స్ ఆఫ్ ఆస్కార్ వైల్డ్", "షాడోస్" "ఆన్ ది బీచ్", "సాటర్‌డే నైట్ అండ్ సన్‌డే మార్నింగ్" చిత్రాలను ప్రముఖ ఫిలిం విమర్శకులు కళాఖండాలని కీర్తించారు. కాని హెర్క్యులస్ హీరో శ్రీ స్టీవ్ రీవ్స్ నటించిన "హెర్క్యులెస్



కె. పి. ఆర్ట్స్ వారి 'చిన్నకోడలు'లో కృష్ణకుమారి; రామకృష్ణ.



శ్రీ కాంత్ ప్రొడక్షన్స్ వారి 'సతీసులోచన'లో రంగారావు, ఎన్. టి. రామారావు

అన్‌చైన్‌డ్'', ''డాక్టర్ ఇన్ లవ్'', ''నన్స్ స్టోరీ'' విశేష జనాకర్షణ పొందినవి.

* * *

పూర్వపు భారత చిత్రాలలో గొప్పవి భద్ర పరచే ఉద్దేశంతో కలకత్తా న్యూ థియేటర్స్ ఫిలిం భండాగారంలో ''విద్యాపతి'' కోసం ఈమధ్య వెతకగా ఒక్క ప్రింటు అయినా లభించలేదు. నెగిటివే గల్లంతు అయింది. ఇప్పుడు ప్రదీప్‌కుమార్ ''విద్యాపతి'' హిందీలో నిర్మించ దలచారని, పూర్వం న్యూథియేటర్స్‌లో రచయితగా పనిచేసిన శ్రీ కేదర్ శర్మ కొత్త విద్యాపతిని డైరెక్ట్ చెయ్యవచ్చునని ఇప్పుడే తెలియవచ్చింది.

రంజిత్ వారి ''సుల్తాన్'' కాపీలు నెగెటివ్‌లు కూడా కాలిపోయినవి. కొత్త చిత్ర నిర్మాణం జరుగుతున్నది

వాటి స్థాయిలో ఉన్న వాహినీ, రోహిణి, సారధి చిత్రాలు కేంద్ర ఫిలిం భండాగారానికి పంపే ప్రయత్నం జరుగవలసి ఉన్నది.

* * *

మదరాసులో సినిమా అభిమానుల సంఘ కార్యవర్గం సమావేశమై 1960 లో ఉత్తమ తెలుగు చిత్ర నిర్ణయానికి క్రింది ప్రముఖులను ఎన్నుకొన్నది,

డాక్టర్ నారాయణమూర్తి, శ్రీయుతులు జె వి ఎస్. రావు, కొండలరావు, ఎ. వరదప్ప చెట్టి, డబ్ల్యు ఎస్. వెంకటరామానుజులు నాయుడు, శ్రీమతులు ఎం. వి. ప్రకాష్, రుక్మిణి భూపతి, సీత ఎంబెరుమానార్ చెట్టి, టి. వేణుగోపాలరావు సతి

వీరు 36 స్ట్రెయిట్ టేక్ చిత్రాలలో పాతిక మాత్రమే పరిశీలిస్తారు.

ఉత్తమ చిత్రాలు, ఉత్తమ తారలు, ఉత్తమ సాంకేతిక ప్రవీణులు తప్పక ఎన్నిక కాగలరని ఆశించుదాము

## వార్తాభరణం

మద్రాసులో శ్రీ వాణి ఫిలిమ్స్ అనే కొత్త నిర్మాణసంస్థ నెలకొన్నది వీరు సాంఘికచిత్రం తలపెట్టారు శ్రీ ఆదుర్తి సుబ్బారావు దర్శకులు రచన శ్రీ ఆరుద్ర

* * *

రానో ఫిలిమ్సు వారు "తల్లి—బిడ్డ" చిత్రానికి జనవరి 25, 27 తేదీలలో కొంజిసిన్ స్టుడియోలో నాలుగు పాటలు రికార్డు చేశారు జిక్కి రెండు పాటలు, జిక్కి, పిఠాపురం నాగేశ్వరరావు కలసి ఒకపాట, ఎస్ జానకి ఒకపాట, పాడారు హైదరాబాద్‌లో పేరొందిన విజయ రాగిణి ఆర్కెస్ట్రా) నిర్వాహకుడు శ్రీశంకర్ తోలిసాతి ఈ చిత్రానికి సంగీత దర్శకత్వం వహిస్తున్నారు ఇప్పటికి ఒడిటెడ్ ఫిల్ము 8500 అడుగులు తయారైంది ఫిబ్రవరి రెండవ వారంలో ఫస్ట్ సెట్టుపై (మెజిస్టిక్ స్టుడియో) షూటింగ్ జరుగుతుంది

కృష్ణకుమారి, హేమలత, రాజశ్రీ, బాలయ్య, నాగయ్య, హరనాథ్ మున్నగువారు నటిస్తున్న ఈ చిత్రానికి శ్రీ పి ఎస్ శ్రీనివాసరావు దర్శకుడు రచయిత, నిర్మాత శ్రీ యడవల్లి

* * *

క్రింది కొత్తచిత్రాల నిర్మాణానికి కృషి జరుగుతున్నది

వాహినీ ప్రొడక్షన్స్—"భక్త ప్రహ్లాద" దర్శక నిర్మాత శ్రీ బి ఎన్ రెడ్డి, రామచంద్రా ప్రొడక్షన్స్— "సతీ అరుంధతి' ఎ వి వి ఎస్ ఎమ్ "కాశీ మజిలీ కథ", రాజరాజేశ్వరి "ద్రౌపదీ వస్త్రాపహరణం" రూపశ్రీ "నడమంత్రపు సిరి", రాజు "ప్రేమ కానుక", దేవానంద్ ఫిలిమ్స్— "సర్వమూలమిదం జగత్" ఎస్ ఎల్ ఎన్ ప్రొడక్షన్స్— "అహల్య', ఎల్ ప్రొడక్షన్స్—"వరలక్ష్మీవ్రతం, లక్ష్మీ ప్రొడక్షన్స్ "కొడుకులు కోడళ్ళు" పూర్ణా పిక్చర్స్— "సంపూర్ణ మహాభాగవతము"

* * *

పూర్వపు న్యూథియేటర్స్ దర్శకుడు శ్రీ నితిన్‌బోస్ స్వంతంగా ఫిలోమ్రదయా అనే ఫిలిం నిర్మాణసంస్థ నెలకొల్పారు వీరి తొలి చిత్రాన్ని శ్రీ నితిన్‌బోస్ డైరెక్ట్ చేస్తారు హైదరాబాద్ యువకుడు శ్రీ ఇక్బల్ ఖురేషీ సంగీత దర్శకత్వం వహిస్తారు అశోక్ కుమార్, జాయ్‌ముఖర్జీ, అభిభట్టాచార్య, రాజేంద్రనాథ్, లీలా నాయుడు, నంద మున్నగువారు తారాగణంలో కలరు

★

గ్రిపోయాయి. సూర్యారావు అభిప్రాయాన్ని మార్చివేయాలంటే ఇంతకన్న మంచిసమయం లభించడం దుర్లభం అని శంకరయ్య మనసులో అనుకున్నాడు. ఇదే సమయం పాపయ్య కుటుంబం మీద కసి దీర్చుకోవడానికి కూడ.

అన్నీ కలిసివచ్చిన సుముహూర్తంనాడు శంకరయ్య ఎడ్వొకేటు వెంకటశాస్త్రిగారి కుమార్తెను సూర్యారావుకి వివాహం చేయడానికని బంధువుల సమక్షంలో అనుమతించేడు. సూర్యారావుతో ఈసుకేనా ఆమాట అనకుండా కొన్నాళ్ళు మనసులోనే ఉంచుకుని ఆనాడు పరీక్షపేసయిన సంతోషసమయం కాబట్టి అట్టే ఆలోచన చెయ్యడానికిగాని, ప్రతికూలంగా మాట్లాడడానికిగాని అవకాశం ఉండదని సూర్యారావు చదువుకీ, సీతపెళ్ళికీ లంకెపెడుతూ, వెంకటశాస్త్రిసంబంధంవిషయం చెప్పేడు.

ఆలోచనలు ఉప్పెనలా మనసులో అట్టుమిట్టాడుతూ ఉండడంవలన ఏ సమాధానం చెప్పలేక పోయాడు. అక్షణంలో కామేశ్వరి జ్ఞాపకం మనసుని మరింత కృంగదీసింది. 'నన్ను మోసగిస్తావా' అని దీనంగా అడుగుతూన్నట్లు కామేశ్వరి ప్రతిబింబించసాగింది. తల్లితోనైనా చెప్పి ఈసంబంధం తప్పిపోయేటట్లు చేయాలన్న ఉద్దేశ్యంతో ఉన్నాడు సూర్యారావు.

మధ్యాహ్నం పన్నెండు దాటింది. 'భర్త రాలేదేమా ?' అనుకుంటూ ఇంట్లోంచి వీధిలోకి క్షణానికోమారు వస్తోంది రామం భార్య. సత్తెమ్మ వీధిలోనే కూర్చుని 'పాందాన' ముందుకు లాక్కుంది. ఆమె తాంబూలానికి వేళాపాళా అవసరంలేదు. అందులోనూ వాళ్ల ఊరు తమలపాకులతోటలకి ప్రసిద్ధి కూడాను. ఆమె మనస్సులో కూడా శంకరయ్యా రాలేదు, రామం రాలేదు, అని కలతపడుతోంది. మెల్లిగా సూర్యారావు ఆమెవద్ద కూర్చుని ఏవిధంగా మొదలు పెట్టడమా అన్నట్లు ఒక్కక్షణం నిశ్శబ్దంగా మౌనం వహించేడు.

"అమ్మా ! నువ్వుకూడా విన్నావుగా నిన్నటి మాటలు."

"ఊఁ !"

"అన్నీ తెలిసి కూడా ఏమీ అనకుండా ఊరుకున్నావేం."

"దేనిగురించి అన్నీ తెలుసునంటున్నావు."

"నువ్వు విన్లేదూ. ఏడ్వొకేటుగారు ఇవ్వబోయే కట్నంతో సీతకి పెళ్లి నాకు ముందు చదువూనట !"

"హాఁస్, అదా. ఆసంబంధం మంచిదే కదూ !"

"పెళ్లిచేసుకుని సుఖపడవలసినది నేనే నంటావా ?"

సత్తెమ్మ సమాధానంగా బుర్ర ఊపింది.

"నేను కామేశ్వరిని పెళ్లాడతానని ఇంతకు ముందే నీతో చెప్పేనుకదూ. మళ్ళా, ఇప్పుడెందుకీ కొత్తబేరం."

# "బలియసీ కేవల మీశ్వరాజ్ఞా"

(39వ పేజీ తరువాయి)

"నాకేం తెలుస్తుంది నాయనా. అంతా మీ నాన్నగారిష్టప్రకారం జరగాలి. నామాట కేమేనా విలువుంటేకదా నే చెప్పేది" అంది. కాని ఆమె హృదయంలో కూడా ఏదో బాధ ఉన్నట్లనిపించింది. గతం అంతా ఇద్దరిహృదయాల్లోనూ ప్రతిఫలించింది. తల్లివలన కూడా ఏ సహాయం జరగడానికీ అవకాశం లేదని తెలుసుకున్న సూర్యారావు లేవబోతూఉంటే, శంకరయ్య ఆ వెనకే ఒరువైన సంచీతో రామం గుమ్మం ఎక్కేరు.

తండ్రీ కొడుకూ ఒకేసారి కలిసొచ్చారే అన్న సంతోషంచేత చిన్నవవ్వుతో "ఇంతాలస్యం చేసేరేంవిటండీ"అని భర్తని పలకరిస్తూ, "అదేమిటిరా రామం ఆ సంచీ" అని రామా న్నడిగింది సత్తెమ్మ.

"సంచీ చూస్తూ సంచీ ఏంవిటని అడుగుతే ఏం చెప్పమంటావమ్మా ?" అంటూ ఎదురు ప్రశ్న వేసేడు రామం.

"జవాబు తిన్నగా చెప్పరా. పెడసరంగా మాట్లాడడం ఓ గొప్పనుకుంటున్నావు కాబోలు" అంటూ శంకరయ్య కసిరేడు.

"మీ ముఖం చూస్తే నాకు తిన్నగా రాబోయే మాటకూడా వంక పోతుంది. నా సమాధానం అమ్మకు కాదు. మీకు" అంటూ దోషిని వేలు చూపించి నిర్దుష్టంచేస్తూన్నట్లు చెప్పేడు.

అనవసరంగా మాట్లాడినందున వచ్చే అవమానాల వలన పరితపించినట్లు సత్తెమ్మముఖం ముకుళితమైపోయింది. ఆమె మనస్సు చాల సున్నితమైనది. గుంభనగా ప్రవర్తిస్తూన్న ఆ మనుష్యులు, ప్రతివ్యక్తీ ఏదో ఒక అసంతృప్తితో వాడిపోయిన ముఖంతో మెలగుతూ ఉండటాన్ని కలివిడి తప్పిన ఆ యిల్లు, ఇవన్నీ చాలవన్నట్లు, మాటమాటకీ కలహం చెలరేగుతూన్న ఆ వాతావరణం సత్తెమ్మని కలవరపరచేయి.

గురువు—రామూ, ఒకపద్య పాదం చెప్పరా.

రాము—సుగ్రీవుని ఎడమ కాలు శునకము కరచెన్.

గురువు-కుడికాలు ఎందుకు కరవలేదురా?

రాము—గణాలు సరిగా కుదరనందున సార్.

జె. సాంబశివరావు (పేరేచర్ల)

భర్త చేతులో సంచీ తీసుకోనేటందుకు ఎదురుగా తన భార్య వెళ్ళే, విసుక్కున్నాడు రామం. "ఇంకా నువ్వు సిద్ధం కాలేదుటే" అంటూ.

"ఇంకా ఇప్పుడేకదూ మీరూ మావగారూ రావడం."

"తెముల్చూ తొందరగాను. నీ అత్తమామాళ్ళ భక్తి తర్వాత చూపించచ్చునులే బస్సుకి టైమై పోతూవుంటే మావరత్నాలు చేస్తున్నావు."

"బస్సేమిటిరా ? ఎక్కడికీ ప్రయాణం ?" అంటూ సత్తెమ్మ ప్రశ్నించింది.

"వాళ్ల ఊరి బస్సు. ఇప్పుడది పుట్టింటికి పోతూందిలే."

"మొన్ననే కదా వచ్చింది ఇంత తొందరలో ఏమిటా ఉప్పెన. నాకేం బోధపడకుండా ఉంది"

"అది వెళ్ళిపోవాలమ్మా. లేకుంటే నే ననుకున్న పన్లేమీ అవవు." అంటూ భార్యవైపు చూసి "ఈ ఇంటికో అఖరుదండం పారెయ్యి" అన్నాడు.

"ఇంకా బొంచెయ్యలేదురా."

"మరీమంచిది. అఘోషసంగా పోయిందని అందరికీ జ్ఞాపకం ఉండిపోతుంది."

"మీరేనా చెప్పండి వీడికి. వెర్రెత్తినట్టున్నది" అని సత్తెమ్మ శంకరయ్యని ప్రాధేయపడుతూ అడిగింది.

"నువ్వేనా చెప్పు వదినా ! ఇప్పుడు రావని" అంటూ సూర్యారావు బతిమాలేడు.

"అలా ఎందు కంటుందిరా అదీ ? ఈ తతంగం అంతా దాని కుట్రేకదూ. వెళ్ళను నెక్కడికి వెళ్తుందో— మళ్ళా ఈ గుమ్మం ఎలా తొక్కుతుందో చూస్తాను" అంటూ శంకరయ్య మండిపడ్డాడు. సత్తెమ్మ కోడలివైపు వెళ్ళింది. సీత వదినభుజంమీద చెయ్యివేసి, ఏడుస్తూవుంటే ఓదార్చింది. భార్య ఏడుపు చూసి, రామం 'ఏడ్చి ప్రయోజనంలేదు. నేను లేకుండా నువ్విక్కడుంటే, వీళ్ళు నిన్ను పీల్చి పిప్పి చేస్తారు" అంటూ ఓదార్చబోయేడు

ప్రయాణసన్నాహం ఒరిగిపోయింది. మరచెంబులో పాలుపోసి సీత వదిన కప్పచెప్పింది. సత్తెమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ కుంకం పసుపూ పొట్లాంగట్టి చేతి కందించింది. రిక్షాలో కూచుని వెళ్ళబోతూ ఉంటే సీత 'నాకు పెళ్లయితే అప్పుడేనా రావా వదినా !" అంటూ వాపోయింది. రిక్షా బయలుదేరింది. రామం అప్పుడే బస్సు స్టాండుకి భార్యను దిగబెట్టడాని కని వెళ్ళిపోయేడు. శంకరయ్య, సూర్యారావు ఇంట్లోనే ఉండిపోయేరు చూడడానికేనా ఇవతలికి రాలేదు.

## 3

ఒదయాన్నే లేచి స్నానపానాదులు ముగించుకుని వీధిగుమ్మంలో కూర్చున్నాడు శంకరయ్య. లోపలనుండి తీవ్రమైన మాటలు వినిపిస్తున్నా తనకేం పట్టనట్టూరుకున్నాడు. రామం గుమ్మంలో కొచ్చి "నేనుకూడా వెళ్ళిపోతున్నాను" అని శంకరయ్యతో చెప్పేడు.

"పెళ్ళాంతో నిన్ననే పోవలసినవాడివి, ఇవాళ వరకూ ఎందుకు వాయిదావేసేవు" అన్నాడు శంకరయ్య రామం ఇటు తిరిగిచూడకుండా ముందుకు సాగిపోయేడు ఇంట్లో సత్తెమ్మ ఏడుస్తోంది. సీత తల్లి నోదారుస్తోంది. కళ్ళు తుడుచుకుంటూ సూర్యారావు తండ్రికెదురుగా నిల్చున్నాడు.

"ఏం. నువ్వేమిటి చెప్పతలంచుకున్నావు" అంటూ శంకరయ్య రవుద్రాకారుడై అపర శంకరుడిలా అడిగేడు.

"నేను వెంకటశాస్త్రికూతుర్ని పెళ్ళాడను" అన్నాడు సూర్యం.

"నేను నీకు చదువుకూడా చెప్పించను."

"సీత పెళ్ళి కూడా చెయ్యను, అనండి నాన్నగారూ" అన్నాడు గతసంభాషణ జ్ఞాపకానికి తెస్తూ.

"నీ కదంతా అనవసరం."

"మీ కేదైతే అవసరం ?" చాలా ధైర్యంగా అన్నాడు సూర్యారావు. "అనవసరంగా కోపంపడి పోతున్నారు నాన్నగారూ."

"అవునండీ కొడుకుగారూ ! నా కిప్పుడు కోపమే కాదు మిమ్మల్ని నాశనం చేసెయ్యాలనుంది కూడా."

కొంచెంసేపు ఇద్దరూ మాట్లాడలేదు. ఇంతలో ఎవరో శుభలేఖనందించేరు. సూర్యారావు పుచ్చుకుని చదివేడు. విస్మయభ్రాంతులు క్రమ్ముతూన్నట్లనిపించింది. తన కాళ్ల క్రింద భూమి బీటలొతున్నట్లనిపించింది.

"ఎంతపనైంది. అమ్మా ! అమ్మా !" అంటూ శంకరయ్య కెదురుగా నీరసంతో చతికిలపడ్డాడు. ఏమిటో ఇంకో ఉపద్రవం అని సత్తెమ్మ తొందరతొందరగా ఇవతలి కొచ్చింది.

"అమ్మా ! కామేశ్వరికి మరో సంబంధం నిశ్చయమైంది వచ్చే పదహారుని పెళ్ళి" అంటూ శుభలేఖ చూపించేడు "తగినశాస్తి జరిగింది" అని శంకరయ్య ఒక నికటాట్టహాసం చేసేడు. బొటనవ్రేలు తన గుండెవేపు చూపిస్తూ, "నేనూరా చేసేను. నువ్వు ఎడ్వొకేటుగారి సంబంధం ఒప్పుకోవని నాకు తెలుసు. అంచేత పాపయ్యకి చేటభారతం అంత ఉత్తరం రాసేను. ఆఖర్ని ఊళ్ళోకూడా ఉండనివ్వనని బెదిరించేను. నాస్తోమత శక్తి తెలిసినవాడు కాబట్టి, పాపయ్య వాడి కూతురుకి ఇంకో సంబంధం చూసుకున్నాడు. ఇప్పుడేనా మించిపోయింది లేదు. నువ్వు వెంకటశాస్త్రి కూతురుని చేసుకుంటానను. ఎన్ని లాభాలు మన కున్నాయో తెలుస్తుంది. ముఖ్యంగా సీతకికూడా పెళ్ళయిపోతుంది" అన్నాడు శంకరయ్య విజయగర్వంతో.

"చూసేవా అమ్మా ! ఎంతసంతోషమో నాన్నగారికి. వదిన పుట్టిల్లు చేరుకున్నా మనకు బాధలేదు. అన్నయ్య ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వాడి దారిన వాడు వెళ్ళినా మనకు కష్టంలేదు. అమ్మ ఏమీ చెయ్యలేక ఏడుస్తున్నా మనకు ఫరవాలేదు. సీత మిమ్మల్ని అహరహాలు నిందిస్తున్నా ఫరవాలేదు. కాని నేను వెంకటశాస్త్రి




చిత్రకారుడు—కలువకొలను సదానంద (పాకాల)

కూతురిని పెళ్ళాడితే ఒక్కుమ్మడిగా లాభాలొస్తాయి, అదేనా మీ రంటున్నది నాన్నగారూ ! అయ్యో భగవాన్ ! కొంప కుండపెంకుల్లా చెల్లాచెదరైపోయింది. ఇంక నేనీ కుత్సితవాతావరణంలో ఉండలేను. సెలవు !" అంటూ సూర్యారావు గుమ్మందిగి కట్టుగుడ్డలతో అలానే వీధులో పడ్డాడు. శంకరయ్య చూస్తూ ఊరుకున్నాడు. "వీళ్లు రాత్రయేసరికి కొంపచేరు కోరూ" అనుకుంటూ.

హఠాత్పరిణామాలకి తట్టుకోలేక, అప్పటికే ఖేదంతో కృశించిఉన్న సత్తెమ్మ జోగిపోతూ ఉంటే సీత ఇంట్లోకి తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది. అదే నిముషంలో గొల్లుమని ఏడవడం మొదలుపెట్టింది. ఈఏడుపు విని శంకరయ్య వూహాప్రపంచంలోంచి మామూలుస్థితి కొచ్చేడు "ఎవరో చచ్చిపోతున్నట్లు ఎందు కేడుస్తున్నావే?" అని విసుక్కుంటూ లోపలి కొచ్చేడు. అచేతనంగా కొయ్యబారిపోతూన్న సత్తెమ్మనిచూసి చలించిపోయేడు. మానవుడిలో కష్టపరంపరకన్న దుఃఖపరంపర విచిత్రమైన మార్పు తెస్తుంది.

ఏడుపు విని ఇరుగు పొరుగువాళ్ళు రావడం మొదలుపెట్టేరు. "నా భార్య చచ్చిపోయిందర్రో" అని తల బాదుకుంటూ వీధిగుమ్మంలో ఏడుస్తూ కూర్చున్నాడు శంకరయ్య. పొరుగునే ఉన్న చిట్టెన్నగారు నాడిచూసి వెంటనే వైద్య సహాయం ఇప్పించిన కొంతసేపటికి సత్తెమ్మకి తెలివొచ్చింది. కాని పదిహేను రోజుల వరకూ పక్కమీదనుండి లేవలేకపోయింది. శంకరయ్యలో మార్పు రావడానికి పరిస్థితులు కూడ చాల దోహదం చేసేయి. ఇంత సంక్షోభపడడం, ఇల్లంతా భీభత్సం అయిపోవడం బహుశా జీవితంలో మొదటిసారే చూచిఉంటాడు. బంధువులలో ఏ ఒక్కరూ కూడ 'పాపం శంకరయ్యకు ఏం కష్టం వచ్చింది' అన్న పాపాన పోలేదు. ముఖం ఎదురుగా అంతకుముందు స్తుతించిన వారు కూడా ఇప్పుడు ఏవగించుకోవడం, దూషించడంకూడా మొదలుపెట్టేరు. 'వడ్డీలకు వడ్డీలుకట్టి డబ్బు గణిస్తే ఆఖరుకి మిగిలింది ఇంతేనోయ్' అని హేళనగా అంటూ ఉండడంకూడ విన్నాడు శంకరయ్య. "జ్ఞానం వచ్చిన ఇద్దరు కొడుకులూ తండ్రినొదిలి వేరు పడ్డారంటే తండ్రిలో ఏలోపం లేకుండా ఉంటుందా ?" అని నిందించడం చెవులారా విన్న తర్వాత, ఏకాంతంలో ఒక్కసారి తలంపురాగా నాలుగైదుసార్లు బుర్ర మొత్తుకున్నాడని కూడ వినికిడి. ఇంట్లో జబ్బు మనిషి సత్తెమ్మ అహరహాలు 'రామం', 'సూర్యం' అని పలవరింతలు. ఇంటిపని యావత్తూ సీతభుజాలమీద పడటాన్ని, శంకరయ్య స్వయంగా సత్తెమ్మకు సేవ చెయ్యవలసి వచ్చింది. ఆమెకు తెలివి వచ్చినప్పుడల్లా కళ్ళుతెరిచి చూసేది. ఎదురుగా శంకరయ్యను చూసి, భ్రూకుటి ముడుచుకుంటూ విసుగుతో ప్రక్కకుతిరిగి కళ్ళు మూసుకునేది.

ఎప్పుడూ ఎదురుతిరిగి ఎరుగని తనభార్య తన్నుచూసి అసహ్యించుకుంటున్నదని గ్రహించిన శంకరయ్య దీనుడైపోయాడు. గుండె నిబ్బరం దిగజారిపోయింది. 'రాత్రికి ఇల్లు చేరు కోరూ' అనుకున్నాడు కాని పదిహేను దినాలు గడిచినా, కొడుకులు తిరిగి రాలేదు. ఓ ఉత్తరం ముక్కకూడా లేదు తన పరితాపం, మనోవేదన ఇంకొకరికి చెప్పడానికేనా ఎవ్వరూ స్నేహరూపంగా రావడమే మానుకున్నారు. ఇదంతా దైవికం, అని సర్ది పుచ్చుకోవడానికి అవకాశం లేకుండా సత్తెమ్మ అవస్థ ఎప్పటికప్పుడే జ్ఞప్తికితెస్తోంది 'స్వయంకృత పాపఫలితమే ఇదంతా' అని.

ఓనాటి సాయంత్రం గుమ్మంలో ఒకవార ఏంచెయ్యడానికీ పాలుపోక కూర్చున్న శంకరయ్య, ఎవరో తన్ను పిలిచినట్లు విన్నాడు.

'ఎవరు బాబూ ?" ఆ అడగడంలో ఆశ్చర్యం, సందేహం కలిసి ఉన్నట్లు వినిపించింది.

"నేనే మామయ్యా !"

"నువ్వా న . . . ?" నిలువునా ఒణికిపోయేడు శంకరయ్య.

"నేనే నర్సింహాన్ని" అంటూ గుమ్మం ఎక్కి శంకరయ్యకెదురుగా నిల్చున్నాడు. తనపరువు నాశనం అవడానికి ముఖ్యకారణం నర్సింహం అని తెలుసు. ఈ దురవస్థలో స్వయంగా నర్సింహం ఒచ్చేడని తెలిసి దీనాతిదీను డయ్యాడు.

"నేను చచ్చిన పాముని నర్సింహం ! ఇంకా నన్ను పొడుస్తావా. నీకాళ్ళు పట్టుకుంటాను. ఇలాగేనా నన్నింక బ్రతకనియ్యి" అన్నాడు శంకరయ్య.

నర్సింహం సమాధానం చెప్పకుండానే, ఒక చేత్తో శంకరయ్యని లేవదీస్తూ ఇంట్లోకి తీసు కెళ్ళేడు.

"అత్తయ్యకొంట్లో బాగులేదుట కదూ ?' అంటూ సత్తెమ్మ ఉన్నచోటికి రావడం, ఆమె కప్పుడే తెలివొచ్చిందో ఏమో, అటునుంచి ఇటు ఒత్తిగిల్లుతూ నర్సింహాన్ని చూడడం ఒక్కసారి జరిగేయి. ఆమె రెండూ పాదాలూ తన శిరస్సుకి తాకించి, నర్సింహం ఇంకే సమాధానంగాని, ఇంకొకరి మాట గాని వినకుండా చెప్పడం మొదలు పెట్టాడు.

"ఈ దుఃఖాని కంతటికీకారణం నే నత్తయ్యా· నేను. నువ్వు నన్ను క్షమించాలి. గతించిన సంగతులు ఇక్కడ ఏకరువుపెట్టి నిన్ను బాధించను. నాకు మామయ్యమీద శత్రుత్వం సాధించాలని లేశమాత్రంకూడ లేదు. కాని మా పేదరికాన్ని పురస్కరించుకొని, మా చెల్లెలు వివాహం దాని భవిష్యత్తు అన్నింటికీ చెడు తే దలంచుకున్నాడని తెలిసి, తనకుకూడా పెళ్లి చేయడానికి ఆడపిల్ల ఉందన్న సంగతి కూడ మరచిపోయిన మామయ్యకు బుద్ధి రప్పించాలని ఇలా చేసేను. నన్ను క్షమించేనని అను. ఇంకా నీకు సంతోష వార్తలు చెప్తాను" అన్నాడు నర్సింహం. అతని మాటల్లో ఉద్వేగం, అభిమానం, ఆందోళన ప్రస్ఫుటీకరించేయి.




# "బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

శంకరయ్యకి కొంచెం ధైర్యం చేజిక్కినా, పరిస్థితులను అర్థంచేసుకోలేకపోతున్నాడు. నర్సింహం ఏం చేయదలచుకున్నా, ఇంతకన్న హీన స్థితికి దిగజారనియ్యకుండా ఉంటే చాల్లనిపించింది.

"మీ సీతకి పెళ్ళికొడుకును నిర్ణయించే నత్తయ్యా" అన్నాడు నర్సింహం.

"వేళాకోళాలు ఎందుకు నాయనా ! ఈ సమయంలో" అని సత్తెమ్మ అనలేక అనలేక నీరసంగా జవాబిచ్చింది.

"హాస్యం కాదత్తయ్యా ! భగవంతుడిసాక్షిగా నీ చేతులో చెయ్యివేసి చెప్తున్నాను. సీతని నేను పెళ్ళిచేసుకుంటాను."

ఈమాటలు వింటూ శంకరయ్య నిస్తబ్ధుడయ్యాడు. సత్తెమ్మకు ఒకప్రక్క సంతోషం ఉన్నా, రామం సూర్యాల విషయం ఏమీ తెలియదే అన్న అభిప్రాయం ఇంకోప్రక్క బాధించసాగింది. ఇంతలో పాపయ్య ఆయనభార్యకూడ రావడం, అక్కడి వాతావరణాన్ని రెండుక్షణాల్లో గ్రహించుకోవడం జరిగింది. నర్సింహమే మళ్ళా చెప్పడం మొదలు పెట్టాడు.

"సూర్యం, రామం కూడ రెండురోజుల్లో వస్తారు. నువ్వేం విచారించకు." ఈ మాట వినడంతో సత్తెమ్మకు సగంజబ్బు నయమైంది. శంకరయ్య కూడా సంతోషించేడు.

"రామం, తన భార్యని పుట్టింటికి పంపించి, తాను మీ వేలువిడిచిన మేనమామగారి వూరు వెళ్ళేడు. అక్కడ పడ్డ ఇబ్బందులు అన్ని సహించుకుని, ఇప్పుడు పోస్టలు డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తున్నాడు. అందుకు రుజువు, ఇదుగో నా స్నేహితుడు రాసిన ఉత్తరం. మిగిలిన సంగతులు తాపీగా చెప్తాను. ఇంక సూర్యం. నీకూ తెలుసును కదా! సూర్యానికి కామేశ్వరిని పెళ్ళాడాలన్న కోరిక ఉన్నట్లు. శుభలేఖ అందుకున్న వెంటనే మా ఇంటికే వచ్చేడు సూర్యం. అది అబద్ధపు శుభలేఖ. నేనే సృష్టించి, పంపించేను. మీకెవ్వరికీ తెలియకుండా కామేశ్వరికి పెళ్ళిలా అయిపోతుంది. అదీకాక నా చెల్లెలు సూర్యాన్నిష్టపడిందని తెలుసుకున్న నేను ఏ త్యాగమేనా చేయాలన్న సంకల్పం చేసుకున్నాను. అంచేత నేనూ, సూర్యం కలిసి ఆలోచించుకున్నాం. నా సూచన ప్రకారంగా సూర్యం మా పెద్దనాన్నగారి ఊరువెళ్ళేడు. నాఉద్దేశం, మామయ్య చేతనే స్వయంగా కామేశ్వరిని తనకోడలుగా చేసుకోవడాని కొప్పించాలని. ఇంతలో నీకు జబ్బు చెయ్యడం మూలంగా, నేనే ముందు ఒప్పుకున్నాను సీతను పెళ్ళాడడానికి. నీకంగీకారమేనా అత్తయ్యా !" అంటూ నర్సింహం ముగించేడు.

కొన్ని క్షణాలపాటు సత్తెమ్మ ఆశ్చర్యపోయింది. శంకరయ్య అవమానంచేత తల వంచుకుని నిలబడ్డాడు. చాటుగా కొంత దూరంలో మాటలు వింటున్న సీతముఖం వికాసంతో కాంతివంతమైంది. తానూ, తన కొడుకులు, తన ఆస్తి అని అహంకారంతో విర్రవీగుతున్న శంకరయ్య పూర్తిగా ఓడింపబడి, నర్సింహంవంటి ఉదాత్త యువకుడు లేడని మనస్సులో అభినందించేడు. అవకాశం మించిపోనివ్వకుండా, సీతని కోడలుగా చేసుకోవడానికి అంగీకరించిన పాపయ్యదంపతులతో శంకరయ్యదంపతులు కామేశ్వరిని కోడలినిగా చేసుకొనేటందుకు వాగ్దానాలు కావించుకున్నారు. వ్యతిరేకించినమనస్సులు, కుటుంబాలు, మనుష్యులు అందరూ, మళ్ళా స్నేహితంగా ఉన్నారు. వాళ్ళస్నేహానికి చిహ్నంగా, వాకిళ్లలో ఫలపుష్ప సంతతికూడా వృద్ధికాజొచ్చింది. ★

---

ఆ పట్నవాసం మనిషి పల్లెటూరుకు వెళ్ళి శాస్త్రీయ పరిశోధనవల్ల వ్యవసాయానికి చేకూరే ప్రయోజనాలు వివరిస్తూ ఇలా అన్నాడు:

"చూడండి మరో పదేళ్ళలో మీరు, ఒక ఎకరానికి కావలసిన ఎరువు అంతా మీ చొక్కాజేబులో వేసుకు వెళ్ళగలిగే సమయం వస్తుంది."

అమాయిక పల్లెరైతు ఇలా అన్నాడు: "అవును. రెండో జేబులో ఆ ఎకరం పంటఅంతా వేసుకు వెళ్ళవచ్చు కూడా !"

జమ్మలమడక వేంకటసుబ్రహ్మణ్యం
(హైదరాబాదు)

# గళ్లనుడికట్టు-38

## ఆధారాలు

**అడ్డం:**

1. రమ్యంగా వచ్చేవికావు.
3. కృష్ణుడి తురాయి.
5. అందమైన మాట
7. అష్టపదిలో కనబడే మరో అంక.
8. ఆ బకాసురుడిగుణం కనబడుతునే ఉంది.
9. ఆరాణి పాణిలో పాదాన్ని అలంకరించే ద్రవ్యం ఉంది.
12. ఆదారిలో రాకండి సమరం జరుగుతూ ఉంది.
13. అచ్చ తెలుగులో గాలి మేడ. ఊహించండి.
16. పడుచు పిల్ల
17. అప్పు చేసినప్పుడు, "ఎప్పటికీ తీర్చుకోలేమని" అంతా అనేమాట
22. ఏళ్ల తరబడి తిరుగుతున్న 'తిరిగే— చక్రం'
23 శ్రీనివాసా! రంగంపై కొండి ఎక్కడయ్యా!
25 ఏసుక్రీస్తు మరణశయ్య.
26 ఇంధనంలో విలువైనది.
28. గోదావరికి వల్లీమార్గం కనబడలేదు?
29. నిక్కలి చెయ్యి.
30. కబీరు వాకిటిలో పుస్తకాలు పెట్టుకు నేగుంది.
31. ! రామత...నుయాపో కలేట్టప ర్తుగుస్తేశ చిట్నింఅ

---

## 37-వ గళ్లనుడికట్టుకు జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పం | 2 చ | ■ | ■ | 3 క్షో | ర | 4 లో | ■ | ■ | 5 భో | గి |
| ■ | వి | 7 న | మ్ర | త | ■ | 8 ఖ | ధ | 9 ము | గం | ■ |
| ■ | ■ | య | ■ | ■ | ■ | ■ | ■ | దం | ■ | ■ |
| 10 కా | ల | ము | ■ | 11 గో | ర | 12 లు | ■ | 13 గ | మ | 14 కం |
| మి | ■ | 15 గ | లు | రో | ■ | 16 గు | ధ | ము | ■ | చు |
| ■ | ■ | ■ | ■ | 17 జ | గ | డా | ■ | ■ | ■ | ■ |
| 18 క్కు | ■ | 19 గ | ణ | న | ■ | 20 వె | న | 21 క | ■ | 22 ప్రా |
| 23 ఆ | వి | ర | ■ | 24 ము | మే | క్షి | ■ | 25 ని | ర్వా | ణం |
| ■ | ■ | మె | ■ | ■ | ■ | ■ | ■ | క | ■ | ■ |
| ■ | 26 గ | ళ్ల | ను | 27 డి | ■ | 28 లో | త | రం | 29 గు | ■ |
| 30 బు | వ్వ | ■ | ■ | 31 గ | సి | క | ■ | ■ | 32 స | డి |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 | | ■ | 5 | | 6 |
| | ■ | 7 | | ■ | | ■ | 8 | | ■ | |
| 9 | | | ■ | 10 | ■ | 11 | ■ | 12 | | |
| | ■ | ■ | 13 | | | | | ■ | ■ | |
| | ■ | 14 | ■ | | ■ | | ■ | 15 | ■ | |
| ■ | 16 | | | ■ | ■ | ■ | 17 | | | ■ |
| 18 | ■ | | ■ | 19 | ■ | 20 | ■ | | ■ | 21 |
| | ■ | ■ | 22 | | | | | ■ | ■ | |
| 23 | | 24 | ■ | | ■ | | ■ | 25 | | |
| | ■ | 26 | | ■ | 27 | ■ | 28 | | ■ | |
| 29 | | | ■ | 30 | | | ■ | 31 | | |

**నిలువు :**

1. రాముడిదాకా అక్కరలేదు; దీనికృప చాలునే అన్నాడు త్యాగరాజు.
2. విపణి వీధిలో అంగడి.
4. —!నోర్ముయ్. అన్నాడు హీరో.
5. పీతాంబరంలో ఆకాశం దాగిఉంది.
6. "చిక్కు" సరుకు. దీనితోనే చక్కటి వస్తువులు తయారుచేస్తారు.
10. బొద్దులు బసచేసి విహరించే చోటు.
11. అల వైకుంఠపురంబులో ఆమూల ఉన్నది.
14. ఇల్లు కట్టాలంటే ఇది తొక్కక తప్పదు; కాలు కడక్కా తప్పదు.
15. కరణముగారి లెక్కలో పొర తొలిగిస్తే కనబడితీరే గుణము.
18. ప్రియుడికోసం వెతుకుతూ పోయే ప్రబంధ నాయిక. హిందీలో ముందర 'ఇప్పుడే' అంటుంది.
19. ప్రభుత్వంచేసే నిర్వాకం!
20. వంకరమాట
21. కలగనేవాడు అనే మాటా మంతీ
24. సుగంధములో పరిమళ ద్రవ్యము.
25. —మా కాలొడ్డువారుందురా?
27. కోకటిపోటుకి ఇష్టమైంది ఈ చుట్టు. ఇందుమీద పడడం రివాజు. ★

## వెండితెర సత్యం

కొత్తసినిమా ఆదివారం మొదలు. కనుక హాలంతా క్రిక్కిరిసి పోయింది.

సినిమాలో ఒకవిషాదమయమైన సన్నివేశం సాగుతూంది.

అన్న మరణిస్తూ తమ్ములను చేరదీసుకొని "సోదరులారా, అందరం ఒక్క తల్లి గర్భాన జన్మించాము. రక్తం పంచుకొన్నాము. ఇప్పుడు నేను మిమ్మల్ని విడిచిపోతున్నాను. మనమింకకలుసుకోలేముకదా" అని విలపించాడు.

హాల్లో ఎవరో "మళ్ళీ రెండో ఆటకు కలుసుకుందురుగాని లెండి" అని అరిచారు.

పేరూరు శ్రీహరిరావు (కడపజిల్లా)



ప్రియురాలు: రైలువస్తుంది, త్వరగా తీయండి.

ప్రియుడు: పరవాలేదు—ఎర్రజండా ఎత్తాముగా?

చిత్రకారుడు—కాటూరి కృష్ణమూర్తి (నూతక్కి)

# పొట్టి కథలు

## జలప్రళయం

ఆ పల్లెటూరుకు కొత్తగా విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాటు అయింది. గ్రామంలో చాలా మంది గొల్లలుఉన్నారు. పాలు విక్రయిస్తూ ఉంటారు.

ఒకరోజు పాలకు గిరాకీ వచ్చింది. ఏమని పొరుగూరి మనిషి అడిగితే ఒక గొల్ల మనిషి చెప్పినది ఇది:

"మామూలుగా పాలు తీసుకొస్తున్నానండి. ఎలెక్ట్రిక్ లైటు క్రిందనుంచి వస్తూఉంటే వేడి ఎక్కువై బల్బ్ ఊడి గిన్నెలో పడిందండి. ఆవేడికి పాలు పొంగి ఊరంతా కొట్టుకు పోయిందండి."

"మరి నువ్వు ఏమైనావు" అని అడిగాడు శ్రోత.

"దానిలో నేనూ కొట్టుకు పోయి ఇక్కడ పడ్డానండి" అన్నాడు ఆ గొల్ల.

కె. శంభుప్రసాద్ (హుజూర్‌నగర్)

## 'పూరీ, కూరా!'

నాటకంలో పోలీసు పాత్ర ధరించడానికి మనిషి లేక పోయాడు. వ్యవధిలేదు. ఆపద్ధర్మంగా ఆ గ్రామంలో హోటల్‌లో పనిచేసేరాముడు, ఒడ్డూపొడుగూ ఉన్న మనిషిని ఒప్పించి ఆవేషం వేయించారు. దొంగను పట్టుకొన్న సందర్భంలో "ఓరీ క్రూరా!" అని భీకరంగా కేక వేయమని ఆతనికి బోధించారు.

తీరా ఆ రంగం వచ్చేసరికి పోలీసు వేషధారి అయిన రాముడు అలవాటు కొద్దీ భీకరంగా "పూరీ కూరా!" అని అరిచాడు.

గౌరంగరావు (హైదరాబాదు-4)

* * *

## మనిషి ముఖ్యం

ఒకానొక వ్యాపారస్థుడు "ఖర్జూరపు పండ్లో! వీశె ఏడు రూపాయిలూ!" అని కేకలువేస్తూవీధిలోపోతున్నాడు

ఒక గృహ యజమాని "ఓఖర్జూరపు పండ్లయ్యా! ఇలా రావయ్యా!" అని కేకవేశాడు.

ఆ వ్యాపారస్తుడు ఆయన దగ్గరికి వెళ్ళి "ఏమిస్వామీ, ఎన్ని వీశలుకావాలి" అని అడిగాడు.

గృహయజమాని ఇలా అన్నాడు! "నాకు పండ్లుకొనాలని లేదు. తినాలనీ లేదు. కాని ఖర్జూరపు పండ్లు వీశ ఏడు రూపాయలకు అమ్మే మనిషిని చూడాలని పిలిచాను. ధన్యుణ్ణి, ఇంక పోవచ్చును."

బి. రుద్రప్పనాయుడు (కృష్ణాజమ్మపురం)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at TheAndhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



మార్గశిరంబున  మామిడిపళ్లా

ఇది కాదుర మంత్రం 

ఐతే మిడ్‌లాండ్ 

తంత్రం

ఐస్‌క్రీమ్ 

లేదా సుఫ్లే  మిశ్రమభాగ్యం

రసభరితంబౌ

రుచి మిక్కిలి భోగ్యం

**Midland**

మిడ్‌లాండ్–రుచికరమైన 28 రకముల, పళ్లు, కాయగూరలు జామ్‌లు, జెల్లీస్, అండ్ కెచప్.

తయారు చేయువారు. మిడ్‌లాండ్ ఫ్రూట్ అండ్ వెజిటబుల్ ప్రాడక్ట్స్ (ఇండియా) మధురా




సోల్ డిస్ట్రిబ్యూటర్లు  కర్న్ ప్రాడక్ట్స్ కొ (ఇండియా) ప్రైవేట్ లి, బొంబాయి

భారతదేశంలో ఏజెంటు  ప్యారీ అండ్ కంపెనీ లిమిటెడ్.